# చతుర

డిసెంబరు 2010
రూ. 10/-

- నాలుగున్నర శతాబ్దాలనాటి ఫ్రెంచి నవల ..107

- కీ.శే. కొండముది శ్రీరామచంద్రమూర్తి చివరి నవల **ఈషణత్రయం** ..22
- ఉన్నవవారి మాలపల్లిపై ప్రత్యేక కథనం ..112
- డా.వాసిరెడ్డి సీతాదేవిపై ప్రత్యేక కథనం ..118

సంపుటి -33, సంచిక - 11
395వ సంచిక, పేజీలు : 132
డిసెంబరు 2010

# చతుర





**భ**ర్త మూర్ఖత్వానికి సుజాతకు జాలేసింది. "మహానుభావా! ఈ ఇంటినుండి తమరు తప్పుకోకపోతే మున్సిపాల్టీ ఎద్దులా చెత్తకుండీల చుట్టూ బరువు మోస్తూ తిరగాల్సి వస్తుంది. మనకు సరస శృంగారాలు ఉండవు. పిల్లలకు భవిష్యత్తు ఉండదు. హాస్యోక్తులుండవు. నా సౌందర్యం కృష్ణపక్షంలా తరిగిపోతుంది. మీకూ తొందరగా ముసలితనం వస్తుంది. బాధలతో జీవిత సారాన్నే కోల్పోతాం. అందుకని మనం వెళ్లిపోయి ఓ కొత్త స్వర్గాన్ని నిర్మించుకుందాం!" ఇంతకీ ఆ నవదంపతులు అనుకున్నది సాధించారా? ఇంటింటి రామాయణాన్ని ప్రతిభావంతంగా చిత్రించిన **కీ.శే. కొండముది శ్రీరామచంద్రమూర్తి** చివరి నవల **ఈషణాత్రయం** 22వ పేజీలో.. బొమ్మలు : భాస్కర్



# 2010లో ఇంప్రింట్‌వారి భారతదేశంలోని తీర్థయాత్రలు పుణ్యభూముల సందర్శనం



## శృంగేరి యాత్ర

గోకర్ణము, మురుదేశ్వర్, మూకాంబిక, ఉడిపి, ధర్మస్థల, హోరనాడు, శృంగేరి
4 రోజుల యాత్ర, రూ. 4000/- బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 13/8, 10/9, 8/10, 12/11, 10/12

## తమిళనాడు దర్శన్

వెల్లూర్, తిరుత్తని, కంచి, పాండిచ్చేరి, నవగ్రహ దేవాలయాలు, తిరువెంకాడ్, తిరుచ్చి, మధురై, కుర్తాళం, రామేశ్వరం, కన్యాకుమారి, శుచేంద్రం, త్రివేండ్రం.
7 రోజుల యాత్ర, రూ. 9500/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 28/1, 6/8, 18/9, 11/10, 8/11, 10/12

## మహారాష్ట్రా దర్శన్ అష్ట గణపతులు

షిరిడి, తుల్జాపూర్, కొల్హాపూర్, అక్కల్‌కోట్, 4 జ్యోతిర్లింగాలు
7 రోజుల యాత్ర, బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 9500/-
యాత్ర తేదీలు : 21/1, 19/2, 7/3, 3/4, 9/5, 17/6, 21/7, 19/8, 17/9, 18/10, 17/11, 17/12

## హిమాలయ దర్శన్

బాగేశ్వర్, బైద్యనాథ్, పాతాళభువనేశ్వర్, బేరీనాగ్, జాగేశ్వర్, రాణీకేత్, నైనితాల్. ఈ క్షేత్రముల యందు సాక్షాత్తు దేవతలు ప్రత్యక్షమగును.
రైలు, బస్సు, 10 రోజుల యాత్ర, ఖర్చు రూ. 16000/-
యాత్ర తేదీలు : 10/8, 9/9, 8/10

## గుజరాత్ దర్శన్ సోమనాథ్, నాగేశ్వర్

పంచద్వారకలు, గోపితలాప, మాతృగయ, జామ్‌నగర్, పోరుబందర్
7 రోజుల యాత్ర, బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 9500/-
రాజ్‌కోట్ వరకు రైలు అక్కడ నుండి బస్సు. యాత్ర తేదీలు : 7/7, 3/8, 24/8, 7/9, 21/9, 12/10, 26/10, 9/11, 23/11, 2/12, 23/12

## కేరళ యాత్ర

కాలడి, చోటాకినారా, రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల దేవాలయాలు గురువాయూరు, అలిపి, మున్నార్, త్రివేండ్రం, కన్యాకుమారి
9 రోజుల యాత్ర, రైలు, బస్సు ఖర్చు రూ. 10000/-
యాత్ర తేదీలు : 13/8, 13/9, 11/10, 12/11, 17/12

## ఉజ్జయిని ఓంకారేశ్వర్ యాత్ర

ఉజ్జయిని, హర్షవర్ధినిదేవి (శక్తిపీఠం), ఓంకారేశ్వర్, మహేశ్వర్, జ్యోతిర్లింగములు, ఆంజనేయస్వామి దేవాలయం, పార్వతి దేవాలయం
4 రోజుల యాత్ర, రైలు, బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 5500/-
యాత్ర తేదీలు : 14/8, 13/9, 17/10, 11/11, 18/12

## రాజస్థాన్ దర్శన్

జైపూర్, అజ్మీర్, బికనీర్, ఉదయపూర్, భరత్‌పూర్, మౌంట్‌అబు
10 రోజుల యాత్ర, రైలు, బస్సు ప్రయాణం. రూ. 14000/-
యాత్ర తేదీలు : 9/1, 20/2, 20/3, 10/4, 8/5, 9/6, 17/7, 21/8, 18/9, 9/10, 20/11, 18/12

## ఒరిస్సా, బెంగాల్, అస్సాం దర్శన్

పూరీ, సాక్షిగోపాలం, కటక్, భువనేశ్వర్, గిరిజాదేవి, కాళీమాత దేవాలయం, గంగాసాగర్, చందాసాగర్, తారకేశ్వర్, దక్షేశ్వర్, శాంతినికేతన్, బ్రహ్మపుత్రానది, ఉమానందా దేవాలయం, పీకాక్ ఐలాండ్, కామాఖ్యా దేవాలయం.
12 రోజుల యాత్ర. రూ. 14000/-, రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 6/8, 3/9, 4/10, 4/11, 6/12

## కాశీ, గయ, ప్రయాగ

కాశీయందు పిండప్రదానం చేయు వారికి ఆంధ్రప్రదేశ్ తూర్పుగోదావరి జిల్లాకు చెందిన ఋత్వికులచే తీర్థ కార్యక్రమాలు జరుపుకొనే సౌకర్యం కల్పించబడును. 6 రోజుల యాత్ర. రూ. 5,500/- (భోజనములు కాక)
రైలు, బస్సుప్రయాణం. యాత్ర తేదీలు : ప్రతీ బుధవారం

## చార్‌ధామ్ యాత్ర

హరిద్వార్, హృషీకేశ్, యమునోత్రి, గంగోత్రి, కేదార్‌నాథ్, బదరీనాథ్.
15 రోజుల యాత్ర. రూ. 15,000/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 5/8, 19/8, 26/8, 2/9, 16/9, 30/9

## ద్వాదశ జ్యోతిర్లింగ యాత్ర

శ్రీరామేశ్వరం, శ్రీశైలం, భీమాశంకర్, శ్రీ త్రయంబకేశ్వర్, ఘృష్ణేశ్వర్, పర్లీవైద్యనాథ్, శ్రీనాగేశ్వర్, శ్రీసోమనాథ్, ఉజ్జయిని, శ్రీ ఓంకారేశ్వర్, శ్రీ కేదార్‌నాథ్, వారణాసి. 23 రోజుల యాత్ర. రైలు, బస్సు ప్రయాణం.
రూ. 25,000/- యాత్ర తేదీలు : 29/8, 28/9


వివరాలకు :




దంటు నాగార్జున శర్మ, ఇంప్రింట్ ట్రావెల్స్ & టూర్స్
ప్లాట్ నెం. 504, సంయుక్తా అపార్ట్‌మెంట్స్, అంబాలికా ఫర్నిచర్ పైన, రాజా డీలక్స్ ఎదురుగా, ముషీరాబాద్, హైదరాబాద్ - 20. ఫోన్ : 040 – 2754 7708/2754 7709, సెల్ : 98850 89092

అపార్ట్‌మెంటాలజీ 35

# సరదాగా మనీకోసం



## యర్రంశెట్టి శాయి

*(గత సంచిక తరువాయి...)*

"నాకెప్పుడూ అంతేరా భయ్! రెండో బీర్ కొడితే సూపర్‌ఫాస్ట్‌గా వర్క్‌చేస్తుంది బ్రెయిన్!" హేపీగా, గర్వంగా చెప్పాడు విజయ్.

"ఇంతకూ ఏంటా అయిడియా? "

"మరేంలేదు. నువ్వివాళ నైట్ పోతావ్"

"ఎక్కడికి? " ఆశ్చర్యంగా అన్నాడు బోస్.

"ఇంకెక్కడికి? పైకి"

"వాట్? పైకా? "

"అవ్"

"అంటే? "

"అంటే.. ఆపరేషన్ కాగానే కాంప్లికేషన్స్ వచ్చాయ్. దాంతో హార్ట్ ఫెయిలయింది. చచ్చావనుకో.. అప్పుడు నిన్నింక బాసేం చేస్తాడు? "

"కానీ నేను నిజంగా ఛావను కదా!"

"ఛావవ్"

"మరి బాస్‌కెలాజెప్తాం.. చచ్చానని"

"చూ(డ్రాభయ్! నువ్వీ హెడేక్ నుంచి బతికి బయటపడాలంటే అదొక్కటే ప్లాన్! నేనూ, మనోడూ బాస్ దగ్గరకెళ్ళి నువ్ చచ్చిపోయావని చెప్తాం! దాంతో నీ డ్రామా బయటపడకుండా సేవ్ అవుతావ్"

బోస్‌కి కోపం వచ్చింది.

"ఏడ్చినట్లుంది. నేను చచ్చానని చెప్తే ఇంక మళ్ళీ నా ఉద్యోగానికెలావస్తాను? "

"ఇంకెక్కడి ఉద్యోగం? ఇంకో కంపెనీలో జాబ్ వెతుక్కోవటమే"

"అంటే మళ్ళీ నెలరోజులు జాబ్ కోసం తిరగాలి"

"లక్షరూపాయలు వస్తాయ్ కదా! తిరుగు"

బోస్ చాలాసేపు ఆలోచించాడు.

"నీమీద మెడికల్ రిఎంబర్స్‌మెంట్ ఫ్రాడ్ కేస్ రాకుండా ఉండాలంటే అదొక్కటే మార్గం! లేకపోతే జైలుపాలవుతావ్"

గత్యంతరంలేక ఒప్పుకున్నాడు బోస్.

మర్నాడు మేమిద్దరం వెళ్ళి బాస్‌కి ఆ విషాద వార్త చాలా విషాదంగా చెప్పాం!

పుష్పారావ్ పాపం నిజంగానే అప్సెట్ అయిపోయాడు.

"అయ్యో పాపం! అనవసరంగా అతని ఆపరేషన్ అనుమానించానే" అన్నాడు.

"ఆఫీస్‌లోని అందరం కలసి శ్మశానానికెళ్దాం" అన్నాడు ఆఖర్లో.

ఉలిక్కి పడ్డాం!
అలా జరిగితే బోస్ డ్రామాలో మేమి ద్దరం కూడా ఇరుక్కుపోతాం.
"ఇక్కడెక్కడసార్? బోస్ బాడీని శ్రీకాకుళం తీసుకెళ్ళిపోయారు" అన్నాడు విజయ్ యాదవ్ ఠక్కున.
"అక్కడికెందుకు? "
"అతని బంధువులంతా అక్కడే అంత్యక్రియలు జరగాలని పట్టుబట్టారు సార్"
ఆఫీస్‌లో అందరం రెండు నిమిషాలు బోస్ ఆత్మశాంతికోసం మౌనం పాటించాం!
వెంటనే బోస్‌కి ఫోన్ చేసి ఓవారం పాటు ఏదయినా ఊళ్ళో గడిపి అప్పుడు సిటీకి తిరిగి రమ్మన్నాం. అలా అయితేనే ఆ మేటర్ అడుగుకుపోతుంది. బోస్ వెంటనే ఫామిలీతో వెళ్ళిపోయాడు.
పది రోజులయ్యాక బోస్ తిరిగివచ్చాడు.
ఆ రోజు సాయంత్రం నేనూ, విజయ్, మా ప్రెసిడెంట్ హమీద్‌మియా బోస్ ఇంట్లో మాట్లాడుతూ కూర్చునివుంటే డోర్ బెల్ మోగిన చప్పుడయింది.
"ఎందుకయినా మంచిది- ఎవరొచ్చారో చూసి అప్పుడు ఓపెన్ చెయ్" అన్నాడు విజయ్ యాదవ్.
బోస్ అద్దంలో నుంచి చూసి గాబరాగా పరుగెత్తుకొచ్చాడు.
"మన కొత్తబాస్" అంటూ లోపలి గది లోకి పరుగెత్తాడు. వెనుకే నేనూ, హమీద్‌మియా పరుగెత్తి, తలుపు మూసేశాం. విజయ్‌యాదవ్ డోర్ ఓపెన్ చేశాడు.
"గుడ్‌మాణింగ్ సార్". అన్నాడు ఆశ్చర్యం నటిస్తూ.
"గుడ్‌మాణింగ్. నువ్వు ఇక్కడే ఉన్నావన్నమాట.. వెరీగుడ్! నేనే రింగ్ చేద్దామనుకుంటుండినా" అన్నాడు.
"అన్నట్లు బోస్ ఫ్లాట్ ఇదేకదూ? "
"ఇదే సార్! ఇదే ఇదే. రండి! కూర్చోండి"
"అదే బోస్ మిసెస్‌కి మనాఫీస్ తరపున



కండోలెన్స్ చెబుదామని వచ్చాను" అంటూ సోఫాలో సెటిలయాడు.
"ఓహో అలాగా! మేమూ అందుకే వచ్చాం సార్. ఇప్పుడే ఆమెను పిలుస్తా" అంటూ వంటింట్లోకెళ్ళి బోస్ మిసెస్‌ని పిల్చుకొచ్చాడు.
ఆమె వస్తూనే భోరున ఏడుస్తూ వచ్చింది హాల్లోకి. ఏడుస్తూనే "నమస్తే" అంది.
"నమస్తే- పాపం! ఊరుకోండి. పాపం- బోస్ ఇంత త్వరగా పోవలసినవాడు కాదు!" అన్నాడు పుష్పారావ్.
లోపలున్న మాకు ఆశ్చర్యం కలిగింది.
ఇంత త్వరగా పోవల్సినోడు కాదంటే ఏమిటర్థం?
"మా ఆఫీస్ కోసం అతను ఎంతో కష్టపడి వర్క్ చేయటంవల్లే మా కంపెనీకి రెండు వందల కోట్ల లాభం వచ్చింది!" అన్నాడు పుష్పారావ్.
బోస్ హేపీగా ఫీలయ్యాడు.



"చూశావా! నా వాల్యూ మన హెడ్డాఫీస్ వాళ్ళక్కూడా తెలుసు"

నేను కొంచెం జెలసీగా ఫీలయ్యాను. ఎందుకంటే బోస్‌తో పాటు అందరం ఈక్వల్‌గా వర్క్ చేస్తున్నాం.

ఈలోగా పుష్పారావ్ మళ్ళీ మాట్లాడాడు, "లేకపోతే మామూలుగా ఆరొందల కోట్ల లాభం వచ్చేది మా కంపెనీకి"

బోస్ ఉలిక్కిపడ్డాడు. "అంటే ఆ నాలు గొందల కోట్ల లాస్ నా వల్ల వచ్చింద నేగా? " మండిపడుతూ అన్నాడు.

"పాపం- ఉన్న ఒక్క మొగుడినీ పోగొ ట్టుకోవటం మీకెంత బాధాకరంగా ఉంటుందో మేము ఊహించుకోగలం!"

ఆ డైలాగ్‌తో మాకు మతిపోయింది.

ఆడదానికి ఒక మొగుడు కాకపోతే ఎంతమందుంటారు?

"మీ భర్తలేని లోటుని తీర్చటం అసాధ్య మని నాకు తెలుసు శ్రీదేవిగారూ! అయినా గానీ నా ప్రయత్నం నేను చేస్తాను"

హమీద్‌మియా షాకయ్యాడు.

"క్యాహై? వీడు అట్లా మాట్లాడుతు న్నయ్? మొగుడు లేని లోటు వీడు ఎట్లా తీరుస్తయ్? "

"అవును గురూ! వీడి మాటలు తేడాగా ఉన్నయ్" అన్నాడు బోస్ డౌటుగా.

"సార్- ఇంక వెళ్దామా మనం? " అన్నాడు విజయ్ యాదవ్ అతని డైలా గులు భరించలేక.

"నీకేమయినా అర్జంటు పనుందా? " అడిగాడు పుష్పారావ్.

అవునంటే తనతోపాటు బయటికొచ్చేస్తా డనుకుని "అవున్సార్, అర్జెంట్ వర్క్"

"సరే! అయితే నువ్వెళ్ళిపో. నేను కాసేపు ఈమెకు ధైర్యం చెప్పి వస్తా" అన్నాడు పుష్పారావ్. దాంతో విజయ్ యాదవ్‌కి బయటకు వెళ్ళక తప్పలేదు.

"అలా నుంచున్నారేం శ్రీదేవీ! రా! ఇలా కూర్చో" అన్నాడు బోస్ భార్యతో బాస్.

శ్రీదేవి కొంచెం డౌటుగానే అతనికెదు రుగ్గా సోఫాలో కూర్చుంది.

"మీరు మరీ అంత విచారంగా వుండ కూడదు. పోయినోడితోపాటు మనమూ పోలేం కదా"

ఆమె తలూపింది నిజమేనన్నట్లు.

"మా మిసెస్ పోయినప్పుడు నేనూ ఒక వారం ఇలాగే ఫీలయ్యా శ్రీదేవీ! తర్వాత జ్ఞానోదయం కలిగి లైఫ్‌ను ఝామ్మంటూ ఎంజాయ్ చేస్తున్నా"

'వీడు ఈ డైలాగ్స్ ద్వారా ఎటు డ్రైవ్ చేస్తున్నాడో అర్థం కావటంలేదు' అను కుంది శ్రీదేవి.

"ఇప్పుడు మనిద్దరం ఒంటరివాళ్ళమే కాబట్టి- ఒకరికొకరు తోడయి జీవితం గడు పుదాం శ్రీదేవి" అన్నాడు పుష్పారావ్.

శ్రీదేవితోపాటు లోపలున్న మేముగ్గురం కూడా అదిరిపడ్డాం.

"అంటే ఏంటి వాడి ఉద్దేశ్యం" రహ స్యంగా, కోపంగా అన్నాడు బోస్.

# ఎన్ని రకాల చావులో!

దుబాయ్‌లో ఏటా సగటున వంద మందికి పైగా ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. అక్కడి పోలీసులకు డైరెక్టర్ ఆఫ్ ది క్రైమ్ మానిటరింగ్ డిపార్ట్‌మెంట్ శాఖ ఉంది. వీరు వివిధ నేరాల గురించి పరిశోధనలు చేస్తుంటారు. లెఫ్టినెంట్ కల్నల్ జమాల్ అల్ జల్లాస్, తమ దేశంలో 2004 నుంచి జరిగిన అన్ని ఆత్మహత్యల కేసులను పరిశీలించి కీలకమైన విషయాలు వెల్లడించారు.



★ అక్కడ ఎక్కువమంది ఆసియావాసులే ఆత్మహత్యలకు పాల్పడతారు.

★ ఉరి వేసుకుని మరణించేవారి సంఖ్య అధికం. తాడు, వైర్, బెల్ట్, దుస్తులనుపయోగించి సీలింగ్ ఫ్యాన్‌కో, చెట్టుకో ఉరేసుకుంటారు.

★ రెండో పద్ధతి పురుగుల మందు, ఫినాయిల్‌లాంటి విష పదార్థాలు తాగి మరణించడం. స్త్రీలలో చాలా మంది పద్ధతి ఇదే.

★ మూడో పద్ధతి పెట్రోల్ పోసుకొని అంటించుకోవడం.

★ ఎత్తయిన భవంతుల పైనుంచి దూకటం ఇంకో పద్ధతి. ఆడవారే ఈ పని ఎక్కువగా చేస్తుంటారు.

★ వేగంగా వచ్చే వాహనాల కింద పడి మరణించేవారి సంఖ్య మాత్రం అరుదు.

★ డ్రగ్ అడిక్ట్‌లు మణికట్టు నరం తెంపుకుని రక్తం కార్చుకుని చస్తుంటారు.

ఎక్కువగా విదేశాల నుంచి వలస వచ్చిన నిర్మాణరంగం కార్మికులు, ఇంటిపని చేసేవాళ్లు, డ్రగ్ అడిక్ట్స్ ఆత్మహత్య చేసుకుంటుంటారు.

పేదరికం, పని ప్రదేశంలో అవమాన భారం, వైవాహిక బంధంలో కలహాలు, డ్రగ్స్‌కు బానిసలవ్వడం ఆత్మహత్యలకు ప్రధాన కారణాలు.




# ప్లేబాయ్ కిక్కు




ఇల్లినాయిస్ రాష్ట్రంలో ఓక్లాన్ పబ్లిక్ లైబ్రరీలో ప్లేబాయ్ మేగజైన్ చూసి మార్క్ డెకర్స్ విస్తుపోయాడు. ఆ పత్రికను ఆ రాష్ట్రంలోని లైబ్రరీల్లో తెప్పించకూడదని నిషేధం ఉంది. దాన్ని టైమ్, న్యూస్‌వీక్‌లను ఉంచే షెల్ఫ్‌లో బాహాటంగా ఉంచారు. 1973 నుంచి అన్ని ప్లేబాయ్ పత్రికలు ఆ లైబ్రరీలో ఉన్నాయి. ఈ విషయంపై ఫిర్యాదుకు లైబ్రేరియన్ ఇచ్చిన సమాధానమిది- "వయసు రుజువు చూపిస్తే పెద్దవారికి మాత్రమే వీటిని ఇస్తాం. ఎవరో పొరపాటున ఓ సంచికని ఓపెన్ షెల్ఫ్‌లో పెట్టివుంటారు".

షికాగో ట్రిబ్యూన్‌లో ఈ వార్త రాగానే ఆ లైబ్రరీలో ఒకేరోజు 440 మంది కొత్తగా సభ్యులు చేరారట.

"ష్! అరవకు" అన్నాన్నేను.

"ఈ దుఃఖసమయంలో నీకు కొండంత అండగా నేనుండాలన్న ఉద్దేశ్యంతోనే నీకు 'భర్త పోయిన లేడీస్' కోటాలో నా సెక్రట రీగా జాబ్ ఇవ్వాలనుకుంటున్నా"

'ఇదేదో బాగానే ఉందే' అనుకుంది శ్రీదేవి.

"థాంక్యూ అండీ!"

"ఇది టిప్ ఆఫ్ ఐస్‌బర్గ్ అనుకో శ్రీదేవీ! ఒకసారి నా దగ్గర ఉద్యోగంలో చేరావ నుకో! నిన్ను పువ్వుల్లో పెట్టి చూసు కుంటా!" శ్రీదేవి షాకవటం గమనించి డైలాగ్‌కి సవరణ చేశాడు పుష్పారావ్.

"అంటే అంత ప్రొటెక్షన్ నీకు ఏర్పాటు చేస్తానన్నమాట"

"డెఫినెట్‌గా వీడు శ్రీదేవిని ట్రాప్ చేయ డానికి ట్రై చేస్తున్నాడు సార్" అన్నాడు బోస్ హమీద్‌మియాతో.

"కాసేపు వాగి వాడే పోతయ్‌లే! సబర్ కరో" అన్నాడు హమీద్‌మియా.

"అవును! ఓవర్ రియాక్టవకు" అన్నా న్నేను కూడా సర్దిచెప్తూ.

"నన్నడిగితే- ప్లీజ్ డోంట్ థింక్ అదర్ వైజ్- నీమీద బాగా ఇది ఉన్నవాడిగా చెప్తున్నా.. నువ్ వీలైనంత త్వరగా ఇంకో పెళ్లి చేసుకుని సెటిలవటం మంచిది శ్రీదేవీ! మీకు తెలీందేముంది? భర్తలేని స్త్రీ జీవితం కుక్కలు చింపిన విస్తరవుతుందని మన పెద్దలు చెప్పారు కదా!"

శ్రీదేవి కోపంగా చూసిందతనివేపు. పుష్పారావ్ అక్కడితో ఆగకుండా కంటిన్యూ చేశాడు డైలాగ్!

"నేనూ అంతే! ఇంకో పెళ్ళి చేసుకోవా లనే డిసైడ్ చేసుకున్నా! పేపర్లో ప్రకట నలు కూడా ఇచ్చాకానీ నేను కోరుకునే గుణగణాలున్న అమ్మాయి దొరుకుతేనా? "

"ట్రై చేస్తూంటే ఏదొకరోజు దొరకకపో దులెండి" అంది శ్రీదేవి అతనిని వదిలిం చుకోడానికి ట్రై చేస్తూ.

"కష్టం! చాలాకష్టం! నీలాంటి సుగుణాల రాశులు ఎంతమంది ఉంటారు చెప్పు ఈ లోకంలో! ఒకళ్ళో ఇద్దరో- అంతే!! వాళ్ళిద్ద రికీ ఎప్పుడో పెళ్ళిళ్ళయిపోయి ఉంటాయ్- లక్కీగా. ఇప్పుడు నువ్వు మళ్ళీ ఒంటరివికా వడం.. అది కేవలం నా అదృష్టం అను కుంటున్నా"

"అంటే మీ ఉద్దేశ్యం? " కొంచెం కోపంగా శ్రీదేవి అనటం మాకు వినిపిస్తూనే ఉంది.

"చూడు శ్రీదేవీ.. ఇంతదూరం వచ్చాక ఇంక ముసుగులో గుద్దులాట అనవసరం. నా మనసులో ఉన్నదంతా చెప్పేస్తా! నువ్వు వయసులోనే ఉన్నావింకా! నేనూ కొంచెం మిడిలేజ్ లెవల్లోనే ఉన్నా! మనం లైఫ్‌లాంగ్ ఉప్పూకారం తినే శరీరం తాలూకు కోర్కెల్ని ఎలా అణుచుకుంటాం చెప్పు! నేను కొంతకాలం అణచుకుందా మని ట్రై చేశా! కానీ కొద్దిరోజులయ్యేసరికి డబుల్ ఫోర్స్‌తో స్ప్రింగ్‌లాగా ఎగిరి బయ టకు దూకినయ్"

"ఇవన్నీ నాకెందుకు చెప్తున్నారు? " కోపంగా అంది శ్రీదేవి.

"ఎందుకంటే నేను వెతుకుతోన్న లైఫ్ పార్ట్‌నర్ లక్షణాలన్నీ నీలోనే ఉన్నాయని నాకనిపించింది. అందుకనీ.."

"మీరు నన్ను చూడడం ఇదే మొదటిసా రికదా! ఈ రెండు నిముషాల్లోనే నాలోని గుణాలన్నీ మీకెలా తెలిసినయ్? కొంచెం ఓవర్‌గా మాట్లాడుతున్నట్లు మీకనిపించ టంలేదూ? " అడిగింది శ్రీదేవి.

"ఆహా! వండర్‌ఫుల్ పాయింట్! బ్యూటి ఫుల్ కొశ్చెన్! ఇంత తెలివిగల కొశ్చెన్ వేసే కెపాసిటీ నీలాంటి బ్యూటీస్‌కే ఇస్తాడు దేవుడు! సంగతేంటంటే నేను సుమారు అయిదేళ్ల క్రితమే నీతో లవ్‌లో పడ్డాను. కానీ నువ్ మారీడ్ అని తెలిసి నా మనసులో ఫీలింగ్స్ ఎప్పుడూ నీతో

చెప్పలేదు. మనసును రాయి చేసుకున్నా"
"అబద్ధం! మనం కలుసుకోవటం ఇదే మొదటిసారి"
"అది నీ ఫీలింగ్! కానీ ఒక్కసారి అయిదేళ్ళక్రితం ఫ్లాష్‌బాక్‌లోకి వెళ్లు! మన హెడాఫీస్‌లో యానివర్సరీ సెలబ్రేషన్స్! హైదరాబాద్ నుంచి నువ్వూ, బోసూ ఢిల్లీ వచ్చారు. ఆ రోజు కల్చరల్ ఫంక్షన్స్‌లో నువ్ స్టేజ్ మీద ద్రౌవది ఏకపాత్రాభినయం చేశావ్.. గుర్తుందా? "
"అవును"
"దానికి నేనే జడ్జీని. నీకు బెస్ట్ పెర్ఫార్మెన్స్ అవార్డ్ రికమెండ్ చేసింది ఎవరనుకున్నావ్? నేనే! అప్పుడే- ఆ రాత్రే- నువ్ స్టేజ్ మీద అద్భుతమైన కాస్ట్యూమ్స్, మేకప్, హెయిర్‌స్టైల్‌తో నటిస్తూంటే- నేను థ్రిల్ అయిపోయాను. ఇన్‌స్టెంట్ లవ్‌లో పడిపోయాను. ఇంత కాలానికి - నా ప్రేమ ఫలించే క్షణాలొచ్చినయ్"
"అమ్మనా కొడుకు! నా పెళ్లాం మీద అప్పట్నుంచే కన్ను వేశాడన్నమాట" ఉడికిపోతూ అన్నాడు బోస్.
శ్రీదేవికి ఏంమాట్లాడాలో తోచట్లేదు.
"చూడండి! మీపట్ల నాకలాంటి ఫీలింగ్సేమీ లేవు. దయచేసి మీరింక వెళ్ళండి" అంది కంగారుగా.
"ఎలా వెళ్తాను శ్రీదేవీ! మొగ్గలు తొడిగిన నా ప్రేమ, పుష్పించే రోజొచ్చిందని, నువ్ నా కోరికను దయతో అంగీకరిస్తావనీ గంపెడాశతో వచ్చాను. ఒకవేళ నా ఫైనాన్షియల్ స్టేటస్ గురించి ఆలోచిస్తున్నావేమో! నాకు అరవై లక్షల బ్యాంక్ బాలెన్స్ ఉంది. పంజాబ్‌లో ఒక ఫైవ్ బెడ్‌రూమ్ ఫ్లాటు ఉంది. జీతం నెలకు లక్షన్నర! మనం ప్రతి సంవత్సరం నెల రోజుల పాటు అన్ని దేశాలూ టూర్ చేసి రావచ్చు ఇంట్లో ఇద్దరు నౌకర్లు- లైఫ్ ఎంత అద్భుతంగా ఉంటుందో ఒక్కసారి ఆలోచించుకో"




బోస్ ఇంక సహించలేకపోతున్నాడు.
"గురూ! ఇంక లాభం లేదు. నేను చావలేదన్న సంగతి బయటపడితే పడింది. వెళ్ళి వాడి అంతు తేల్చేస్తాను"
"ష్! తొందరపడకు.. ముందు వాడిని బయటకు పోనీ"
"కానీ వాడలా లక్షలు, కోట్లు అంటూంటే శ్రీదేవి టెంప్ట్ అయి వాడిని చేసుకోడానికి ఒప్పుకుంటుందేమో"
"ఛట్! కట్టుకున్న పెళ్ళాన్నే నమ్మలేవా? "
"పెళ్ళాన్ని నమ్ముతా బ్రదర్! కానీ వాడు చూపిస్తోన్న మనీ ఎంత ఎక్కువో కదా? దానివల్ల నేను ఎవర్నీ నమ్మలేను. ప్రతి మనిషికి ఒక రేటుంటుందని గొప్పోడెవడో ఏదో పుస్తకంలో రాశాడని మన అపార్ట్‌మెంట్స్‌లో ఉండే అహల్యారావ్ చెప్పాడు!"
"అహల్యారావంటే అతని వైఫ్ ఎవర్తోనో ఎగిరిపోయిందంటారు- అతనేనా? "
"అవును!"
"ఏడ్చాడు. వాడి మాటలు నమ్మకు"



"నమ్మకుండా ఎలా ఉంటాను? పైగా వాడిది లవ్ మ్యారేజ్"

పుష్పారావ్ హఠాత్తుగా లేచి శ్రీదేవి దగ్గరకొచ్చాడు.

"శ్రీదేవీ! అద్భుతమయిన అవకాశం. నీ తలుపు తట్టి పిలుస్తోంది. రా! కదలిరా! పుష్పారావ్ స్వర్గసీమ పిలుస్తోంది! రా! లేచిరా!" అంటూ ఆమె చేతులు పట్టుకుని పాట మొదలుపెట్టాడు.

"నీకూ నీవారూ లేరూ - నాకూ నావారు లేరు - ఇద్దరమొకట్టై ఎగిరిపోదామా? చల్ మోహనరంగా"

ఇంక బోస్ ఆ సీన్‌ను తట్టుకోలేకపోయాడు.

"ఏమైతే అయింది.. వాడిని వీర ఉతుకుడు ఉతుకుతా" అంటూ బయటకు ఒక్క ఉదుటన పరుగెత్తాడు.

వాడి వెనుకే మేమూ పరుగెత్తాం.

"చెయ్యి వదలండి! ప్లీజ్.." అంటోంది శ్రీదేవి గింజుకుంటూ.

"శ్రీదేవి- ఇదిగో.. తాళి జేబులో పెట్టుకొచ్చాను. ఇవాళ మంచి రోజని పురోహితుడు చెప్పాడు. ఆ దేవుడి గదిలో ఈ తాళి కడతా. ఇద్దరం - ఈ క్షణంలోనే ఒకటయిపోవాలి" అంటుంటే అతని భుజం మీద బరువుగా చేయి వేశాడు బోస్ వెనుకనుంచీ వెళ్లి.

"అంత తొందరేంట్రా! ఓ నాల్రోజులాగలేవా? "

బోస్ గొంతువిని పుష్పారావ్ ఉలిక్కిపడతాడనీ, అతనిని చూసి దెయ్యం, దెయ్యం అంటూ గదంతా పరుగెడతాడని మేము ఒక విజువల్ వేసుకున్నాంగానీ అలాంటిదేమీ జరగలేదు. సరికదా, అది ఊహించిందే అన్నట్లు వెనక్కు తిరిగి చిరునవ్వు నవ్వాడతను.

"వచ్చావా బోసూ! నీ ఓర్పుకి నా జోహార్లు"

"పిచ్చివాగుడు వాగకు. నా భార్యతో ఏమిటీ పేల్తున్నావ్? దాన్ని ప్రేమించావా? అందుకని ఇప్పుడు పెళ్లి చేసుకుంటావా? " ఆవేశంగా అడిగాడు బోస్.

"అదంతా తర్వాత మాట్లాడదాం! సరే, ముందు నీ సంగతి చెప్పు! పోయినవాడు తిరిగి బతకటం ఈలోకంలో ఎప్పటి నుంచి మొదలయింది."

"నాతోనే మొదలు"

"అది నీతోనే ఫినిష్ కావాలనే ఈ డ్రామా ఆడానోయ్"

"ఏంటి? నువ్వాడింది డ్రామానా? "

"అవును మరి! నిన్ను లోపలి గదిలో నుంచి బయటకు రప్పించాలంటే ఇంత కంటే ఇంకో ప్లాన్ లేదుమరి"

"అంటే? నేను పోలేదని మీకు ముందే తెలుసా? " డౌటుగా అడిగాడు బోస్.

"మీ బాంక్ మేనేజరకి ఫోన్ చేస్తే చెప్పాడు, నువ్ ఇవాళే వచ్చి డబ్బు డ్రా చేసుకెళ్లావని. అయినా నీ మెడికల్ ఫ్రాడ్ విషయం నాకు ముందు నుంచే డౌటుగానే

ఉంది. అందుకే నిన్ను ట్రాప్‌లోకి లాగా! నువ్వే నాకంటే తెలివిగల వాడిలాగా కొత్త డ్రామా స్టార్ట్ చేసి చావు దెబ్బతిన్నావ్"

బోస్ నీరసంగా సోఫాలో కూలబడిపోయాడు విచారంతో.

"అయినాగానీ- బోస్‌భార్యతో మీరు ప్రవర్తించిన తీరు తప్పు" అన్నాన్నేను.

"చెప్పాను కదా! అదంతా డ్రామా అని. చూడమ్మా శ్రీదేవీ! ఈ డ్రామా కోసమే నా మిసెస్ చనిపోయిందని నీకు అబద్ధం చెప్పా! అమె బతికే ఉంది. హెడ్డాఫీస్ నన్ను ఇక్కడికి ఈ మెడికల్ బిల్ ఫ్రాడ్ అరికట్టటానికే పంపించింది.

కనుక ఈ కేసుని ఛాలెంజింగ్ కేసుగా తీసుకుని క్రాక్ చేశాను. నా మాటల్తో నిన్ను కాస్త హర్ట్ చేసివుంటే ప్లీజ్ ఎక్స్‌క్యూజ్ మీ" అన్నాడు పుష్పారావ్.

"అంటే ఇప్పుడు మీరేం చేస్తయ్? బోస్ మీద కేస్ పెడతయ్? " అడిగాడు హమీద్ మియా.

"అవసరం లేదు.. బోస్ నాటకం ఎక్స్‌పోజ్ చేయటం ద్వారా ఇకముందు ఆఫీస్‌లో ఎవరూ మెడికల్ బిల్ ఫ్రాడ్ చేయకుండా ఒక వార్నింగ్ ఇచ్చాను. అంతే - డీకేబోస్. వస్తా.. వస్తానమ్మా శ్రీదేవి" అంటూ అతను బయటకు నడుస్తూంటే వెంటపడ్డాను.

"సార్! మరి ఇక బోస్ ఉద్యోగం పోయినట్లేనా? "

"అంత సివియర్ స్టెప్ తీసుకోదల్చుకోలేదు. కానీ పనిష్మెంట్‌గా అతని ఉద్యోగం అతని భార్యకిస్తున్నా!"

మేము ఉలిక్కిపడ్డాం.

లోలోపల లక్ష అనుమానాలు వచ్చినయ్.

కానీ అప్పటికే బాస్ అక్కడినుంచి కార్లో వెళ్లిపోయాడు. ©

# రూపాసింగ్

హాయిగా సాయంత్రం సంధ్యాసమయాన్ని ఆస్వాదిస్తూ, సాగర్‌పై నుంచి వీచే చల్లని గాలుల్ని ఆఘ్రాణిద్దామని అప్పుడే ట్యాంక్‌బండ్‌కు చేరుకున్నాడు గణేశ్.

వచ్చి అలా బెంచీపై కూర్చున్నాడో లేదో 'కొక్కొరోక్కో...' అంటూ మోగింది మొబైల్. చిరాకుగా దాని వంక చూశాడు. తెలిసిన నెంబరు కాదు. వెంటనే కట్ చేశాడు.

ఐదునిముషాలు గడిచింది.. మళ్లీ అదే నెంబరు నుంచి కాల్!

విసుగ్గా ఎత్తాడు గణేశ్.

'హలో.. ఆర్యూ మిస్టర్ గణేశ్?'

'యా'

'గుడీవినింగ్ మిస్టర్ గణేశ్! కెన్ యూ



స్పేర్ జస్ట్ టు మినిట్స్ ఫర్ మి?' అభ్యర్థనగా అడుగుతోందో కోమల కంఠం.

ఈ మహాతల్లి క్రెడిట్‌కార్డు ఇస్తామనో పర్సనల్ లోన్ ఇస్తామనో పీక్కుతింటుంది కాబోలు అనుకుంటూనే 'ఫర్ వాట్ సేక్?' అన్నాడు గణేశ్ తన విసుగును మాటల్లో కన్పించకుండా.

'మిస్టర్ గణేశ్.. ఐ యామ్ రమా..' ఆ కంఠంలో ఏదో ఆదుర్దా.

'రమా?..' అంటూ ఇలాంటి పేరున్న శాల్తీ మనకెవరూ తెలీదే మనసులో అనుకున్నాడు గణేశ్.

'యా గణేశ్! ఐ యామ్ రమా.. ఆఫ్‌కోర్స్! యూ డోన్ట్ హావ్ ఏన్ ఐడియా అబౌట్ మీ. యూనో రాజేష్ యువర్ జూనియర్ కొలీగ్?..'




గణేశ్ ఓపిక నశిస్తోంది.. అయినా మర్యాద కోసం అన్నాడు 'ఓకే.. వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ మేడమ్?'

'యా గణేశ్ ఐ యామ్



**ఆ మాటలు వినగానే గణేశ్ ఒక్కసారిగా కంగుతిన్నాడు..**
**'హలో హలో..' అంటుండగానే అవతలివైపు ఫోన్ డిస్కనెట్ అయింది.**
**మళ్లీ అదే ఫోన్‌కు ట్రైచేస్తే స్విచాఫ్ మెసేజి వచ్చింది.**

రమా! వైఫాఫ్ రాజేష్, రమారాజేష్! సీక్ యువర్ హెల్ప్ ప్లీజ్ డోంట్‌సే నో..' ఫోన్‌లో అవతలివైపు ఏడుస్తున్న శబ్దం.

గణేశ్‌కు బుర్ర తిరిగిపోయింది. ఎవరీ రమారాజేష్? తన కొలీగ్ రాజేష్ ఎవరూ లేరే? కానీ అవతల ఆమె ఏదో ఇబ్బందిలో ఉన్నట్టుంది. ఇదేదో రాంగ్‌నెంబరు కాల్‌లా ఉంది.. ఎందుకొచ్చిన తలనొప్పి రాంగ్‌నెంబరు అని చెప్పేస్తే పోలా? అని నోరు విప్పబోతుండగా-

'గణేశ్ ఇఫ్ యూ డోంట్‌మైండ్ ప్లీజ్ కన్వే మై లాస్ట్ మెసేజి టూ యువర్ జూనియర్ కొలీగ్ రాజేష్ దట్ యువర్ వైఫ్ ఈజ్ గోయింగ్ టూ కమిట్ సూసైడ్' అంటూ ఠప్పున ఫోన్ పెట్టేసింది.

గణేశ్ కంగుతిన్నాడు..

'హలో హలో..' అంటుండగానే అవతలి వైపు ఫోన్ డిస్కనెట్ అయింది.

మళ్లీ అదే ఫోన్‌కు ట్రైచేస్తే స్విచాఫ్ మెసేజి వచ్చింది.

అతని మొదడు మొద్దు బారింది.. ఎవరీ రమ? ఈ రాజేష్‌గాడెవడు? ఆమె ఎందుకు ఆత్మహత్య

చేసుకోవాలనుకుంటోంది? అసలు ఇదంతా నాకెందుకు చెప్పింది? ఎవరికో చేయబోయి తనకు చేసిందా? తను ఇప్పు డేంచేయాలి? ఓ నిండుప్రాణం బలైపో తుంటే నిస్సహాయంగా చూస్తుండడ మేనా?

వెంటనే అతనికి మెరుపులాంటి ఆలో చన వచ్చింది. తన సెల్‌నుంచి కస్టమర్ కేర్‌కు ఫోన్ చేశాడు. తనకొచ్చిన నెంబరు వారికిచ్చి ఈ నెంబరు ఏ కంపెనీ ఆపరే టర్‌దో చెప్పమని కోరాడు. వాళ్లు చెప్పారు. వెంటనే ఆ కంపెనీ సెల్ ఆపరే టర్‌కు ఫోన్‌చేసి తనుపోలీస్ డిపార్ట్ మెంట్ నుంచి మాట్లాడుతున్నాననీ ఫలానా నెంబరు వినియోగదారు వివ రాలు, చిరునామా అర్జంటుగా కావాలనీ సాధికారత గొంతులో ఉట్టిపడేలా అడి గాడు.

పది నిముషాల్లో అతనికి కావాల్సిన వివరాలు వచ్చాయి. రమారాజేష్ చిరు నామా సైనిక్‌పురి అని తెలిసింది. డోర్ నెంబరు కూడా ఉండడంతో వెంటనే లేచి రయ్యిమని ఆ వైపు బైక్‌ను పరుగుతీయిం చాడు. దారిలో ఓ పోలీస్‌స్టేషన్‌వద్ద ఆగి సైనిక్‌పురి ఏరియా ఏ స్టేషన్ పరిధిలోకి వస్తుందో విచారించి అక్కడనుంచే ఆ స్టేషన్ ఆఫీసర్‌కు ఫోన్ చేశాడు. వివరా లన్నీ చెప్పాడు. ఎలాగైనా ఆమెను కాపా డాలని అభ్యర్థించాడు.

ఆ స్టేషన్‌ఆఫీసర్ కూడా బాగానే స్పందించాడు. తన సిబ్బందిని అలర్ట్ చేశాడు. గణేశ్ చేరేసరికి చుట్టుపక్కల వారంతా ఆ ఇంటి ముంగిట పోగ య్యారు. ఓ పోలీస్ కానిస్టేబుల్ కూడా ఉన్నాడు. కానీ ఇల్లు బయటవైపు తాళం వేసుంది. తాళం వేసుండడం చూసి ఇన్ స్పెక్టర్‌గారు తనను ఇక్కడ కాపలా ఉంచి అన్ని పోలీస్‌స్టేషన్లనీ అలర్ట్‌చేయడానికి స్టేషన్‌కు వెళ్లారని చెప్పాడు కానిస్టేబుల్.

గణేశ్‌కూడా చుట్టుపక్కల ఆ ఇంట్లో వాళ్లగురించి వాకబు చేశాడు. ఆ ఇంట్లో ఓ జంట ఉంటారనీ, అతనెక్కడ ఉద్యోగం చేస్తున్నాడో తెలీదనీచెప్పారు. ఆమెప్పుడూ బయటకు రాదన్నారు. అదీగాక వాళ్లిద్దరూ ఎవరితోనూ మాట్లాడరని చెప్పారు. ఇవ్వాళ ఆరింటినుంచీ ఇంటికి తాళం కప్ప వేలాడుతోందని కూడా సమాచారం ఇచ్చారు.

ఇంతలో ఎదురింటి ముసలమ్మ ఒకామె 'ఆ మగమనిషి మబ్బుమబ్బుల్లోనే తలుపు తాళంబెట్టి బయటకు బోవడం నేన్సూసిన బిడ్డా' అంది.

అయితే ఇంక ఆ తర్వాత ఇంటివాళ్లను మరెవరూ చూడలేదంటే ఆమె ఏమై నట్టు? ఒకవేళ ఇంట్లోనే ఉందేమో? పెళ్లాన్ని లోపల పెట్టి తాళంబెట్టి పోయాడా? గణేశ్‌కు అనుమానం వచ్చింది.

తలుపు దగ్గరకు కిటికీ దగ్గరకు పోయి లోపలనుంచి ఏమైనా అలికిడి విన్పిస్తుందే మోనని పరిశీలించాడు. అంతలో లోపల చిన్నగా ఏవో మూలుగులు..?

ఆ మూలుగులు అంతా విన్నారు.

అంతే! కానిస్టేబుల్‌తో తాళం పగలగొ ట్టించాడు గణేశ్. లోపల ఓ పంజాబీ యువతి నురగలు కక్కుకుంటూ నేలమీద పడుంది. శ్వాస పీల్చుకోలేక ఇబ్బంది పడు తోంది.

సమాచారం తెలిసి ఇన్‌స్పెక్టర్ హుటా హుటిన వచ్చాడు. మృత్యువుతో పోరాడు తున్న ఆమెను అంబులెన్స్‌లో ఆస్పత్రికి పంపారు. తర్వాత ఇన్‌స్పెక్టర్, పోలీసు సిబ్బంది, గణేశ్ అక్కడ మంచంపై ఓ నీలండైరీ ఉండడం గమనించారు. దాంట్లో రాజేశ్ పనిచేసే కంపెనీపేరు.. దానికింద కంపెనీ సీనియర్ మేనేజర్

# దినపత్రికల్లో భారత్ భేష్!




దినపత్రికల వ్యాపారంలో భారతదేశం ప్రపంచంలోనే రెండో స్థానంలో ఉంది. రోజుకి దాదాపు పది కోట్ల దినపత్రికలు ఇక్కడ అమ్ముడవుతున్నాయి. మొదటి స్థానంలో ఉన్న చైనాలో పది కోట్ల డెబ్బైఐదు లక్షల దినపత్రికలు రోజుకి అమ్ముడవుతున్నాయి. మూడో స్థానం చిన్నదేశమైన జపాన్‌ది. అక్కడ ఆరు కోట్ల ఎనభై లక్షల పత్రికలు అమ్ముడుపోతాయి. నాలుగో స్థానం అమెరికాది. అక్కడ రోజూ ఐదు కోట్ల పది లక్షల పత్రికలు మాత్రమే అమ్ముడవుతాయి.

ప్రపంచంలో అత్యధికంగా అమ్ముడయ్యే వంద దినపత్రికల్లో డెబ్బై నాలుగు ఆసియా నుంచే వెలువడుతుండటం గమనార్హం. వాటిలో అరవై రెండు పత్రికలు, భారత్, చైనా, జపాన్‌ల నుంచే ప్రచురితమవుతున్నాయి. స్వీడన్‌లోని గోటెబర్గ్ అనే ఊరుకు చెందిన ప్రపంచ పత్రికల సంఘం చేసిన అధ్యయనంలో ఈ విషయాలు తెలిశాయి. దినపత్రికలకు టీవీ అడ్డంకి కావడంలేదు. ప్రపంచ ప్రకటనల మార్కెట్‌లో నలభై శాతం పత్రికలే పంచుకుంటున్నాయి. ఎనభై శాతం దేశాల్లో వీటి సర్క్యులేషన్ పెరుగుతోంది. ప్రజల్లో అక్షరాస్యత పెరగడమే దీనికి కారణమట.



యూరప్, అమెరికాలో ఉచితంగా సర్క్యులేట్ అయ్యే కొన్ని పత్రికలు కేవలం ప్రకటనల మీదే జీవిస్తుంటాయి. ఈరకం పత్రికలు ఆసియా దేశాల్లో పెద్దగా లేవు. ఇవన్నీ సాధారణంగా స్థానిక దిన పత్రికలై వుంటాయి.

గణేశ్ అని రాసుంది. ఆ పేరు పక్కన ఓ సెల్‌ఫోన్ నెంబరు ఉంది. ఒక్క అంకె తప్ప అది అచ్చం గణేశ్ నెంబరే! చివరి అంకె మాత్రం ఆరు బదులు తొమ్మిది..

అందరికీ విషయం అర్థమైంది, ఆ సీనియర్ మేనేజర్ గణేశ్‌కు ఫోన్ చేయబోయి ఆ పంజాబీ యువతి ఈ గణేశ్‌కు చేసిందని.

★ ★ ★

ఆస్పత్రిలో కోలుకున్నాక రమ తన అసలు పేరు రూపాసింగ్ అని చెప్పింది. అందమే తనకు శాపమైందనీ, భర్త అనుక్షణం అనుమానంతో హింసించేవాడనీ మీడియాకు వెల్లడించింది. మంచిచదువున్నా ఉద్యోగం చేయనివ్వలేదంది. ఇంట్లో ఉంచి తాళంపెట్టి వెళ్లేవాడని చెప్పింది. తనను వేధించాలని కనీసం ఫోన్‌నెంబరు కూడా ఇచ్చేవాడు కాదనీ, ఎప్పుడు ఇంటికివస్తాడో రాడో చెప్పేవాడు కాదనీ, ప్రతిరాత్రీ తనకు కాళరాత్రేనని రోదించింది. బతుకుపై విరక్తిచెందాననీ అందుకే ఆత్మహత్య చేసుకోవాలనుకున్నానంది. పోయేప్పుడు భర్తకు చెప్పాలనిపించిందనీ, తన అదృష్టమో, అతని దురదృష్టమో అతడీవేళ ఇంట్లో డైరీ, సెల్‌ఫోన్ మరచి వెళ్లడంతో అందులోఉన్న సీనియర్ మేనేజర్ గణేశ్‌కు సమాచారం చెప్పి పురుగుల మందు తాగానని చెప్పింది.

అప్పటికే రాజేశ్‌సింగ్ పోలీసుస్టేషన్‌లో లొంగిపోయాడు.

–చంద్రప్రతాప్

# అంకెలంటే భయం.. అక్షరాలంటే ప్రాణం



మైనంపాటి భాస్కర్

**వందకి పైగా కథలు, ముప్పయ్ దాకా నవలలు రాసిన మైనంపాటి భాస్కర్‌కి సైన్స్ ఫిక్షనంటే చాలా ఇష్టం. ఆయన రచనల్లో డజను నవలలు ఇప్పటికీ వాషింగ్టన్‌లోని లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్‌లో భద్రపరిచి ఉన్నాయి.**

**ఆయన కలం నుంచే రూపుదిద్దుకున్న 'బుద్ధిజీవి' నవల న్యూయార్క్‌లోని 'బెస్ట్ సైన్స్ ఫిక్షన్ ఆఫ్ ద వరల్డ్ డైరెక్టరీ'లో ఎంట్రీ పొందడం విశేషం. అప్పట్లో 'ఆంధ్రజ్యోతి' వారపత్రిక నిర్వహించిన వైజ్ఞానిక నవలల పోటీలోనూ దీనికే ప్రథమ బహుమతి లభించింది. కేవలం రెండువారాల్లోనే ఆయన ఏకబిగిన రాసిన నవల ఇది. దీనికి ప్రేరణ ఏమిటో, నాడు ఎదురైన పరిస్థితులేమిటో, కలిగిన అనుభవాలేమిటో.. ఆయన మాటల్లోనే తెలుసుకుందాం..**

---

మన జీవితాల్లో పదాలతో కాకుండా అంకెలతోనే మాట్లాడుకునే రోజులు వస్తాయేమోనని దిగులు వేసేది. ఎందుకంటే అంకెలంటే అంత భయం నాకు. ఈ ఆలోచనతోనే 'బుద్ధిజీవి' నవలలోని జమిస్తాన్ దేశపు సృష్టి జరిగింది.

చిన్నప్పటి నుంచి 'రీడర్స్ డైజెస్ట్' మేగజైన్ ఆసక్తిగా చదివేవాడిని. సైన్స్ తాలూకు పురోగతి గురించి అందులో అనేక వ్యాసాలు వస్తుండేవి. వాటిలోని చాలా అంశాలు ఎంతో ఆకర్షించేవి.

సృష్టికి ప్రతిసృష్టి చేస్తున్నాడు మనిషి. అలాగే మానవ జాతి వినాశనానికి దారితీసే బయోలాజికల్ వార్‌ఫేర్ కోసం విషక్రిముల్ని సృష్టిస్తున్నాడు. జెనెటిక్ ఇంజినీరింగ్ ఎటు దారితీస్తుందో!?

ఇక కంప్యూటర్లు, రాబోట్లు మనిషి మేధతో పోటీ పడుతున్నాయా? మానవుడి కపాలంలోని క్రేనియం పరిణామం గత మూడులక్షల ఏళ్లలో పెరగలేదనీ, మెదడు సైజు కూడా పెద్దగా ఎదగలేదని అంటారు.

మరోవైపు కంప్యూటర్ల శక్తి సామర్థ్యాలు అంచెలంచెలుగా పెరిగిపోతున్నాయి. మనిషి ఫీడ్ చేసిన సమాచారంతో పని చేసే కంప్యూటర్లు తమంతటతామే నిర్ణయాలు తీసుకునే స్థితికి 'ఎదిగితే'?

ఈర్ష్యాసూయలతో కలుషితమైన మనిషి తెలివితేటల ముందు తలొంచేందుకు ఆ కంప్యూటర్లు నిరాకరిస్తే? వాటికీ రాగద్వేషాలు ప్రారంభమైతే? కంప్యూటర్లు తమకు తామే అసంఖ్యాకంగా ఇతర కంప్యూటర్లనీ, రోబోలనీ తయారు చేస్తే? భూగోళ ఆధిపత్యంకోసం పోటీపడితే?

అదట్లా ఉంచితే- ఈ విశాల విశ్వంలో భూగోళం మీదే జీవరాశి ఉందా? ఇంకెక్కడా లేదా? కోటానుకోట్ల గెలాక్సీలు ఉన్నాయి. వాటిల్లో ఏ ఒక్కగ్రహం మీదనైనా మన వాతావరణంలాంటిది ఉండి,

జీవం ఉండవచ్చేమో! ఒకవేళ ఏ గ్రహం మీదయినా జీవం ఉంటే అవి మనుషుల్లా గానే ఉంటాయా? వాటి నాగరికత మనకంటే కోటానుకోట్ల సంవత్సరాలు ముందుంటుందా? అవి భూగోళం మీదకి వస్తే ఏమవుతుంది?

ఉవ్వెత్తున ఎగసిపడే ఇలాంటి ఊహల అలజడిలోనుంచి పుట్టుకువచ్చిందే 'బుద్ధి జీవి' కథ. ఈ నవలను 1984లో రాశాను. వచ్చే యాభై ఏళ్ళలో సంభవించే పరిణామాలను ఊహించి దీంట్లో పొందు పరిచాను. ఇందులో ఎక్కువశాతం నిజాలే, సైన్సే! అయితే సంఘటనలని కలిపే దారంలాంటి కల్పన కూడా ఉంది. ఇది సైన్సు ఫిక్షన్.. సైన్సు ఫాంటసీ కాదు.

ఇందులోని విషయాలు పాతికేళ్ళలోనే నిజాలయ్యాయి. ఈ నవల రాసినప్పుడు సెల్‌ఫోన్లు లేవు. ఇప్పుడు మళ్ళీ నవల చదువుతుంటే కొన్ని సంగతులు మనకు చాలా మామూలుగా అనిపించవచ్చు. అనుభవంలోకి వచ్చేశాయి కదా!







## కథాంశం ఏమిటంటే..

ఒక సైంటిస్టు ఓ రోబోని చేస్తాడు. సైంటిస్టుకీ, అతని రోబోకి మధ్య విభేదాలు వస్తాయి. దుష్టశక్తిలాగా మారిన రోబో సైంటిస్టుని చంపేసి ఉగ్ర రూపంతో లోకం మీద పడిందని కలకలం! ఆ మరమనిషిని చూసి మనిషి అని భ్రమపడి ప్రేమలో పడుతుందో అమ్మాయి.

ఇదిలావుంటే యుద్ధాల్లో బయోలాజికల్ వార్‌ఫేర్‌కి పనికివచ్చే విషక్రిమిని సృష్టించే పరిశోధనలు చేస్తుంటుంది డాక్టర్ శోధన. ఈ పాత్రలతో నవల నడిపించాలి.

అది 2050వ సంవత్సరం..

ఓ రోజు పొద్దున్నే టీవీ చూస్తుంటుంది అపురూప. సైంటిస్టు సంజీవ్ ఓ రోబోని తయారుచేశాడనీ, అది ఆయన్ని చంపేసి లోకంమీద పడిందనీ వార్త. దుష్టశక్తి అయిన ఆ రోబో పేరు నరహరి.

ఈలోగా పోలీసులు వస్తారు. వాళ్ళతోపాటు సైంటిస్టు సంజీవ్ కొడుకు అజిత్ ఉంటాడు. తప్పించుకున్న రోబో అపురూప ఇంట్లోనే ఉండవచ్చంటారు వాళ్లు. ఏవో పరిశోధనల్లో మునిగిన ఆమె తల్లి డాక్టర్ శోధనని నరహరి ఎత్తుకు పోయిందని తెలుస్తుంది.

నరహరిని వెదికిపట్టుకునేందుకు బయలుదేరుతారు అజిత్, అపురూప. వారి ప్రయాణం గాల్లో ఎగిరే సోలార్ కారులో. వాళ్ళకి ఆకాశంలో అల్లంత దూరంలో ఫ్లయింగ్ సాసర్ కనబడుతుంటుంది.

వాళ్ళు జమిస్తాన్ దేశం మీద నుంచి వెళ్తుంటే అక్కడి అధికారులు వాళ్ళ కారుని బలవంతంగా కిందికి దింపుతారు. అక్కడి మనుషులందరూ అచ్చుపోసినట్లుగా ఒకే

## 'బుద్ధిజీవి' రాయాలని కోరిక!

ప్రభుత్వాల ప్రోత్సాహంతోనే తాగుబోతుల వుతున్న అభాగ్యుల ఇతివృత్తంతో.. 'బుద్ధిజీవి' అనే నవల రాయాలనేది మైనంపాటి ఆలోచన. సైన్సు ఎంతగా అభివృద్ధి చెందినా మనిషి మారతాడా అనే దిగులు ఆయనది.. సైన్సు చివరికి వేదాంతంలో కలుస్తుందంటారు. సైన్సు, చరిత్ర దగ్గరనుంచి మానవ సంబంధాలు, వేదాంతందాకా ఆయనకన్నీ అభిమాన విషయాలే.

పోలికలతో ఉంటారు. ఆ దేశానికి నియంత 'నెంబర్ వన్'. అతనే దేశంలోని జనాలందరినీ తన పోలికలతో క్లోనింగ్ పద్ధతిలో సృష్టించి ఉంటాడు. అందరూ బలిష్ఠులు, శాడిస్టులు.

వాళ్లలో ఉంటాడు చిత్రహింసల్లో ఆరితేరిన నూటపదకొండు. నిజానికి జన్యు లోపం వల్ల మంచివాడుగా పుట్టి ఉంటాడు. అజిత్, అపురూపలకి తప్పించుకునే మార్గం చూపిస్తాడు.

మళ్లీ ప్రయాణం ప్రారంభం. వారు బ్యాటరీలు రీఛార్జ్ చేయించుకోవడం కోసం మెకానికా దేశంలో దిగుతారు.

జమిస్తాన్‌లో ఎంత ఊపిరాడని నిరంకుశత్వమో, మెకానికాలో అంతటి విశృంఖలత్వం! ఒంటిమీద నూలు పోగు కూడా లేని అతినాగరికత, సుఖలాలసత్వం!

పనులు చేయించుకునేందుకు, తమ కోర్కెలు తీర్చుకోవడానికి వాళ్లు చంపి పారేసేందుకు వీలున్న 'డిస్పోజబుల్ పీపుల్'ను సృష్టిస్తుంటారు. సృష్టికార్యంతో పనిలేకుండానే సూపర్‌మార్కెట్లలో నచ్చిన వెరైటీ 'ఫ్రోజెన్ బేబీస్'ని కొంటారు.

అక్కడ మూడు నెలల వయసూ పద్దెనిమిదేళ్ల యవ్వనంతో ఉన్న ఒక 'ఇన్‌స్టాంట్ బేబీ' మీద అత్యాచారం చేయబోతాడొకడు. ఆ దారుణం చూడలేనట్లు భూమి కంపిస్తుంది. నేల రెండుగా చీలిపోతుంది. ఆ పగులుకి అటువైపు అపురూప, ఇటు వైపు అజిత్ ఉండిపోతారు.

అప్పుడు అపురూప మీదికి లంఘిస్తుంది నరహరి. అజిత్ దాన్ని పట్టుకుంటాడు. అయితే అది తప్పించుకుంటుంది. నరహరి అడుగు జాడలని అనుసరిస్తారు వాళ్లు. అక్కడో లోయలో పల్లెటూరు. దానికి బయటి ప్రపంచంతో సంబంధం లేదు. 21 వ శతాబ్దపు నాగరికతా ఛాయలు ఆ ఊళ్లో కనబడవు. అక్కడ పాత పద్ధతిలో ఓ పెళ్లి జరుగుతోంది. ఎంతో ఆర్ద్రంగా ఉన్న ఆ పల్లె వాతావరణంలో వాళ్లకి కొత్త ఆలోచనలు. పరస్పరం ప్రేమలో పడతారు అజిత్, అపురూప.

ఆ పెళ్లికి అందరికీ ఆప్తురాలయిన బామ్మగారి రాకకోసం చూస్తుంటారు. ఈలోగా దుష్టశక్తి నరహరి బామ్మగారిని మోసుకుంటూ కొండదిగి వస్తుంది.

వెంటనే వెళ్లి నరహరితో కలబడతాడు అజిత్. అది చూసి బామ్మగారు అతడిపై తిట్ల దండకం లంకించుకుంటుంది.

'ఏమీ తెలియని అమాయకుడు నరహరి మీద ఎందుకు అఘాయిత్యం చేస్తున్నావ్? ' అని నిలదీస్తుందామె.

ఆశ్చర్యపోయిన అజిత్, అపురూపలకి తన కథ చెబుతాడు నరహరి.

అతని అసలు పేరు మోహన్. అతనో హోటల్ యజమాని. ఆ హోటల్లో అగ్ని ప్రమాదం జరిగినరోజు కొంతమంది శాస్త్రజ్ఞులు కాన్ఫరెన్సు పెట్టుకునివుంటారు. వారిని రక్షించబోయి మంటలలో చిక్కుకుని మరణిస్తాడు మోహన్. కానీ శాస్త్రజ్ఞులు అతడ్ని తిరిగి బతికిస్తారు. కొంత మనిషి, కొంత జంతువు, కొంత లోహం, కొంత ప్లాస్టిక్, కొంత ఫైబర్ గ్లాస్‌తో అతడి శరీరాన్ని నిర్మిస్తారు. మహా వికృతంగా ఉన్న మోహన్(నరహరి)ని అతని కుటుంబం ఇంట్లోకి రానివ్వదు. అతను ఈ పల్లెకి వచ్చి అక్కడే గడుపుతుంటాడు.

అతన్ని బతికించిన శాస్త్రజ్ఞుల టీములో సైంటిస్టు సంజీవ్ కూడా ఉంటాడు. అతని దగ్గరున్న నరహరి ఫొటో చూసి ఆయన సృష్టించిన, దుష్టశక్తిగా మారిన రోబో అదే నని లోకం భయపడుతుంది.

అజిత్, అపురూపలు ఆ పల్లీయులవద్ద సెలవు తీసుకుని బయలుదేరుతారు.

మనిషి 'నాగరికత' గురించి ప్రశ్నలడు గుతుంది అపురూప. కారులోని ఇమేజ్ సిమ్యులేటర్‌తో విశ్వం పుట్టుక నుంచి నేటి వరకూ పరిణామక్రమ దృశ్యాల్ని చూపి స్తాడు అజిత్. భవిష్యత్తులో మనిషి రూపం ఎలా ఉంటుందో చూడమంటాడు.

నడక మర్చిపోయి ఉంటారు మను షులు. పనిపాటలు తమంతట తాముగా చేసుకోలేరు. ఉపయోగంలో లేని అవయ వాలు అదృశ్యమయ్యే క్రమంలో కాళ్లూ చేతులూ పుల్లల్లాగా ఉంటాయి. పెద్దతలా, పెద్ద పొట్టతో గుండ్రంగా ఉంటాడు.

ఆ దశని ఇక 'మనిషి' అనకూడదని, బుద్ధిజీవి అనాలని అంటాడు అజిత్. సిమ్యులేటర్ స్విచ్చి ఆఫ్ చేస్తాడు. అయినా ఆ దృశ్యం పోదు. 'బుద్ధిజీవి' ఇంకా కన్పిస్తూనే ఉంటుంది.

అది చెబుతుంది- తను వేరే గ్రహం నుంచి వచ్చానని. భూగోళాన్ని చూడడా నికి వచ్చిన గ్రహాంతర వాసినని.

వాళ్ళ టెక్నాలజీ మనకంటే కోట్ల సంవ త్సరాలు ముందుంటుంది. అప్పుడు అపు రూపకి అనుమానం వస్తుంది. తాము తరుముకుంటూ వచ్చిన నరహరి అమా యకుడైతే, మరి సైంటిస్టు సంజీవ్ తయా రుచేసిన రోబో ఎక్కడ?

ఆమె ఆలోచనలని చదివేసినట్లు చెబు తుంది ఆ బుద్ధిజీవి.

'సైంటిస్టు సంజీవ్ సృష్టించిన మరమ నిషి ఈ అజితే!' అంటుంది.

డాక్టర్ శోధన తయారుచేస్తున్న విష క్రిమి క్యాప్సూల్‌ని అజిత్ అనే ఈ రోబోనే అపహరించిందని చెబుతుంది. 'ఆ క్యాప్స్యూల్ ఎక్కడ దాచావు?' అంటుంది అజిత్‌తో.

మణికట్టుని స్క్రూలాగా తిప్పి, విషక్రిమి కాప్స్యూల్‌ను బయటికి తీస్తాడు అజిత్. మారణహోమం చేసే ఆ క్రిమిని నాశనం చేయడానికే దానిని ఎత్తుకొచ్చానంటాడు.

ఇంతలో పొరపాటున ఆ కాప్స్యూల్ చేతినుండి జారిపోతుంది. అది పగిలితే ప్రళయమే! కానీ ఒడుపుగా ఆ కాప్స్యూల్‌ని పట్టుకుని మింగేస్తుంది బుద్ధిజీవి. దాని కేమీ కాదు. వాళ్ళ టెక్నాలజీ ఎంతో ఉన్న తం. ఇటువంటివి దానికి పిల్లాటలు! బుద్ధి జీవి తన ఫ్లయింగ్ సాసర్‌లో వెళ్ళిపోతుంది.

ఇబ్బందిగా ఫీలవుతూ ఉంటారు అజిత్, అపురూప. తను ప్రేమించినది మనిషిని కాదనీ, మెషీన్‌ని అనీ తెలిసిన అపురూప హతాశురాలవుతుంది. మనిషితో తన కల్యాణం మాత్రం జరగదని తెలుసు అజి త్‌కి. అయినప్పటికీ మానవ జాతి కల్యాణంకోసం కంకణం కట్టుకున్నట్లుగా ఇద్దరూ కలిసి నడుస్తారు. అనుకోకుం డానే- సింబాలిక్‌గా కలిసి ఏడడుగులు వేయడంతో నవల ముగుస్తుంది.

సేకరణ: **శరత్‌బాబు**

## ఇతర భాషల్లోకి..

**చా**లా ఆలస్యంగా ముప్ఫయ్ దాటాక రాయడం మొదలుపెట్టారు మైనంపాటి. కార్టూన్ల ద్వారా పత్రికలలో ప్రవేశించిన ఆయన రచయితగా స్థిరపడ్డారు. అనేక పత్రికల్లో 'కాలమ్'లు నిర్వహించారు. రాయడం మొద లుపెట్టిన తొలి రోజుల్లో పోటీలకు పంపాలనే సరదా ఆయనకి ఉండేది. 'బివేర్ ఆఫ్ గాడ్స్' అనే కథ విపులలో కన్సొలేషన్ బహుమతికి ఎంపికైంది. ఈ కథ చాలా భాషలలోకి అను వాదమైంది. ఇంకొన్ని కథలూ, నవలలూ కన్నడ, తమిళ, హిందీ, ఇంగ్లీషు భాషలలోకి తర్జుమా అయ్యాయి.

# ఈషణాత్రయం

కీ.శే. కొండముది
శ్రీరామచంద్రమూర్తి





దారేషణ, ధనేషణ, పుత్రేషణ-
ఈ మూడింటిని 'ఈషణత్రయం'
అంటారు. త్రయం అంటే మూడు.
ఈషణం అంటే కోరిక..
నిగ్రహించుకోలేని కోరిక.
ప్రతి మగవాడు ఈ మూడు కోరికలకు
బానిసగా బతుకుతుంటాడు.
కట్టుకున్న ఆడదానిమీద,
ఇంత అంత అనలేని ప్రేమ.
కడుపున కన్న సంతానం మీద
నిగ్రహించుకోలేని మమత - మమకారం.
ఆ స్త్రీ వ్యామోహాన్ని.. పుత్ర మమకారాన్ని
పురస్కరించుకొని, వాళ్లను
సుఖపెట్టడానికి ధనార్జనకు
వెంపర్లాడుతాడు.
ఇవి జయించిన మనిషి మనీషి అవుతాడు,
లేకపోతే మహిషిగా మిగిలిపోతాడు.
ఈ విషయమే ఈషణత్రయం సారాంశం.

"ఉత్తమ యిల్లాలి నోయీ!
నన్నుసురు పెడితే దోసమోయీ!"

అంటూ సన్నగా కూనిరాగం తీసుకుంటూ సుజాత, ఎదురుగా ఉన్న నిలువుటద్దంలో తననుతాను చూసుకుంటూ అర విచ్చిన పెదవులతో.. మందస్మితంతో నుదుటిమీద సింధూర తిలకాన్ని గుండ్రంగా దిద్దుకుంటోంది.

పక్కగదిలో ఆఫీసుకు వెళ్ళటానికి తయారవుతున్నాడు శివశంకరం. గళ్ళ చొక్కా తొడుక్కుని టక్ చేసుకున్నాడు. తలకు బ్రిల్‌క్రీమ్ రాసుకుని స్టైల్‌గా దువ్వుకున్నాడు. తెరచి ఉన్న కిటికీలో నుండి, మల్లెపందిరి మీదుగా గాలిలో తేలి వస్తూ సుజాత తీస్తున్న కూనిరాగం మధురాతి మధురంగా వినిపించింది. చప్పుడు కాకుండా, అడుగులో అడుగేసుకుంటూ, సుజాత ఉన్న గదిలోకి వచ్చి ఆమెకు వెనగ్గా నిలబడ్డాడు.

కోపం నటిస్తూ సుజాత అంది, "చూడండి, బొట్టు చెరిపేశారు!"

"చెరిపినవాణ్ని నేనే సరిచేస్తాను.. సరేనా? " శివశంకర్ మరికొంచెం ముందుకు కదిలాడు. అతను రాసుకున్న సెంటు వాసన ఆమెకు చక్కిలిగింత పెట్టినట్లయింది.

"ఏవిటి- మీరు పెడతారా బొట్టు? "

"ఏం- నువ్వడగ్గానే వేరుకాపురం పెట్టినవాణ్ని, బొట్టు పెట్టలేనా, పువ్వులు ముడవలేనా, చీర కట్టలేనా? "

"ఏయ్... ఏయ్... ఏయ్..." ఆమె తర్జనితో బెదిరించింది.

శివశంకరం నవ్వాడు. "నువ్వు బెదిరించినా, అదలించినా అదీ ముద్దుముద్దుగానే ఉంటుందిలే!" అంటూ అతను ఆమెను దగ్గరకు లాక్కుని ఆమె గులాబి రంగు పెదవులపై గాఢంగా చుంబించాడు.

"అబ్బ! మళ్లీ లిప్‌స్టిక్ పెట్టుకోవాలి!"

"అదీ నేనే పెడతాను!"

"హద్దు దాటకూడదు, అప్పుడే ముద్దూ మురిపెం"

"ఆలుమగల మధ్య హద్దులేమిటోయ్.. హద్దులు చెరిగిపోతేనే ముద్దూ మురిపెం. అప్పుడే ఇంట్లో ఓ ఊయెలా, ఉయ్యాల్లో ఓ పసికూనా! అర్థమైందా.. సాయంకాలం ఆఫీసు నుండొచ్చి ఆ విషయాన్ని ప్రాక్టికల్‌గా వివరిస్తాను. తెల్లచీర కట్టుకుని, మల్లెపూలు పెట్టుకుని, ఈ మహారాజు కోసం మహారాణిలా వేచి చూడు!" అంటూ వెళ్ళలేక వెళ్తున్నట్లుగా అభినయిస్తూ బయటికెళ్ళిపోయాడు శివశంకరం.

సుజాత మనసంతా గాల్లో తేలిపోతోంది. 'ఎంతమందికి ఈ అదృష్టం ఉంటుంది? ' అని తనను తాను ప్రశ్నించుకుంది. ఎప్పటిదో ఓ పాత సినిమాలో పాట జ్ఞాపకం వచ్చింది.

"కొత్తకుండలో నీరు తీయన,
కోరిన మగవాడే తీయన!"

కాదూ మరి? సుజాతకు కళ్లముందు గతం మెదిలింది.

"అమ్మా! ఇవ్వాళ నిన్ను చూసుకోటానికి పెళ్ళివారొస్తున్నారు. సాయంకాలం అయిదింటికి టైం బావుందిట. అప్పుడొస్తామన్నారు" అన్నాడు సీతారామయ్య సుజాతతో. జేన్ ఆస్టిన్ రాసిన 'ప్రైడ్ అండ్ ప్రిజుడిస్' ఆంగ్ల నవల చదువుకొంటూ, అందులో ఆడపిల్లల పెళ్ళిళ్ళకై వాళ్ళ తల్లి పడ్డ అగచాట్లకు మనసులోనే సానుభూతి పడుతూ.. కుర్చీలో కూచున్న సుజాత, తన తండ్రిని చూస్తూనే లేచి నుంచుంది. సీతారామయ్య మరోసారి పెళ్ళిచూపుల విషయం ప్రస్తావించాడు.

"నాకు, నాకు అప్పుడే పెళ్లా? " అంది సుజాత. దొడ్లో నుండి ఇంట్లోకి వచ్చిన సుజాత తల్లి, తన కూతురి మాటలకు నవ్వుతూ జవాబిచ్చింది.

"అప్పుడే అంటే? పద్దెనిమిదేళ్లు దాటాయ్! అయినవాళ్లూ కానివాళ్లూ కూడా, కూతురి పెళ్లి ఎప్పుడు చేస్తారు పిన్నిగారూ? అని అడుగుతున్నారు. అయినా ఎంతకాలం నిన్ను పెంచినా, ఎప్పుడో ఒకప్పుడు ఓ అయ్య చేతిలో పెట్టవలసిందేగా? మంచి సంబంధం వచ్చినప్పుడు ఆ మూడుముళ్లూ వేయించేస్తే, మంచిది కాదూ? "

సీతారామయ్య తన భార్యవేపు చూస్తూ అడిగాడు, "ఏవిటి, ఇంతవరకూ ఈ విషయం చెప్పలేదా? "

"నే చెబితే అది వింటుందా? మీ నోటి వెంట ఆ శుభ వర్తమానం తెలిస్తేనే బావుంటుందని.."

భార్య మాటకు మధ్యలోనే అడ్డం వచ్చి సీతారామయ్య అనునయంగా అన్నాడు "ఓసి వెర్రిదానా, కొన్ని విషయాలు తల్లే చెప్పాలి. కొన్ని తండ్రి చెప్పాలి. కొన్ని అధికారంతో చెప్పాలి, కొన్ని అనురాగంతో చెప్పాలి. సర్లే- నువ్వు చెప్పినా, నేను చెప్పినా, అమ్మాయి తెలుసుకుంది కదా! ఇహ ఆ ప్రయత్నంలో ఉండు. వాళ్ళు రావడానికి ఎంతో టైంలేదు"

సుజాతకు వాళ్ళిద్దరి సంభాషణా వింతగా ఉంది. తన పెళ్లి కోసం తల్లిదండ్రులు ఇంతగా ఆరాటపడుతున్నారా! తన తండ్రి దగ్గర ఎంత డబ్బుందో తనకు తెలీదు. ఓ సామాన్య గృహస్థు. తనను బీకాం దాకా చదివించటానికే ఎంతో శ్రమ పడ్డాడు. ఇప్పుడు పెళ్ళి కోసం మళ్ళీ ఎంత యాతన పడాల్సివస్తుందో, ఏమో?

అందుకని సాలోచనగా అంది, "అది కాదమ్మా! పెళ్ళంటే బోలెడంత ఖర్చు! నేను బీకాం ఫస్టు క్లాసులో ప్యాసయ్యాను కదా, ఎం.కాం. చదువుతాను. ఆ తర్వాత ఏ కాలేజీలోనన్నా లెక్చరర్‌గా చేరి, కాలూ చెయ్యీ కూడదీసుకున్న తర్వాత.." ఆ మాటలంటూ తండ్రివైపు చూసిన సుజాతకు తన మాటలు పూర్తిచేయాలనిపించలేదు. ఆయన వదనం మ్లానమైంది.

"ఏం తల్లీ! నీ సంపాదనతో తప్ప నీ పెళ్లి జరిపించలేనంత అసమర్థుణ్ణి అనుకున్నావా? ఈ ఇల్లుంది, పి.ఎఫ్. ఉంది, మిత్రులున్నారు" అన్నాడు లోగొంతుకతో.

"అంత అవసరం ఏముందీ ఇప్పుడు? "

"అది నీకు అర్థం కాదమ్మా! బీకాం చదివిన పిల్లకు ఎం.కాం. వాడు కావాలి. నువ్వు ఎం.కాం. చదివితే ఏ ఎంబీయేనో, అమెరికా అబ్బాయో కావాలి. మన స్థాయి, తాహతు, స్థోమత, అన్నీ చూసుకోవాలి కదా! అయినా వచ్చిన సంబంధాలన్నీ కుదురుతాయా? ఎన్నో నచ్చాలి, ఎన్నో కుదరాలి!"

తల్లి మాటతో సుజాత మనస్సు చివుక్కుమంది. తన విషయంలో ఎన్నో సంబంధాలు రానక్కరలేదు. తనను చూస్తే చాలు, ఎవరైనా సరే ఒప్పుకుంటారు. తన స్నేహితులంటారు, 'నీకేమే? ఐశ్వర్యారాయ్‌లా ఉంటావు' అని.

ఏ అభిషేకో తన కోసం రానే వస్తాడు.

సుజాత మనసులో ఓ చిలిపి ఊహ మెదిలింది. 'ఈ పెళ్ళి చూపులకు తను ఒప్పుకుని, ఆ వచ్చే పెళ్ళికొడుకు రియాక్షన్ చూస్తే ఎలా ఉంటుంది? ఆ తర్వాత

## కొత్తగాలి...

**పద్మ అవార్డులు**
**పెద్దోళ్ల పెరట్లో**
**విరగబూస్తున్నాయి**
**ఏం సాధించినా**
**పేదోళ్లకు దక్కవవి**

– ఏ. సూర్యప్రకాశ్, నిజామాబాద్

కదా, అసలు విషయం ప్రస్తావనకు వచ్చేది? ఆ వచ్చేవాడు తనకు తగినవాడు కాకపోతే, నచ్చకపోతే అప్పుడు నో చెప్పే య్యొచ్చు!'

ఆలోచిస్తున్న కూతురి వేపే చూస్తు న్నాడు సీతారామయ్య. కూతుర్ని చూసి పార్వతమ్మ, జుట్టు నిమురుతూ, "ఎందుకే ఆ మౌనం? ఆలోచించింది చాలుకానీ, పెళ్ళి చూపులకు తయారుకా! లోపలకు వెళ్ళి స్నానంచేసి, అలంకరించుకో!"

పార్వతమ్మ తన కూతురిని బంగారు బొమ్మలా  తయారుచేసింది. అసలే సుజాత కళ్లు సోగకళ్ళు. ఆ కళ్ళకు కాటుక

## కొత్తగాలి...

**అల్ప**
**పీడనాలు**
**అనల్ప**
**తాడనాలు**

– ఎస్.రజని,
రాయపూర్ (ఛత్తీస్‌గఢ్)

దిద్దింది. సుజాత వదనం తెల్లగులాబీని జ్ఞప్తికి తెస్తుంది. ఆ మొహానికి ఫెయిర్ అండ్ లవ్లీ రాసి, లైట్‌గా పౌడరద్దింది. కుడిచెంపకు ఒకటి రెండుచోట్ల బంగారు రంగులో ఉన్న చెమ్కీ పెట్టింది. గడ్డం మీద బ్యూటీ స్పాట్ దిద్దింది. చెంపలకు లోలాకులు, నుదుటిమీద అల్లల్లాడుతూ ఆటలాడే ముంగురులు, పెదవులు లలిత లలితంగా విచ్చుకుంటే దానిమ్మ గింజ ల్లాంటి పలువరుస, యౌవనశిఖరంగా కని పించే వక్షద్వయం, చీరకట్టులో సుజాత దేవకన్యలా ఉంది. అందానికి రతీదేవి చెల్లెల్లా ఉంది. వర్చస్సులో లక్ష్మీదేవిలా ఉంది. అలంకరణం అంతా అయింతర్వాత పార్వతమ్మ కూతురిని తన కౌగిట్లోకి తీసు కుని ఆర్ద్రంగా అంది, "అందమంతా రంగ రించి ఆ భగవంతుడు నిన్ను తయారుచే శాడు తల్లీ! ఇదే అదృష్టాన్ని ఇహముందు కూడా ఆ కనిపించని వాడు, నీకు వరంగా అనుగ్రహిస్తే...." ఆమె కంఠం వణికింది.

"అమ్మా! నువ్వేం వర్రీకాకు" సుజాత స్వరం కించిత్ గర్వంతో ధ్వనించింది.

పెళ్ళి చూపుల్లో కూడా సుజాత, పైకి సిగ్గు పడుతున్నట్లు కనిపిస్తూనే, లోపల మాత్రం ఏమాత్రం నదురూ-బెదురూ లేకుండానే కూర్చుంది. పెళ్లిచూపులకు శివ శంకరం, అతని తలిదండ్రులూ వచ్చారు. సుజాతను చూసిన మొదటి చూపులోనే శివశంకరం కళ్లల్లో ఓ మెరుపు మెరిసింది.

శివశంకరం తల్లి సుజాతను లేవమంది, నడవమంది, కళ్లు చూసింది, అరచేతులు చూసింది, కాలివేళ్లు చూసింది. అన్ని పరీ క్షలూ చేసి, చివరకు "ఏదీ- ఓ పాట పాడు" అని ముక్తాయించింది.

'ఏం, నా చేతేమన్నా కచ్చేరీలు చేయి స్తారా?' అని అడగాలనిపించింది సుజా తకు. కానీ తమాయించుకుంది. 'అట్లాగే' అన్నట్లుగా తల వూపింది.

శివశంకరం వేపు అర్థవంతంగా వో చూపు చూసి, 'నీవుండేదా కొండపై

నేనుండేదీ నేలపై' అంటూ రాగయు క్తంగా, శ్రోత హృదయ రంజకంగా పాడింది. శివశంకరం తండ్రి కుటుంబ రావు ఏ ప్రశ్నలూ అడగలేదు. చిరున వ్వుతో, ప్రశాంతంగా కన్పించాడు. పాటంతా అయింతర్వాత, కొడుకు వేపుకు తిరిగి, "ఏవన్నా అమ్మాయితో మాట్లాడద ల్చుకుంటే మాట్లాడు" అన్నాడు. సుజాత వేపు తిరిగి మళ్లీ అన్నాడు, "సిగ్గు పడకు తల్లీ! పెళ్లి చూపులంటే కేవలం ఒకరినొ కర్ని చూసుకోవడం మాత్రమే కాదు, వొక రినొకరు తెలుసుకోవడం కూడా! తర్వాత

MVL Telecom Limited

MVL™ mobiles

ROCK YOUR WORLD

- 8 GB ఎక్స్‌పాండబుల్ మెమరీ
- డ్యూయల్ బిల్ట్-ఇన్ స్పీకర్స్
- ఫ్రీ 2 GB మెమరీ కార్డు + 15 ప్రీ లోడెడ్ బ్లాక్‌బస్టర్స్
- డిజిటల్ ఆడియో ప్లేయర్
- FM రేడియో విత్ రికార్డింగ్

Best Buy ₹ 3690

G25

**G10** — Best Buy ₹ 1349
- వీడియో ప్లే బ్యాక్
- ఎఫ్ ఎం రేడియో&రికార్డింగ్
- టార్చ్ లైట్

**G11** — Best Buy ₹ 1999
- వైర్‌లెస్ ఎఫ్ ఎం రేడియో&రికార్డింగ్
- కెమేరా
- లాంగ్ బ్యాటరీ లైఫ్

**G12** — Best Buy ₹ 1949
- డిజిటల్ కెమేరా
- వీడియో ప్లే బాక్
- లాంగ్ బ్యాటరీ లైఫ్

**G15** — Best Buy ₹ 2499
- వాప్/ఎం.ఎం.ఎస్./జి.పి.ఆర్.ఎస్
- డిజిటల్ కెమేరా
- బ్లూ టూత్

**G20** — Best Buy ₹ 3199
- 2.4 " లార్జ్ డిస్ప్లే
- 1.3 ఎం పి కెమేరా
- స్టీరియో స్ట్రీమింగ్‌తో బ్లూ టూత్

**G59** — Best Buy ₹ 2299
- డిజిటల్ కెమేరా
- బ్లూ టూత్
- వీడియో రికార్డింగ్ & ప్లే బ్యాక్

**G60** — Best Buy ₹ 2949
- వైర్‌లెస్ ఎఫ్ ఎం తో రికార్డింగ్
- వీడియో రికార్డింగ్ & ప్లే బ్యాక్
- 21 రోజుల స్టాండ్‌బై బ్యాటరీ

**G80** — Best Buy ₹ 3699
- 16 జి.బి. వరకూ ఎక్స్‌పాండబుల్ మెమరీ
- ఎ2డిపి+ హెచ్‌ఐడి తో బ్లూటూత్ (రిమోట్ కంట్రోల్)
- 1.3 ఎంపి కెమేరా

**G81** — Best Buy ₹ 4999
- భారతదేశంలోనే మొట్టమొదటి డ్యూయల్ సిమ్ పుష్ మెయిల్ ఫోన్
- 16 జి.బి. వరకూ ఎక్స్‌పాండబుల్ మెమరీ
- ట్రాక్ ప్యాడ్



dentsumarcom/mvltelecom/104/10

**Please call us at Toll free number 1800-102-5888 (9am to 9pm) or SMS <MVL MOBILE>to 58888 or mail us at customercare@mvl.in or log on to www.mvl.in**

అనుకుని లాభమేవిటి? మా అబ్బాయితో మాట్లాడు. నీ అభిప్రాయాలు చెప్పు. వాడి అభిప్రాయాలు తెలుసుకో! నచ్చితే మిగిలిన విషయాలూ, కట్న కానుకలూ పెద్ద వాళ్ళం మాట్లాడుకుంటాం!"

'కట్న కానుకలా?' చివుక్కుమన్నది సుజాతకు. తనకు కూడా కట్నం ఇవ్వాలా? తన అందం కట్నం కాదా? తన డిగ్రీ చదువు కట్నం కాదా? తన సంస్కారం కట్నం కాదా? కూతురు సందేహిస్తోందనుకొన్న సీతారామయ్య, "వెళ్లు తల్లీ! ఆ గదిలోకి వెళ్ళి అబ్బాయీ నువ్వూ మాట్లాడుకోండి" అన్నాడు.

శివశంకరం లేచి నిలబడ్డాడు. సుజాత కూడా ఆ తర్వాత లేచింది. ఒకరి తర్వాత ఒకరుగా పక్కనున్న గదిలోకి నడిచారు. గదిలో డ్రస్సింగ్ టేబిలు ఉంది. గోడలకు దేవుళ్ల ఫోటోలు, అటు పక్కగా సుజాత తల్లిదండ్రులతో దిగిన గ్రూపు ఫోటో ఉంది. క్యాబినెట్ సైజులో సుజాత, తన డిగ్రీ చేత్తో పట్టుకుని దిగిన కలర్ ఫోటో ఉంది. ఆ ఫోటోలో సుజాత పంజాబీ డ్రెస్సులో ఉంది.

ఆ ఫోటోను చూస్తూ శివశంకరం మెచ్చుకోలుగా అన్నాడు, "పంజాబీ డ్రెస్సులో, రియల్లీ యూ లుక్ వెరీ బ్యూటిఫుల్"

"థ్యాంక్యూ!" సుజాత కంఠం తీగలా ధ్వనించింది.

"ఊ, చెప్పండి, నేను మీకు నచ్చానా?" శివశంకరం నవ్వుతూ అడిగాడు.

అవునూ- కాదూ అని సుజాత స్పష్టంగా చెప్పలేదు.

కొద్ది క్షణాలు నిరీక్షించి, "సారీ, మిమ్మల్నిట్లా అడగడం మర్యాద కాదు. పోనీ ఓ పని చెయ్యండి. రాములవారి పటానికి గులాబీల దండవుంది. ఆ పటం దగ్గరకు వెళ్లి, దండలో ఉన్న ఓ గులాబీని తీసి, నా చేతి కివ్వండి. మీకభ్యంతరం లేకపోతే, మీరు నాకు నచ్చారు కనుక, అది మీ తల్లో తురుముతాను"

సుజాత కాలివేలితో నేల రాస్తూ ఆలాగే నిలబడింది. పటం దగ్గరకు వెళ్ళలేదు. శివశంకరం కొంచెం నిరుత్సాహపడ్డాడు.

"సారీ! నేను మీకు నచ్చినట్లు లేదు, ఫర్వాలేదు. నేనేమనుకోను. నిజమే! నేను మీఅంత అందంగా లేను. ఎం.కాం. ప్యాసై, గవర్నమెంట్ ఆఫీసులో యూడీసీగా పనిచేస్తున్నాను. అదేమంత పెద్ద ఉద్యోగం కాదు. మాది అంత ఉన్న కుటుంబమూ కాదు, దేనికీ లోపమూ లేదు. కానీ లగ్జూరియస్‌గా బతకలేము. అంచేత నాకన్నా ఇంకా గొప్పవాణ్నీ, అందగాణ్నీ మీరు కోరుకోవడంలో తప్పులేదు. వెళ్దాం పదండి, బయట మీవాళ్ళూ, మా వాళ్ళూ మనకోసం వెయిట్ చేస్తుంటారు!"

ఆ మాటలు విన్న సుజాత చివాలున తలెత్తి అతడివేపు చూసింది. ధైర్యంగా అంది, "ఎందుకు అన్నీ మీకు మీరే ఊహించుకుని, మాట్లాడేస్తున్నారు?"

ఆ మాటతో శివశంకరానికి పోయిన ప్రాణం తిరిగొచ్చినట్లయింది.

"అయితే, నేను- మీకు..."

సుజాత పెదవులపై ఓ కొంటె నవ్వు .. మెల్లగా శ్రీ రాములవారి పటం దగ్గరకు నడిచింది. దండలో నుండి ఓ గులాబీని

## కొత్తగాలి...

**ఊరించి.. ఊరించి**
**ఉరిగా మారింది**
**మైక్రో**

– బద్ది నాగేశ్వరరావు,
అనకాపల్లి

నిన్నటి నిజం

## పుట్టపర్తి శివతాండవం!

**డా.**పుట్టపర్తి నారాయణాచార్యులు 'కడప పట్టణంలో శ్రీరామకృష్ణ హైస్కూలులో తెలుగు పండితులు. ఆయన బహుభాషా కోవిదులు, గొప్ప వక్త, బహు గ్రంథకర్త. అంతేగాక ఆయన సరసుడు, సహృదయుడు, నిర్భీకుడు.



ఒకసారి దేవుని కడపలో భారీ సభ జరిగింది. నాటి హైదరాబాద్ నగర మేయర్ కొండారెడ్డి సభకు అధ్యక్షులు. హైదరాబాద్ శాసన సభ్యులు, రాణి కుముదిని దేవి ముఖ్య అతిథి. పుట్టపర్తి వారు శ్రోతల నడుమ ఆసీనులై ఉన్నారు. అధ్యక్షులు కొండారెడ్డి ప్రజాభీష్టం మేరకు వేదికపైనుంచి శివ తాండవం గానం చేయాల్సిందిగా పుట్టపర్తివారిని వేదికపైకి ఆహ్వానించారు. అయితే ఆయన రెండు నిమిషాల సమయమే కేటాయించినట్లు ప్రకటించారు. పుట్టపర్తివారు 'సరే!' నంటూ వేదికనెక్కి, మైకుముందు నిల్చున్నారు. 'శివతాండవ మట, శివలాస్యంబట' అని రెండు ముక్కలు పలికి, వేదిక దిగి వచ్చేశారు. సభలో గగ్గోలు లేచింది. 'పుట్టపర్తివారు ఆలపించాలి', 'శివతాండవం గానంచేయాలి' అని అరుపులు మొదలయ్యాయి. అధ్యక్షులు కొండారెడ్డి లేచి నిలబడి, 'ఆచార్యులుగారూ, పొరబాటు చేశాను. తమరి గురించి, శివ తాండవం గురించి నాకు తెలియనందున అలా జరిగింది. క్షమించమని కోరుతున్నాను. నన్ను మన్నించి ఆ కావ్య గానం పూర్తిగా చేయండి. అని వినయంగా వేడుకొన్నారు.

నారాయణాచార్యులు మరలా లేచి మైకు దగ్గరకెళ్ళి శివతాండవం గానం చేశారు. దాంతో శ్రోతలంతా పది నిమిషాల కాలం ఒకే ఊపుతో చప్పట్లు చరిచి జేజేలు పలికారు.

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

తీసి, చేతుల్లో ఉంచుకుని పటం దగ్గరే, గోడవారగా నిలబడింది.

శివశంకరం సందేహాన్ని జయించి, వేగంగా కొట్టుకుంటున్న గుండెతో కాళ్ళలోకి బలం తెచ్చుకుని ఆమె దగ్గరకు నడిచాడు. ఆమె చేతుల్లో ఉన్న గులాబీని తన చేతుల్లోకి తీసుకున్నాడు. సున్నితంగా ఆమె జడలో తురిమాడు. ఆమెకు ఎదురుగా నిలబడి, ఆమెవేపే చూస్తూ "చాలా, చాలా థాంక్స్ సుజాత! ఈరోజు నాకు సుదినం! నువ్వు ఒప్పుకోవడం నీ గొప్పదనాన్ని సూచిస్తోంది. నిన్నెప్పుడూ నిరాశపర్చను. యస్, ఐ లైక్ యూ సో మచ్!"

వెలిగిపోతున్న మొహాలతో బయటకు వచ్చిన వారిద్దర్నీ చూసి, హాల్లో వెయిట్ చేస్తున్న వాళ్ళకు విషయం అర్థమైంది. సీతారామయ్య దంపతుల హృదయాలు ఆనందతుందిలమయ్యాయి. కుటుంబరావు సుజాత తండ్రి వేపు తిరిగి, "బావాగారూ! వచ్చే శుక్రవారం నాడు మీరు, అక్కగారూ మా ఇంటికి రండి. మిగిలిన సంగతులన్నీ మాట్లాడుకుందాం!" అన్నాడు.

కుటుంబరావు భార్య కామేశ్వరమ్మ "అవునవును. మిగిలిన విషయాలు కూడా వివరంగా మాట్లాడుకోవాలిగా మరీ!" అంటూ సన్నాయి నొక్కులు నొక్కింది.

ఆమె మాటలకు ఉలిక్కిపడింది సుజాత తల్లి. అయినా తన ఉలికిపాటును బయట పడనీకుండా జాగ్రత్తపడుతూ, ఆమెకు బొట్టు పెట్టి, పళ్ళు, తాంబూలం ఇచ్చి, "వదినగారూ! మీ అబ్బాయికి మా అమ్మాయి నచ్చినట్టే ఉంది. శుభకార్యం జరిపించే

భారం మీదే!" అంది అర్థవంతంగా.

"మేం నిర్ణయం చేసేవాళ్ళమే! అమలు చేయవలసింది మీరే!" అందామె గంభీరంగా.

కామేశ్వరమ్మ మాటలు పార్వతమ్మ గుండెల్లో గుబులు పుట్టించాయి. ఆ రాత్రి వెన్నెల్లో, ఇంటి ముందు ప్రహరీ లోపల ఉన్న వేపచెట్టు కింద నవారు మంచంమీద పడుకుని కూతురి పెళ్లి గురించి ఆలోచిస్తున్న సీతారామయ్య దగ్గరకు వెళ్ళి, గుసగుసగా అంది పార్వతమ్మ.

"వెళ్తూ వెళ్తూ ఆ కామేశ్వరమ్మ అన్న మాటలు విన్నారు కదా? "

సీతారామయ్య ఆ ప్రశ్నకు పెద్దగా స్పందించ లేదు. "ఎందుకే అంత కంగారు పడతావ్? ఆ అబ్బాయికి మన అమ్మాయి నచ్చిందని అర్థమయిందికదా! పిల్లవాడి తల్లితండ్రులకు ఏవేవో ఆశలుంటాయ్! కంగారు పడితే ఎట్లా? అయినా శుక్రవారం అక్కడికి వెళ్తున్నాం కదా? పుట్టలోని పాము బయటకు రాక మానుతుందా? "

నిజంగానే కుటుంబరావన్న మాటలు, పుట్టలో ఉన్న పాము బయటకు వచ్చి బుస కొట్టినట్టే ఉన్నాయి. "చూడండి, నాకున్నది ఒక్కగానొక్క కొడుకూ.. పిత్రార్జితంగా ఈ ఇల్లూ, నా పెన్షన్ డబ్బులూనూ! మా శివుడి కన్నా పెద్దమ్మాయి ఉంది. దాని పెళ్ళి జరిపించేసి పంపించే సరికి తలప్రాణం తోకకు వచ్చింది. ఆ సమయంలో శివుడి చదువు పూర్తి కాలేదు. నేను రిటైరయిపోయాను. అంచేత వేరే దారి లేక ఈ ఇంటి మీద బాకీ తీసుకున్నాను. ఆ తాకట్టు వాకట్టు అయ్యే స్థితి ఇప్పుడు. పిల్ల పెళ్ళికోసమని పెన్షన్‌మీద అప్పు తీసుకున్నాను. ఇప్పుడు ప్రతినెలా దాంట్లో కటింగ్ పోను, చేతికి చాలా తక్కువ వస్తోంది. ఏతావాతా పిల్లవాడికి



కట్నం తీసుకోక తప్పడం లేదు"

కామేశ్వరమ్మ భర్త మాటలకు వత్తాసుగా అంది, "ఇదంతా అన్నగారికి ప్రత్యేకంగా మనం చెప్పాలిటండీ? మధ్యతరగతి సంసారాల్లో ఇది మామూలేగా?



"ఎంతనుకుంటున్నారు? "

"ఆ! ఎంతండీ అన్న గారూ? అబ్బాయిది గవర్న మెంటు ఉద్యోగం. పైగా పర్మ నెంటు. నెలకొక ఎనిమిది వే లకు పైగా వస్తోంది. ఉత్తరో త్తర ఇంకా ఎక్కువొస్తుందంటు న్నారు. వాడు బల్లకింద చెయ్యి పెట్టదల్చుకుంటే, కళ్ళు మూసి తెరిచే లోపల కారు కొనుక్కోవచ్చుట, ఫ్లాట్ తీసుకో వచ్చుట!"

"ఎంతనుకుంటున్నారో చెప్ప లేదు!" సీతారామయ్య ప్రశ్న గొంతులో నుండి వినిపించీ వినిపించకుండా వినిపించింది.

"ఆ ఎంత? ఓ రెండు రూపాయిలిప్పించండి!"

"రెండు రూపాయాలా!"

కుటుంబరావు కల్పించుకు న్నాడు, "రూపాయంటే రూపాయి కాదండి బావ గారూ! రూపాయి అంటే లక్ష అని అర్థం"

"రెండు లక్షలా? "

కామేశ్వరమ్మ కాస్త దాష్టీ కంగా అంది, "ఈ రోజుల్లో లక్షకు విలువేముం దండీ? ఆ రెండు లక్షలూ పెట్టి ఇంటిమీది తాకట్టు తీర్చే సుకోవచ్చని మా ఆయన ఆశ. అయినా అట్లా జరిగితే ఇంట్లో ప్రశాంతంగా కాపురం చేసుకు నేది మీ అమ్మాయే కదా!"

అంచేత..." ఆమె అర్ధాంతరంగా తన మాటల్ని ఆపేసి, మిగిలింది సీతారా మయ్య ఊహకే వదిలిపెట్టింది.

సీతారామయ్యకు లోపల్నించి వణుకు పుట్టుకువస్తోంది. బలహీనంగా అడిగాడు, ఆలోచించుకుని సమాధానం చెబుతా నని సీతారామయ్య భార్యతో కలసి నీర సంగా ఇంటికి తిరిగివచ్చాడు.




కళాకాంతులు లేకుండా చిన్నబోయిన మొహాలతో ఉన్న తల్లిదండ్రుల్ని చూసి, అసలు సంగతిని అతికష్టం మీద తెలుసుకున్న సుజాతకు, శివశంకరం మీద ముందుగా కోపం వచ్చింది. తనంటే ఇష్టపడ్డానన్నాడు. పెళ్ళి చేసుకుంటానన్నాడు. జెడలో పువ్వులను తురిమాడు. ఛీ! ఛీ! జడలో కాదు, చెవిలో పెట్టాడు పువ్వు!!

తనో వెర్రిబాగుల్ది. కనుకనే తన అందం అతణ్ణి సమ్మోహితుణ్ణి చేస్తుందనుకుంది. అతను చూసీ చూడగానే, 'సుజాతా! కానీ కట్నం అక్కర్లేదు. నిన్నే పెళ్ళి చేసుకుంటాను' అంటాడనుకుంది.

తామిద్దరు ఏకాంతంగా మాట్లాడినప్పుడు, అలాగే ప్రవర్తించాడే! అదంతా నటనేనా? ఆ అమ్మాయికి తనమీద తనకే అసహ్యం వేసింది. ఎంత తప్పు చేసింది తను? అతనిచేత తన జడలో గులాబిని పెట్టించుకుంది. పెళ్ళి కాకుండా, ఎవరైనా చేస్తారా అట్లా? ఈవిధమైన ఆలోచనతో సతమతమైపోతున్న సుజాతకు భోజనాల దగ్గర తండ్రి అన్న మాటలు మరీ ఆందోళన కల్గించాయి.

"సుజీ! నేనోనిర్ణయానికి వచ్చానమ్మా?"

"ఏమిటి నాన్నా అది?"

"ఆ రెండు లక్షల సంబంధం మనకొద్దు. ఇంకో సంబంధం చూస్తాను. నీకూ, నీ చదువుకూ, మంచికీ మర్యాదకూ ప్రాముఖ్యతనిచ్చే సంబంధం చూస్తాను. కట్నం కోసం వెంపర్లాడేవాళ్ళు మనకొద్దు తల్లీ!"

"మీ ఇష్టం నాన్నా!" అని తన గదిలోకి వచ్చేసిన సుజాత మనసు కందిరీగల తుట్టె అయింది. మనస్సు పాములపుట్ట అయింది. ఆలోచిస్తున్నకొద్దీ ఈ పెళ్ళిచూపుల తతంగమే ఆమెకు అసహ్యం అనిపించింది. మళ్ళీ ఏ తలకుమాసినవాడో వస్తాడు. మగవాణ్నన్న అహంకారంతో అడ్డమైన ప్రశ్నలూ వేస్తాడు. కాకపోతే కొంచెం సంస్కారం గనుక ఉన్నవాడైతే, తన అందానికి లోబడినవాడైతే ఆ శివశంకరం చేసినట్లే మళ్ళీ తన తలలో ఏ మల్లెచెండో, మందారపువ్వో పెట్టించుకుని తానూ మరోసారి మురిసిపోతుంది. మురిపెంగా అతనిని తనను తాకనిస్తుంది. ఆ తర్వాత ఆ పెళ్ళికొడుకూ తన తండ్రి చెప్పినట్లే చేస్తాడు. కట్నం కోసం వెంపర్లాడతాడు. డబ్బు దగ్గర ఇష్టాయిష్టాలు దూదిపింజెల్లా ఎగిరిపోతాయి. తను ప్రతీసారీ ఇట్లా చూడవచ్చుని, ప్రతి పెళ్ళికొడుకునూ, దొంగ మాటలు మాట్లాడిన ప్రతి యువకుడ్ని చూసి, మనసు పారేసుకోవడం.. నాటక రచయిత ఆకెళ్ళ చెప్పినట్లుగా తన మనసులో కాకి ఎంగిలి... ఎవరో ఒకరు, తన మెడలో ఆ తాళి పడేంతవరకూ తన మనసును కాకిఎంగిలి చేస్తూనే ఉంటారు.

ఊహూ, ఆవిధంగా తను ఎంగిలి పడదు. శివశంకరాన్ని చూసింది. అతను కావాలనుకుంది. అవును.. అతనే తనకు కావాలి. కానీ అతనికి కట్నం కూడా కావాలా? ఏమో, అతనికి అక్కరలేదేమో.. ఆ కుటుంబరావుగారికే, ఆ కామేశ్వరమ్మకే కావాలేమో.. తమ కోరికను బలవంతంగా కొడుకు మీద రుద్దుతున్నారేమో!! అనుకుంటూ ఓ నిశ్చయానికి వచ్చి, నిశ్చింతగా నిద్రపోయింది సుజాత ఆ రాత్రి. మరు

# గురువును దిద్దిన శిష్యుడు



**నూ**రేళ్ల కిందటి సంగతి. అనంతపురం జిల్లా రాళ్ళపల్లిలో జన్మించి, చదువుకునేందుకు మైసూరు చేరాడు అనంతకృష్ణ శర్మ. శ్రీచామరాజేంద్ర సంస్కృత మహాపాఠశాలలో సంస్కృత విద్యాభ్యాసం. పరకాల మఠంలో బస, భోజనం. ఈ పరకాల పీఠాధీశులు, శ్రీకృష్ణబ్రహ్మతంత్ర పరకాల యతీశ్వర్లు. సంస్కృతంలో గొప్ప కవి. ప్రతి సంవత్సరమూ ఆయన మఠంలో విద్వత్సభలు జరిపేవారు. వయోభారంవల్ల కంటిచూపు తగ్గడంతో యతీశ్వరులు సాధారణంగా తన ప్రసంగాలు, కవితలను రాళ్ళపల్లితో చదివించేవారు.



ఒకానొక విద్వత్సభకు అధ్యక్ష స్థానంలో యతీశ్వరులు ఉన్నారు. తన కవితను రాళ్ళపల్లివారు చదువుతారని, అందరూ వినాల్సిందిగా కోరారాయన.

రాళ్ళపల్లివారు శ్రావ్యంగా చదువుతూ ఓ పాదాంతంలో ఆపేశారు. యతీశ్వరులు ఆయనతో 'ఆపావెందుకు? ఆపైన చదువు' అన్నారు. దానికి రాళ్లపల్లివారి జవాబుతో సభికులు అవాక్కయ్యారు. అందరి చూపు యతీశ్వరుల వైపు మళ్ళింది. ఇంతకూ రాళ్లపల్లివారు అన్నదేమంటే, 'నిన్న మీరు ఒకానొక ప్రయోగం దుష్టమని సెలవిచ్చారు. ఇప్పుడు అదే ప్రయోగం నా నోటికి అడ్డొచ్చింది'

యతీశ్వరులు ఏమి చెబుతారా అని సభలోని వారంతా ఆసక్తితో ఆయన వైపే చూస్తున్నారు. ఆయన నిమ్మళంగా బదులు పలికారు. "అవును, నీవు చెప్పింది నిజం. నీవు చదవాల్సిన పాదంలోని ఆ ప్రయోగం తప్పే. సరే, దాన్ని సరిచేసుకుందాం. తర్వాతది చదువు"

గురువు చేసిన తప్పును ఎత్తి చూపిన శిష్యుడు, ఆ శిష్యుడి మాటకు విలువనిచ్చే గురువును చూసి సభాసదులంతా పులకించిపోయారు.

నాడు, ఇంకా సూరీడు తూర్పు కొండశిఖరం మీద నుండి కిందకు రాకుండానే సీతారామయ్య, తన భార్యతో అంటున్న మాటలు విన్పించాయి. "ఏమోయ్! ఆ పేరయ్యశాస్త్రి దగ్గరకు వెళ్తొస్తాను. మ్యారేజీబ్యూరో నడుపుతున్నాడు కదా.. ఆయన కమీషను ఆయనకిచ్చేస్తే, పెళ్ళికొడుకుల లిస్టు మొహాన పారేస్తాడు. గంతకు తగిన బొంతను వెతుక్కోవడమే మనం చెయ్యావలసిందల్లా!"

"శుభం? వెళ్ళిరండి" ఆమె శకునం కోసమని ఎదురుగా వచ్చి సాగనంపింది.

సుజాత కాలకృత్యాలు ముగించుకుని, తండ్రి గదిలోకి వెళ్ళి ఆయన డైరీ తీసింది. అందులో చివరిపేజీలో శివశంకరం వాళ్ళ ఇంటి చిరునామా, అతని సెల్ నెంబరూ స్పష్టంగా రాసి ఉన్నాయి. సుజాత ఆ సెల్ నెంబరు తీసుకుంది. బయటకు వస్తూ, లోపల వంటింట్లో ఉన్న తల్లితో "అమ్మా! నేను ఇప్పుడే వస్తా!" అంది పెద్దదిగా.

"పొద్దున్నే ఎక్కడికే? " తల్లి వంటింట్లో నుంచే అడిగింది.

"ఇప్పుడే వస్తానన్నాగా!" సుజాత విసుగ్గా జవాబు చెప్పి, వీధి చివరన ఉన్న ఎస్.టి.డి బూత్ దగ్గరకు వెళ్ళింది. పరిచయం ఉన్న బూత్ ప్రొప్రయిటరు, "నెంబరు చెప్పండి, కలిపి ఇస్తాను" అన్నాడు మర్యాదగా.

"నే చూసుకుంటాగానీండీ, మీరు డిస్టర్బ్

కాకండి!" అంటూ క్యాబిన్‌లోకి వెళ్ళి, తలుపు వేసుకుని శివశంకరం సెల్ నెంబరుకు ఫోను చేసింది. అప్పుడు శివశంకరం బ్రేక్‌ఫాస్ట్ చేస్తున్నాడు. అతనికిష్టమని పెసరట్టు ఉప్మా చేసి, అందులోకి అల్లం పచ్చడి వేసి, అతను ఓ ముక్క తుంపి నోట్లో పెట్టుకుంటుండగా కట్నం విషయం కదపబోయింది కామేశ్వరమ్మ.

తింటున్న పెసరట్టు ముక్కను మింగేసి, "హలో" అన్నాడు శివశంకరం. సుజాత కంఠం తీయగా వినిపించింది.

"నేనే.... సుజాతను"

'సు...' అని 'జాతా' అని పూర్తి చేయకుండా, "అమ్మా! వన్ మినిట్" అంటూ అవతలకు నడిచాడు శివశంకరం.

"ఆ మాట్లాడేదేదో తింటూ మాట్లాడకూడదు? ప్రతిదానికీ రహస్యాలు..." కామేశ్వరమ్మ తనలో తను గొణుక్కుంది.

> **కొత్తగాలి...**
>
> **పురుగు మందులు వాడితేనే**
> **పైరులన్నీ పండేది**
> **మందుబాబులు తాగితేనే**
> **ఖజానాలన్నీ నిండేది**
>
> – అంబటి వెంకటశివారెడ్డి,
> యర్రగుంట్ల, కడప జిల్లా

"శివశంకరం తన గదిలోకి వెళ్ళి తలుపేసుకున్నాడు. కిటికీ దగ్గరకు వచ్చాడు "హలో- సుజాతా! సర్‌ప్రైజ్!! ఫోన్‌లో నీ వాయిస్ ఎంత స్వీట్‌గా ఉందో తెలుసా? ఊం ఏవిటి కబుర్లు? "

"సారీ శంకరంగారూ! మిమ్మల్ని పొద్దున్నే డిస్టర్బ్ చేశాను"

"నో నో నో డిస్టర్బెన్స్!! నీ ఫోను రావడం, నాకు ఎంతో సంతోషాన్నిస్తోంది? "

"థాంక్యూ! మీకు వీలైతే, మనం ఓసారి కలుసుకోవాలి!"

"కలుసుకోవాలా? ష్యూర్... ఎక్కడ? ఎప్పుడు? " అతని మనసంతా వెన్నెల్లో విహరిస్తున్నట్టుగా ఉంది.

"మీవాళ్ళకుగానీ, మావాళ్ళగ్గానీ తెలీకుండా మనం కలుసుకోవాలి!"

"మావాళ్ళకు నేను చెప్పను, మీవాళ్ళ విషయం నీ ఇష్టం!"

"థాంక్యూ!!" ఆమె ఒక్కక్షణం ఆగింది. "చాలా అర్జెంట్ మేటర్! రేపు సాయంకాలం మా ఊళ్ళో వున్న ఉడిపి హోటల్లో ఫ్యామిలీ రూంలో అయిదుగంటలకు మీ కోసం వెయిట్ చేస్తుంటాను!"

సుజాత కంఠంలో ఓ ఉద్విగ్నత. మాటలు తొందర తొందరగా వినిపించాయి. శివశంకరం బొమలు ముడివడ్డాయి. సామాన్యంగా ఇట్లా మగవాళ్ళు సాహసిస్తారు, ఆహ్వానిస్తారు. కానీ ఇక్కడ అంతా రివర్స్‌గా ఉంది. ఆ అమ్మాయే తనను కలుసుకోవాలని ఆత్రుత పడుతోంది. శివశంకరం మాట్లాడకపోవడం చూసి, సుజాత ఆందోళనగా అడిగింది.

"ఏవిటి- మౌనంగా ఉన్నారు? "

శివశంకరం చిన్న అబద్ధం ఆడాడు. "మౌనంగా కాదు, ఆనందంతో ఉక్కిరిబిక్కిరవుతున్నాను. వస్తున్నాను, సరేనా? "

"పెట్టేస్తున్నాను" సుజాత ఫోను పెట్టేసి, బిల్లు పే చేసి ఇంటికొచ్చేసింది.

ఇంటికి తిరిగివచ్చిందన్న మాటేకానీ, సుజాతకు మనసు, మనసులో లేదు. తన ధైర్యం చూసి తనకే ఆశ్చర్యం వేసింది. ఏ ఆడపిల్లన్నా ఇట్లా చేస్తుందా? తను చేసింది. ఎందుకు? ఎందుకు? తన హృదయంలో అతనిమీద ఏ మూరుమూలో, తనకు తెలీకుండానే అనురాగం చోటు చేసుకుందా?

కూతురి అస్థిమితాన్ని చూసి పార్వ తమ్మ బాధపడింది. 'పిచ్చిపిల్ల ఆ కుర్ర వాణ్ని ఇష్టపడినట్లుంది. వాళ్లు అంత కట్నం కోరడంతో తాము అందుకు సుము ఖంగా లేకపోయేసరికి బాధపడి ఉంటుంది. బాధపడితే మాత్రం, తామా బాధను తీసివేసే స్థితిలో లేము కదా! కొన్ని కొన్ని అంతే! నయం చేయలేని వాటిని సహించవలసిందే! అదే జీవన సిద్ధాంతం!! '

అనుకున్న సమయానికి ముందే సుజాత తయారైంది. లైట్‌గా కళ్లకు, రెప్పలకు కలర్‌టచ్ వేసుకుంది. వత్తుగా గాజులు వేసుకుంది. చీరకట్టుకొని, పెద్దమనిషి తర హాలో జుట్టును జారుముడి వేసుకుంది. బొడ్డు కనిపించకుండా చీరమడతలు పైకి లాక్కుంది. సాదా చెప్పులు వేసుకుని హోటల్ లాంజ్‌లో నిరీక్షించింది.

ఆమె వచ్చిన కొద్దిసేపటికే శివశంకరం కూడా వచ్చాడు. అతను ట్రిమ్‌గా, హాండ్ సమ్‌గా ఉన్నాడు. డిగ్నిఫైడ్‌గా కనిపి స్తున్నాడు. వస్తూనే తన కన్నాముందే వచ్చి తన కోసం వెయిట్ చేస్తున్న సుజా తను చూసి, ఖంగు తిని "సారీ, ఐయామ్ రియల్లీ సారీ! బస్సు లేటైంది" అన్నాడు.

సుజాత నవ్వింది. "మీరు రైల్లో వచ్చిన ట్లయితే, ఆరుద్రను కోట్ చేసే దాన్ని!"

"ఫర్వాలేదు. మంచి కవిత్వం మనసును ఆహ్లాదపరుస్తుంది చెప్పండి!"

ఇద్దరూ లోపలకు నడిచి, ఓ మూరు మూల స్థలం చూసుకుని, కూర్చుని కాఫీకి ఆర్డరిచ్చింతర్వాత సుజాత చెప్పింది.

"నువ్వు ఎక్కదల్చుకున్న రైలు
ఎప్పుడూ ఓ జీవితకాలం లేటు..
ఇప్పుడు రైలు తీసేసి ఆ చోట బస్సు పెట్టండి".

"ఇప్పుడా కొటేషన్ ఎందుకు? " అడి గాడు శివశంకరం కాఫీ సిప్ చేస్తూ.

"నేను ఎక్కదల్చుకున్న పెళ్లిబస్సు ఎక్కడ మిస్ అవుతుందోనన్న భయం".

"ఎందుకు మిస్ అవుతుందీ! డ్రైవర్ని నేను!"

"కాదు, మీ నాన్నగారు!"

శివశంకరం మొహంలో ప్రశ్నార్థకంగా కనురెప్పలల్లల్లాడాయి.

"పెళ్లి చేసుకునేది నేను!"

"రెండు లక్షలు తీసుకోనిదే మీ నాన్న గారు, అమ్మగారు గ్రీన్ సిగ్నలివ్వరు!" సుజాత నిష్ఠూరంగా అంది.

"అసలేం జరిగింది సుజాతా? " శివశం కరం బాధగా అడిగాడు. సుజాత తాను

## టాగూర్ చతురోక్తులు



ఎంతో గాంభీర్యంగా కన్పించే విశ్వకవి రవీంద్రనాథ టాగూర్ ఎంతో చతురతతో సంభాషించే వారు. 150వ జయంతి సందర్భంగా ఆయన చతురోక్తులు కొన్ని..

**హింస వీడని బౌద్ధాభిమాని!**

విధుశేఖర్ శాస్త్రిగారు బౌద్ధధర్మ నిష్ణా తులు. ఒకరోజు గురుదేవులు వారితో మాట్లాడుతూ కూర్చున్నారు. అప్పుడు ఇత రులు కూడా ఉన్నారు. అకస్మాత్తుగా గురు దేవులు, 'శాస్త్రిగారు! మీరిన్ని రోజులు బౌద్ధ శాస్త్రాలను చదివినా హింసా ప్రవృత్తిని మా త్రం విడనాడలేదు' అన్నారు.

దాంతో శాస్త్రేగాక అందరూ ఆశ్చర్యపో యారు. శాస్త్రిగారు ఎవరి మనసును కూడా నొప్పించే రకం కాదు.

దాంతో మళ్ళీ గురుదేవులే తన తెల్లని గడ్డాన్ని నిమురుకుంటూ 'దీన్ని పెంచండి, బాగా పెరగనివ్వండి, దీన్ని హింసించకండి' అని అన్నారు. దాంతో అక్కడున్నవారంతా రోజూ చక్కగా గడ్డం చేసుకునే శాస్త్రిగారి మొహంవైపు చూస్తూ హాయిగా నవ్వుకు న్నారు.

విన్నదీ, ఊహించుకున్నదీ, అంతా చెప్పింది. చివరగా అంది, "నన్ను మీరిష్ట పడ్డారు. నాకు మీరంటే ఇష్టమే. మనవి మామూలు పెళ్ళిచూపులు కానీ, మనసులు కలిసిన పెళ్ళిచూపులు! మిమ్మల్ని కాదని, మరోసారి ఇంకో మగవాడి ముందు తల వంచుకుని కూర్చోవడమంటేనే నాకు అస హ్యంగా ఉంది. అందుకనే మీకు ఫోను చేశాను. ఏ ఆడపిల్లా ఇట్లా చేయదు. నా గురించి మీరేమనుకున్నారో నాకు తెలి యదు. ఏమనుకున్నా ఇది నా జీవితానికి సంబంధించిన సమస్య. మీకు నేను కావాలో, డబ్బు కావాలో మీరే చెప్పాలి" సుజాత గొంతులో గాద్గద్యం.

ఆ గాద్గద్యానికి శివశంకరం విచలితుడ య్యాడు. మెల్లిగా సుజాత చేతుల్ని తన చేతుల్లోకి తీసుకున్నాడు. ధైర్యం చెబుతు న్నట్లుగా అన్నాడు,

"మైడియర్! పెళ్ళి చూపుల్లో, ఏ క్షణంలో నీ తలలో నా ప్రేమ పుష్పాన్ని తురి మానో, ఆ క్షణంలోనే ఏ పరిస్థితుల్లోనూ, నిన్నే నా భార్యగా చేసుకోవాలని నిర్ధారిం చుకున్నాను. నా నిర్ణయం మారదు. నా మాట నమ్ము. యూ ఆర్ మై వైఫ్! నిన్ను నా భార్యగా చేసుకు తీరతాను!"

సుజాత అతని చేతుల్లో నుండి తన చేతుల్ని విడిపించుకుంది. "మీ నాన్నగారు కట్నానికి ఒత్తిడి చేస్తే..." అని అడిగింది.

"ఆ విషయం నా కొదిలేయ్!" శివశం కరం దృఢంగా అన్నాడు.

"అనవసరంగా ఈ విషయం గురించి ఆలోచిస్తూ నీ ఆరోగ్యం పాడుచేసుకోబోకు. పెళ్ళి పీటలమీద నిన్ను చూసి, అందరూ నా అదృష్టానికి అసూయపడాలి. దేముడు నాకు పంపిన అపురూప పారిజాతానివి. అనుక్షణం ఇది నవనవంగానే ఉండాలి. పరిమళ ప్రసూనంగానే ఉండాలి. తల్లీతండ్రీ- స్నేహితులూ- బంధువులూ.. ఈ సమస్త ప్రపంచమూ ఒక ఎత్తు. నువ్వొక్కత్తివీ ఒక ఎత్తు. సరేనా?"

తర్వాత సుజాత తన ఇంటికి గాల్లో తేలుతూ వచ్చింది. జగత్తంతా ఆమెకు సుందరంగా, ఆనందభరితంగా, అనుభవా నికి అర్థమైందిగా కన్పించింది.

ఇంటికి వచ్చిన కూతురికి సీతారామయ్య తను పేరిశాస్త్రి దగ్గరకు వెళ్ళి వచ్చిన సంగతీ, మరో సంబంధాన్ని ఎంపిక చేసిన సంగతీ, ఇంకొక యువకుడ్ని పెళ్ళి చూపు లకు ఆహ్వానించబోతున్న సంగతీ చెప్పాడు.

"వద్దు నాన్నగారూ! ఇంకెవర్నీ పిలవ కండి. ఇంకే ప్రయత్నమూ చేయనక్కర లేదు" అంది సుజాత కరాఖండిగా.

కూతురి మాటలు విన్న పార్వతమ్మ "రెండు లక్షలు ఎక్కడి నుంచి తెస్తాం?" అంటూ అడిగింది. "ఆ శివశంకరాన్నే నువ్వు ఇంకా మనసులో ఉంచుకుంటే ఎట్లాగే?"

సీతారామయ్య తనలో తనే గొణుక్కు న్నాడు. "ఆ రెండు లక్షల కట్నమూ నేని వ్వలేను. నువ్వు ఆ శంకరాన్నే కావాలను కుంటున్నావు. ఏం చేయను నేనీ పరిస్థి తుల్లో? ఇల్లు అమ్మేద్దామన్నా, ఏమొ స్తుందీ పాతకొంపకు?"

సుజాత తండ్రివేపు సానుభూతిగా చూసింది. "కొంచెం ఓపిక పట్టండి నాన్న గారూ! నా మూలంగా మీకు ఏ కష్టం కల గదు, రానీను- సరేనా?" సుజాత తన గదిలోకి వెళ్ళిపోయింది. ఆమె అన్న మాటలు వాళ్ళిద్దరికీ ఏమాత్రం అర్థం కాలేదు. ప్రశ్నా నేత్రాలతో అట్లాగే చూస్తూ ఉండిపోయారు. ఇక్కడ సుజాత ఇంట్లో పరిస్థితులు పైకి స్తబ్ధుగా, లోలోపల ఉద్వి గ్నంగా ఉంటే..

అక్కడ శివశంకరం ఇంట్లో మరోవి ధంగా ఉన్నాయి.




# వెండి.. మహా మంచిదండి!!



బంగారం తర్వాత విలువైన లోహం వెండి. దీన్ని వైట్‌గోల్డ్ (తెల్ల బంగారం) అంటారు. బంగారంలా తేలిగ్గా సాగే, వంగే గుణం గల లోహం ఇది. వెలుతుర్ని వెండి ప్రతిబింబించినట్లుగా మరేలోహం చేయదు. అందువల్ల వెండిరేకులని సోలార్‌పవర్ యంత్రాలలో, టెలిస్కోపులలో వాడుతుంటారు.




నీళ్ళల్లోని బాక్టీరియాని చంపే గుణం వెండికుంది. అందుకే హాస్పిటల్స్‌లో వెండితో చేసిన కార్బన్ ఫిల్టర్స్‌ని నీటిని వడపోయటానికి వాడుతుంటారు. శస్త్రచికిత్సలో కాలిన గాయాలకి చీము పట్టకుండా వెండి క్రీమ్‌ని వాడుతుంటారు.

రాగికన్నా ఎక్కువ ఉష్ణవాహకశక్తిని ఉండటంవల్ల హియరింగ్ ఎయిడ్స్, క్యాలిక్యులేటర్లు, శాటిలైట్లు, కంప్యూటర్లలో వెండి బేటరీలనే వాడతారు. స్పేస్‌షటిల్స్‌లో కూడా వెండిని అధికంగా వాడతారు.

గత ఐదేళ్లలో పది లక్షల మెట్రిక్ టన్నుల వెండిని గనుల్లోంచి వెలికి తీశారు. దాంట్లో మూడో భాగం ఉత్తర, దక్షిణ అమెరికాల నుంచే వచ్చింది. ఈ వెండిని తలసరిగా పంచితే ప్రపంచంలోని ఒక్కో మనిషికి రెండు వందల గ్రాములు వస్తుందట.

పెళ్లి చూపులైన మూడో రోజున, శుక్రవారంనాడు సీతారామయ్య దంపతులు వియ్యాలవారింటికి వచ్చి కట్నం విషయం తెలుసుకుని, దిగాలు పడి వెళ్లిపోయారు. ఆ తర్వాత అయిదారు రోజులు గడిచిపోయాయి. కుటుంబరావుకు, సీతారామయ్య దగ్గర నుంచి ఏ వర్తమానమూ రాకపోవడంతో ఆయన కొడుకుతో అన్నాడు,

"ఒరేయ్ శివా! పెళ్లిచూపులకు వెళ్లొచ్చామే, వాళ్ల దగ్గర నుంచి మనకే వర్తమానమూ రాలేదు. బహుశా మనం అడిగిన కట్నకానుకలకు వాళ్లు తూగలేక మన సంబంధం విరమించుకొని ఉంటారు. అంచేత ఇంకోటి చూస్తే మంచిదేమో!"

శివశంకరం అప్పుడే ఆఫీసు నుండి వచ్చాడు. తల్లి ఇచ్చిన కాఫీ తాగుతున్నాడు. "డాడీ! మీకు తెలుసు, కాఫీ అయినా నాకు బావుండకపోతే తాగనని. నేను వేసుకునే చొక్కా నాకు నచ్చాలి. నాతో మాట్లాడే మనుషులు నాకు నచ్చాలి. అట్లాగే నాతో కాపురం చేసే అమ్మాయి కూడా నాకు నచ్చాలి. సుజాత నాకు బాగా నచ్చింది!"

కామేశ్వరమ్మకు ఆ మాటతో బాగా కోపం వచ్చింది. "అవున్రా! నీకు నచ్చాల్సిందే! కానీ ఈ ఇంటి పరువుప్రతిష్ఠల్ని కాపాడేదిగా ఉండాల్సింది కోడలు పిల్లేరా!"

"సుజాత ఆ విధంగా చేయలేదని ఎందుకనుకుంటున్నావూ?"

కుటుంబరావు మెల్లగా అన్నాడు, "అది కాదు శివా! రెండు లక్షలు లేందే ఈ ఇల్లు మనకు దక్కదురా! నీకు నచ్చిన అమ్మాయి

ఆ మాత్రం తెచ్చి, ఈ ఇల్లు కాపాడుకోలేకపోతే, ఇహ ఆ తర్వాత ఈ ఇంటి గౌరవ ప్రతిష్ఠలేం కాపాడుతుందిరా? "

"ఆ పిల్లనే నువ్వు చేసు కోదల్చుకుంటే, మీ నాన్న గారి చేతిలో వాళ్ళు ఆ రెండు లక్షలూ పోయా ల్సిందేరా? " కామేశ్వ రమ్మ తేల్చి చెప్పింది.



"మీ అమ్మ చెప్పింది నిజమే! నువ్వేమనుకున్నా సరే, నీ పెళ్ళి మూలంగా రెండు లక్షలు కావాలనుకు న్నాను, రావాలనుకు న్నాను. అట్లా జరక్క పోతే నేనూ, మీ అమ్మ పెళ్లిపీటల మీద కూచోం"

కుటుంబరావూ కామేశ్వరమ్మ, కొడుకును అతని ఆలోచనలకు అతన్ని వదిలివేసి, అక్కడి నుండి వెళ్ళిపోయారు. శివశంకరానికి తండ్రి మాటలు బాధ కల్గించాయి. మొదటిసారిగా తన తండ్రి ఆ విధంగా మాట్లాడడం తాను విన్నాడు. ఇంతకాలం తన కోసం ఆయన లోలోపల ఎంతో నలిగిపోయాడు. ఎప్పుడూ తన కష్టాలు, బాధలు, తపనలు, ఆశలు, కోర్కెలు, ఇవేవీ తనతో ఆయన ప్రస్తావన చేయలేదు. తను ఏది కావాలన్నా, ఎలాగోలా అమర్చి పెట్టేవాడు.

'నాకు కాటన్‌డ్రెస్ వద్దు. టెరీ కాటన్ కావాలి' అంటే, కుట్టించి పెట్టాడు.

'నేను నడిచి వెళ్ళలేను నాన్నా! ఓ సైకిలు కొనిపెట్టు' అంటే.. హైస్కూల్లోకి రాగానే తన కోర్కె తీర్చాడు, తను అడిగిన రెండు రోజులకే. ఆ సైకిలు కొనడానికి, తండ్రి చేతినున్న వొంటి రాయి ఉంగరం 'హుష్‌కాకి' అయిపోయిందని తనకు ఎంతో కాలానికిగానీ తెలియలేదు.

"నాన్నా! నువ్వు మాథమేటిక్స్ గ్రూప్



తీసుకో.. ఇంజినీరువు కావచ్చు" అడిగాడు సీతారామయ్య, కొడుకుని ఎంతో ఆశతో, కొడుకు ఇంటర్మీడియట్‌లోకి రాగానే.

"ఉహూ, కామర్సు చదువుతా! మా ఫ్రెండ్సంతా అదే గ్రూపు తీసుకున్నారు" తను మొండిగా అన్నాడు.

"సరే- నీ ఇష్టం!" సీతారామయ్య తన అయిష్టాన్ని తనలోనే దాచుకున్నాడు. ఆయన వదనం చిన్నబోయిన వైనం అప్పుడు తను కనిపెట్టలేకపోయాడు.

అమ్మ కూడా అంతే! తననే ఆడపిల్ల, మగపిల్లవాడనుకుని అంత ప్రేమగానూ పెంచింది.

కానీ ఇప్పుడు తనకు సుజాత కావాలి. వాళ్ళకు రెండు లక్షలు కావాలి. శివశంకరం లోలోపల ఒక నిశ్చయానికి వచ్చాడు. తను తన కోరికా తీర్చుకోవాలి, వాళ్ళనూ చిన్నబుచ్చకూడదు. ఎట్లా? ఎట్లా? ఎట్లా?

ఆఫీసులో ఆ రోజంతా అన్యమనస్కంగానే శివశంకరం గడిపాడు. ఆఫీసులో వర్కింగ్ అవర్స్ అయిపోయిన తర్వాత, సాయంకాలం వేళ నలుగురి స్నేహితులతో కలిసి అతను బ్యాడ్మింటన్ ఆడతాడు. ఆ రోజు ఆడలేదు. ఇంటికి వెళ్లే ముందు అతనూ, అతని స్నేహితులూ ఆ రోజు విశేషాలను పునశ్చరణ చేసుకుంటూ, సినిమా కబుర్లు చెప్పుకుంటూ మదీనా హోటల్‌లో ఇరానీచాయ్ తాగడం అలవాటు. ఆ రోజు అదీ చెయ్యలేదు. బలవంతం చేయగా చేయగా అసలు సంగతి బయటపెట్టాడు.

విన్న స్నేహితుల్లో కిరీటి కొంచెం సీనియర్. జోక్యులర్‌గా అన్నాడు, "బావుంది శంకరం! వరకట్నం పుచ్చుకోవడం పోయి, కన్యాశుల్కం ఇస్తున్నావన్నమాట!"

సత్తిపండుకు షేక్స్‌పియర్ అంటే మహా ఇష్టం. "మీకు తెలీదండి కిరీటి గారూ! షేక్స్పియర్ చెప్పనే చెప్పాడు, బంగారం కన్నా సౌందర్యమే ముందుగా మనుష్యుల్ని దొంగలు చేస్తుందీ అని! ఆ అమ్మాయి మనవాడి మనసును దోచేసుకుంది. అందుకనే శంకరానికిన్ని తిప్పలు!"

స్నేహితుల ఎకసెక్కాలకు శివశంకరం ప్రతిగా ఏమీ మాట్లాడలేదు. వింటూ ఊరుకున్నాడు. వాళ్ళు అనాలనుకున్నదంతా అన్న తర్వాత, ప్రశాంతంగా అడి

## మామిడిపళ్లకో నమస్కారం!



రవీంద్రనాథ్ టాగూర్‌కి మామిడిపళ్లంటే అమితప్రీతి. చైనాలో వారున్నప్పుడు పిలిఫ్పైన్స్ నుండి టెలిగ్రాం వచ్చింది, 'మీకు పిలిఫ్పైన్స్ మామిడిపండ్లను పంపిస్తున్నాం' అని. మామిడిపండ్లు వచ్చాయి. పళ్ళల్లో పీచు అధికంగా ఉంది. వాటిని కోసి తినడం కష్టమైంది. మామిడి పళ్ళ ముందు కూర్చుని వాటికి నమస్కరించారు గురుదేవులు.

'పళ్ళకు ఎందుకు నమస్కరించారు?' అడిగాడో మిత్రుడు.

'వాటి పీచు నా గెడ్డపు వెంట్రుకలకంటే పొడుగ్గా ఉంది. నిజానికి ఇవి పండ్లు కావు. నా పెద్దన్నల వంటివి' అన్నారు గురుదేవులు.

గాడు, "ఓకే! ఇప్పుడు పరిష్కారం చెప్పండి!"

ఆ స్నేహితులు తీవ్రంగా ఆలోచించారు. నిశ్శబ్దంలో వాళ్ళ ఊహలు పలు రకాలుగా ప్రవహించాయి. పలుదెసలుగా పరుగెత్తాయి. చివరకు తలపంకిస్తూ డిస్పాచ్ క్లర్క్ సౌజన్యారావు అన్నాడు. "మనం తలా పదివేలు వేసుకుందాం! నా మటుకు నేను పదివేలు ఇవ్వడానికి సిద్ధం!"

అందరూ తలా పదివేలూ ఇవ్వలేమన్నారు. ఒకవేళ తల తాకట్టుపెట్టి ఎక్కడో అక్కడ అప్పు తెచ్చి ఇచ్చినా, అది ఏమూలకూ సరిపోదన్న నిర్ధారణకొచ్చారు. మరి ఏం చేయడం? ప్రశ్న మొదటికి వచ్చింది.

అనుభవజ్ఞుడైన కిరీటి ఓ మార్గాంతరం సూచించాడు. "బ్యాంకులో అప్పు తీసుకుంటే? "

"గుడ్ ఐడియా!" మరో క్లర్కు వంత పలికాడు. "మనం అంతా ప్రభుత్వోద్యోగులం కదా! బ్యాంకు లోను జీతంలోనుంచే పే చేయవచ్చు. గ్యారంటీర్‌గా ఎవరున్నా ఫర్వాలేదు"

"శంకరం! నీ సమస్య తీరిపోయినట్లే! ఇంకా ఎందుకురా ఆ ఆముదం మొహం? రేప్పొద్దున్న అందరం బ్యాంకుకు వెళ్తున్నాం! మేనేజర్‌తో మాట్లాడుతున్నాం. లోన్ తీసుకుంటున్నాం. ఎల్లుండి పొద్దున్న ఆ డబ్బు తీసుకువెళ్ళి నీ కాబోయే మామగారికిస్తున్నావు. ఆయన దాన్ని తీసుకువచ్చి దర్జాగా మీ నాన్నకిస్తాడు. నువ్వు చేసిన పనికి నువ్వు కావాలనుకున్న ఆ అమ్మాయి, 'ఎంత మంచివారండీ మీరు! నాకోసం ఎంత గొప్ప పని చేశారు!' అంటూ వచ్చి, అమాంతం నిన్ను కౌగలించుకుని.." అందరూ పకపకా నవ్వారు.

ప్రణాళికను మరోసారి లోపరహితంగా సరిచూసుకుని, శివశంకరాన్ని ఆటపట్టించి, నవ్వుకుంటూ, ఆ బృందం వెళ్ళిపోయింది.

**శివశంకరానికి మనసంతా తేలికపడ్డట్లుగా ఉంది. ఇహ సుజాత తనదే! ఆమె దృష్టిలో తనో హీరో అవుతాడు!**

ఆ రాత్రంతా శివశంకరానికి కలత నిద్రే! కల్లో వికసించిన పువ్వులూ, వెన్నెల విరబోస్తున్న పూర్ణచంద్రుడూ, కలకూజితాలు వినిపిస్తున్న రామచిలుకలూ, అలలో ఎగసిపడుతున్న నిండు గోదావరీ కనిపించాయి. సుజాత, తనూ కాశ్మీరులో డ్యూయెట్లు పాడుకున్నారు. శ్రీశైలం దగ్గర పాతాళగంగలో సరిగంగ స్నానాలు చేశారు. శ్రీకాళహస్తిలో మహాశివుడికి మందార పుష్పాలతో పూజచేసి, హారతి వెలిగించారు.

ఆ ఉదయం అతను నిద్రలేచేసరికి గడియారం నాలుగు గంటలు కొడుతోంది.

"ఇంకా నాలుగేనా? " విసుక్కున్నాడు. ఫ్రిజ్‌లో ఉన్న రాత్రిపాలతో కాఫీ పెట్టి తండ్రిని నిద్రలేపి బెడ్‌కాఫీ ఇచ్చాడు.

"ఇదేమిట్రా! ఎప్పుడూ లేని ఈ కాఫీ ఏమిటి ఇప్పుడు నాకు? " ఆయన కాఫీ తీసుకుంటూనే ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"ప్రశ్న వేయకుండా తాగండి! ఎంజాయ్!" అన్నాడు శివశంకరం.

"పళ్లు తోముకోకుండా కాఫీ తాగడం ఎంజాయ్‌మెంట్ ఏవిట్రా? నీ మొహం!" అంటూనే కొడుకు ఇచ్చిన కాఫీని ఊదుకుంటూ తాగేశాడు ఆ తండ్రి. ఇంకా కాసేపు అయింతర్వాత తల్లికి కూరలు తరిగిపెట్టాడు, వద్దని ఆమె ఎంత వారిస్తున్నా. బియ్యం కడిగి పొయ్యిమీద పెట్టాడు. గంట ఎనిమిదన్నర అయింది.

"నాన్నగారూ! ఇవ్వాళ ఆఫీసుకు ముందుగా వెళ్ళాలి. సాయంకాలం కూడా ఓవర్‌టైం వర్క్ చేయాలి. అందుకని నా కోసం వెయిట్ చెయ్యకండి!" అని తండ్రితో చెప్పి, "అమ్మా! మధ్యాహ్నం అన్నానికి ఇంటికి రాను. నాన్నగారూ, నువ్వూ తినేసేయండి!" అంటు బయటకు త్వరత్వరగా వెళ్ళిపోయాడు.

దార్లో వేంకటేశ్వరస్వామి దేవాలయంలో నుండి వేదాంత ప్రవచనం మైకులోనుండి వినిపిస్తోంది.

దారేషణ, ధనేషణ, పుత్రేషణ ఈ మూడింటినీ ఈషణ త్రయమంటారు. త్రయం అంటే మూడు, ఈషణం అంటే కోరిక. నిగ్రహించుకోలేని కోరిక. ప్రతి మగవాడు ఈ మూడు కోరికలకూ బానిసగా బతుకుతుంటాడు.

కట్టుకున్న ఆడదాని మీద, ఇంతా అంతా అనలేని ప్రేమ. కడుపున కన్న పిల్లల మీద నిగ్రహించుకోలేనంత మమకారం. ఇంకా స్త్రీ వ్యామోహాన్నీ, పుత్ర వ్యామోహాన్నీ పురస్కరించుకుని, వాళ్ళను సుఖపెడుతున్నానన్న ఆ భాసలో ధనార్జనకై పడే వెంపర్లాట- ఇవి జయిస్తే మనీషి. జయం చలేకపోతే మహిషి.

ఆ ఉపన్యాసం శివశంకరానికి కోపం తెప్పించింది. స్త్రీ ప్రేమలో ఉన్న మజా ఏవిటో అనుభవించిన వాడికే తెలుస్తుంది. పిల్లలూ, డబ్బూ ఇవి లేకుండా జీవన సౌఖ్యం ఎక్కడుంటుంది? అనుకున్నాడు శివశంకరం. ఛీత్కారం చేసి ముందుకు కదిలాడు. అతను కిరీటి ఇంటికి వెళ్ళాడు.. తొమ్మిది... రోడ్డుమీద స్కూళ్ళకు పిల్లల్ని మోసుకు వెళ్తున్న రిక్షాల గణగణలు.

కిరీటి స్నేహితుణ్ని చూసి పలకరింపుగా నవ్వి, హాల్లో గోడకున్న గడియారాన్ని చూపించాడు. తొమ్మిదింపావు.

"పదయితే గాని బ్యాంకులు తలుపులు తెరవరు బాబూ!"

ఇద్దరూ కొంచెం వెయిట్ చేసి సౌజన్యారావు ఇంటికి వెళ్ళారు. తొమ్మిదిన్నర. ఎట్లాగైతేనేమి ముగ్గురూ బ్యాంకు మేనేజరును కలుసుకునేసరికి పదిన్నరయింది. వాళ్ళ సహోద్యోగులు ఆఫీసులో వాళ్ళకి లేట్ పర్మిషన్ అడగడం కోసమని, వాళ్ళతో వెళ్ళలేదు.

ఏమైతేనేమి, మొత్తానికి సౌజన్యారావు మాట్లాడిన మాటతీరూ, కిరీటి చేసిన గ్యారంటీ సంతకమూ, శివశంకర్ ఇచ్చిన హామీలూ సంతకాలూ వెరసి, అన్నీ కలిసి అతనికి బ్యాంకునుండి రెండురోజుల్లో రెండు లక్షల రూపాయలు రుణంగా వచ్చేట్లు చేశాయి.

డి.డి. తీసుకుని బయటకు వచ్చింతర్వాత కిరీటికీ, సౌజన్యారావుకూ మరిమరీ కృతజ్ఞతలు చెప్పాడు శివశంకరం.

"అవసరానికి ఆదుకోని స్నేహితుడెందుకు? ఆ స్నేహానికి విలువేముంది? " అన్నాడు కిరీటి.



"లోన్ విషయం వదిలిపెట్టు! నువ్వు కోరుకున్న అమ్మాయినే నువ్వుపెళ్ళి చేసుకునేట్లు, అందుకు మేం సాయిపడినందుకు మాకు చాలా సంతృప్తిగా ఉంది!" అన్నాడు సౌజన్యరావు.

శివశంకరం గుండె కృతజ్ఞతతో బరువెక్కింది. కళ్లు తడితడిగా మెరిశాయి. నిట్టూర్చి, వాళ్ళను సోదరభావంతో గాఢంగా ఆలింగనం చేసుకుని, "సుజాత వాళ్ళ ఊరు వెళ్తున్నా(నా! అక్కడ ఈ డీడీ మార్చి డబ్బిచ్చి వస్తాను" అన్నాడు.

వెళ్తూ వెళ్తూ 'శివయ్య పెళ్ళి కొడుకాయెనే! సుజాత పెళ్ళి కూతురాయెనే!' అంటూ అతని ఇద్దరు స్నేహితులూ కాసేపు ఆటపట్టించి, "వెళ్లు... వెళ్ళు..." అంటూ బెస్టాఫ్ లక్ చెప్పి, పంపించారు.

శివశంకరానికి బస్సు నత్తనడక నడుస్తున్నట్లుంది. బస్సు దిగి సుజాత తండ్రికి ఫోన్ చేశాడు.

అదృష్టవశాత్తూ ఆయన ఇంట్లో ఉన్నాడు. ఫోనందుకుని, "ఎవరూ?" అని అడిగాడు.

"మావయ్యగారూ, నేను శివశంకరాన్ని...!"

సీతారామయ్యకు ఆ పిలుపు వింతగా ధ్వనించింది. 'మావయ్యగారూ అంటాడేమిటీ?' అని వితర్కించుకున్నాడు.

"ఏవిటి బాబూ! అంతా కులాసాయేనా?" అడిగాడు మర్యాద కోసం.

"ఓ ముఖ్యమైన పనిమీద మీ ఊరొచ్చాను. ఏమనుకోకపోతే, మీ అమ్మాయిని ఓసారి ఉడిపి హోటలు దగ్గరకు రమ్మని చెబుతారా?"

విషయం తెలుసుకున్న పార్వతమ్మకు కోపం వచ్చింది. "చెప్పండీ! మనమేమన్నా లేకీ మనుషులమా? పెళ్ళికాని అమ్మాయిని అట్లా హోటళ్లకూ, లాడ్జీలకూ పంపించము అని గట్టిగా చెప్పండి!"

గదిలోనుండి హాల్లోకి వచ్చిన సుజాత, తల్లినడిగింది, "ఏవిటమ్మా?"

"చూడవే ఆ అబ్బాయి సాహసం! ఆ ముసలాయనకేమో రెండు లక్షలూ బిళ్ళ కుడుముల్లా కావాలి. పెళ్ళికొడుక్కేమో నీతో వికవికలూ పకపకలూ కావాలి. ఇదేం చోద్యమే?"

"ఎవరూ? శివశంకరంగారు ఫోను చేశారా?"

"అవును, ఆయనగారే! పైగా మీ నాన్నను, 'మామయ్యగారూ' అని సంబోధించడం!! ఇది మనను అవమానించడం కాదుటే?"

"నీకేం తెలీదు కానీ, కాసేపు నువ్వు ఊరుకుండు. ఎక్కడ్నుంచి నాన్నగారూ ఆయన ఫోన్ చేసింది?"

"ఇక్కడ్నుంచేనమ్మా- ఊర్లోకొచ్చాట్ట.. నిన్ను కలుసుకోవాలనుకుంటున్నాడు"

సుజాత "అట్లాగా" అంటూ, "ఎక్కడున్నారట?" అని అడిగింది.

"అదే- ఉడిపి హోటల్లో!"

ఆ మాట వినగానే, ఒక్క క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా, హ్యాండ్‌బ్యాగ్ తీసుకుని సుజాత తూనీగలా పరుగెత్తింది.

"ఉసేవ్.. వొసేవ్.. ఆగవే.. ఆగవే..!" అంటున్న పార్వతమ్మ మాటలు ఆ అమ్మాయి పట్టించుకోలేదు.

"ఇదేమిటండీ చోద్యం? మీరట్లా చూస్తూ ఊరుకుంటారేమిటీ? రెక్కపట్టి వెనక్కు లాగద్దూ?"

"ఓసి వెర్రి ఇల్లాలా! వ్యవహారం ఇంత దూరం వచ్చిందంటే, మనకు తెలియనిదేదో జరుగుతోందన్నమాట! మన అమ్మాయి అంత తెలివి తక్కువదీ, తొందరపడే మనిషీ కాదు. వెళ్ళిందిగా- తిరిగి రానీ కనుక్కుందాం! తొందరపడి, మనం చేయగలిగేదేముంది గనుక?" సీతారామయ్య, భార్యను సముదాయించాడు.

# హవ్వ .. ఇదేం మరుపు?

నార్వేలోని బెర్జెన్‌కి చెందిన రోసా(36) ఆఫ్రికానుంచి వలస వచ్చింది. 2009 ఆగస్టులో ఆమెకి టిమ్‌తో వివాహమైంది. వారు హనీమూన్‌కి అమెరికాలోని నయాగరా ఫాల్స్‌కి వెళ్లారు. నార్వేకి వలస వచ్చి ఆమెలాగే హనీమూన్‌కి అక్కడికి వచ్చిన ఓ మిత్రురాలు గుర్తుపట్టి రోసాను పలకరించింది. 'మీవారు పోయారా? లేక విడాకులు తీసుకున్నావా?' అని తన భార్యని ఆమె అడగడం టిమ్ చెవినపడింది. వెంటనే అతను బెర్జెన్ పోలీసులకి ఫోన్‌చేస్తే, ఆమె వలసపత్రాలలో వివాహితురాలన్న సమాచారం ఉందని తెలిసింది. అక్కడ్నుంచి నార్వే వెళ్ళాక ఆమెను పోలీసులు బహుభర్తృత్వం కేసుకింద అరెస్ట్ చేశారు. ఆమె తనకు వివాహమైందన్న సంగతి మర్చిపోయానని కోర్టుకు చెప్పింది. పోలీసులు ఆఫ్రికాకు వెళ్లినా ఆమె మొదటి భర్త ఆచూకి కనుక్కోలేకపోయారు. దాంతో ఆ కేసును జడ్జి డిస్మిస్ చేశాడు.






శివశంకరాన్ని చూడగానే సుజాత మనసు రెక్కలు తొడుక్కుంది. ఆమె కళ్ళు పద్మ నేత్రాలయ్యాయి. పెదవులు కదిలి, చెంపలు రాగరంజితమయ్యాయి. "ఎంతసేపైంది వచ్చి? ఇంటికే రావొచ్చుగా, డైరెక్టుగా!!" అంది. ఇద్దరూ ఫ్యామిలీ రూంలోకి వెళ్ళి, కిందటిసారి కూచున్న చోటే కూచున్నారు.

"ఏం తీసుకుంటావ్?" అడిగాడు శివశంకరం.

"కాఫీ!" అంది సుజాత, మామూలు స్వరంతో

"ఇప్పుడు కాఫీ మాత్రమే కాదు, స్వీట్ కూడా తీసుకోవాలి"

"అంత స్వీట్‌న్యూస్ ఏదో చెప్పబోతున్నారా?"

"చెప్పడమే కాదు, చేసి చూపించబోతున్నాను!"

అతను ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. డీడీ తీసి ఆ చేతిలో పెట్టి, ఆ చేతిని మెల్లగా ముద్దు పెట్టుకున్నాడు. 'ఏమిటీ పని?' అని ఆమె అడిగేటంతలోనే ఆ పని జరిగిపోయింది. ఆమె సిగ్గుపడి అటూ యిటూ చూసింది. ఆ తర్వాత చేతిలోనున్న డీడీని తీసి చూసుకుంది. రెండు లక్షలు...!!

ఆమె అవాక్కయింది. గుండె వేగంగా కొట్టుకుంది. నుదుటి మీద చిరుచెమట పట్టింది. శివశంకరం సెంటు రాసిన కర్చీఫ్ తీసి ఆమె నుదురునద్దాడు.

"ఇది నీకే! ఇద్దరం బ్యాంక్‌కి పోదాం పద. క్యాష్ ఇస్తారు. మావయ్యగారికియ్యి. మీ నాన్నగారూ- అమ్మగారూ మా ఇంటికి వచ్చి, ఆ క్యాష్‌ను మా నాన్నగారికివ్వమని చెప్పు. దాంతో అటు మా నాన్నగారికి తన మాటా చెల్లుబడి అయినట్లుం

టుంది. మీ నాన్నగారికి రెండులక్షల కట్నం ఇచ్చినట్లుంటుంది. నాకు నువ్వు దక్కినట్లూ అవుతుంది" అతనంటున్న మాటలు ఆమెకు మధురస్వరాల్లా వినిపిస్తున్నాయి. అవి తేనె వాకలై, జననాంతర సుహృద్వరాలై, భగవదాశీర్వచనాల్లా ఆమెను ముంచెత్తుతున్నాయి.

శివశంకరం నిలువెత్తు హిమాలయ పర్వతమై కనిపిస్తున్నాడు.

ఆమెకు ఆవేశం, ఒకానొక విచిత్ర ప్రేమోద్రేకం వర్షమై, హర్షమై ఆమె సమస్త చైతన్యాన్నీ ఆక్రమించింది. మరేమీ ఆలోచించలేకపోయింది. అతనిని దగ్గరకు లాక్కుంది. "యూ ఆర్ గ్రేట్! రియల్లీ యూ ఆర్ గ్రేట్!" అంటూ కుడిచెంపను

## కొత్తగాలి...

**చేల గట్లపై**
**కొంగల బార్లు**
**చేపల కోసం**
**దొంగ జపాలు**

– పినిశెట్టి లక్ష్మీశారద,
రాజమండ్రి

చుంబించింది.

ఆ ప్రథమ ఆవేశపు పొంగు రవంత తగ్గింతర్వాత, తను చేసిన పని తెలిసొచ్చి కుంచించుకుపోయింది. "సారీ...!" అంది అతిమెల్లగా.

ఆ అమ్మాయి పెట్టిన మొదటి ముద్దుకే అతని హృదంతర స్వర్గద్వారాలు తెర్చుకున్నట్లయింది. ఆ ముద్దు వెచ్చగా ఉంది. ఆ అమ్మాయి శ్వాస నవపారిజాత పరిమళాన్ని మోసుకు వచ్చింది. ఆ పిల్ల శ్వాస తొలి సూర్యకిరణంలోని కోమలమైన వెచ్చదనాన్ని పొదువుకుంది. అతను అతికష్టం మీద తనను తాను నిగ్రహించుకున్నాడు. సుజాతవైపు ప్రేమైకదృక్కులను పంచాడు.

సుజాత తల ఎత్తకుండా, "మీరే వచ్చి ఆ డబ్బు మా నాన్నగారికిస్తే బావుంటుంది కదా? " అంది.

"బావుండదు. ఆయన అహం దెబ్బతింటుంది. ఆయనను నేను కించబరచకూడదు. పైగా మీవాళ్ళకు నేను నీ కోసం ఏం చేయగలనో పరోక్షంగానే తెలియాలి. ఇంకో రహస్యం కూడా వుంది"

సుజాత మెల్లగా తలెత్తి, అతనివేపు ఆరాధనాభావంతో చూసింది.

"ఏవిటి? "

"ఇది నీ అందానికి నేనిచ్చే తొలి తాంబూలం. దీంతో వాళ్ళకు నీ సౌందర్యం ఎంత గొప్పదో స్పష్టమవుతుంది"

అతను ఏం మాట్లాడుతున్నా, 'ఆc! ఉc!' అనడం తప్ప సుజాత మరేమీ అనలేకపోతోంది. అతనితో కలసి బ్యాంకుకు వెళ్ళింది. వెయ్యిరూపాయల నోట్ల కట్టలను రెండింటిని అతను ఆమెకు ఓ చిన్న బ్రీఫ్ కేసులో పెట్టి అందించాడు. ఆమె ఇంటి దాకా వచ్చి తన ఇంట్లోకి వెళ్ళడం చూసిం తర్వాత, హుషారుగా ఈల వేసుకుంటూ బస్సుస్టాండు వేపుగా కదిలాడు.

ఇంటికి వచ్చిన సుజాతను పార్వతమ్మ రకరకాల ప్రశ్నలతో వేధించసాగింది. "ఎందుకు రమ్మన్నాడే అతను? ఏం చెప్పాడు? కట్నం విషయంలో వాళ్ళ నాన్ననేమైనా ఒప్పించాడటనా? ఏవిటే మాట్లాడవ్? "

సీతారామయ్య కూతురి చేతిలో ఉన్న కొత్త బ్రీఫ్‌కేసును చూశాడు.

వెళ్లేటప్పుడు ఉత్త చేతులతో వెళ్లింది. వచ్చేటప్పుడు బ్రీఫ్‌కేసుతో వచ్చింది. అందులో ఏముంది చెప్మా!

"ఏవన్నా గిఫ్ట్ ఇచ్చాడా? " సీతారామయ్య అడిగాడు, తీసుకోడం తప్పు కదా

అన్నట్టుగా!

సుజాత తల్లిదండ్రులవేపు, పసివాళ్ళను చూసినట్లుగా చూసింది. "చెబుతాను కానీ నాన్నగారూ, ఒకసారి నాతో దేముడి గది లోకి రండి" అంది.

సీతారామయ్య లేవలేదు. పార్వతమ్మ ఆ ఇద్దరివేపూ చూస్తోంది.

"ప్లీజ్ రండి నాన్నగారూ!" అంటూ సుజాత తన తండ్రిని ఆప్యాయంగా చేయి పట్టిలాగి నుంచోబెట్టింది. దేముడి గదివైపు నడిపించింది.

"నువ్వూ రావే!" అంది తన తల్లితో.

సీతారామయ్య, పార్వతమ్మా దేముడి గదిలోకి వచ్చారు. సుజాత ముందుగా ఆ బ్రీఫ్ కేసును రాములవారి పటం ముందు పెట్టింది. దానిమీద కుంకుమ చల్లింది. ఆ తర్వాత దాన్ని తండ్రి కాళ్ళ దగ్గర పెట్టింది. "ఇది మీ అల్లుడుగారు మీకు సగౌరవంగా ఇచ్చారు నాన్నగారూ! తీసుకు వెళ్ళి మా మావయ్యగారికివ్వండి. లగ్నాలు పెట్టించండి!"

కూతురు చేస్తున్న పనిని అనిమిష నేత్రాలతో గమనిస్తున్నాడు ఆ తండ్రి. ఇప్పుడు ఆ అమ్మాయి చెబుతున్న మాట లను వింటున్నాడు.

పార్వతమ్మ గబగబా ఆ బ్రీఫ్‌ను అందు కుని మూత తెరిచింది. కళ్ళు జిగేలుమ న్నాయి. రెండు లక్షలు!

సీతారామయ్యకు ముందు సంతోషం కలిగింది. శివశంకరం ఎంత మంచివాడు అనిపించింది. ఆలోచించగా, ఆలోచించగా "అతను ఎంత సున్నితంగా తన అసమర్థ తను ఎత్తి చూపించాడు? " అనిపించింది.

"వద్దులే! అతనికిది తిరిగి ఇచ్చేసేయ్. నేనే ఎట్లాగో అట్లా, నా గడ్డి నేను తిని ఆ రెండు లక్షలూ సమకూరుస్తాను!"

పార్వతమ్మ అతని మాటలను ఒప్పుకో లేదు. "ఏం? ఇందులో తప్పేముంది? నా పిల్ల బంగారు బొమ్మ! చిదిమి దీపం పెట్టుకోవచ్చు. ఏం.. మొగవాడికే కట్నం ఇవ్వాలా? ఆడపిల్లకు తీసుకుంటే తప్పే ముందీ? మన అమ్మాయి నచ్చింది. దీన్నే కావాలనుకున్నాడు. మనకు కట్నం ఓ సమస్య అనుకున్నాడు. తను ఆదుకు న్నాడు. ఇందులో తప్పేముందీ? " అంటూ వాదించింది.

సుజాత ప్రశాంతంగా మాట్లాడింది. "నాన్నగారూ! మీరట్లా అనుకుంటారనే ఆయన ఇక్కడకు రాలేదు. ఆ డబ్బును మీకు స్వయంగా ఇవ్వలేదు. నాకు ఫోన్ చేసి, నా చేతికిచ్చి, నా ద్వారా మీ కందజే శారు. ఆయన మనకు డబ్బిచ్చిన సంగతి వాళ్ళ నాన్నగారికీ, అమ్మగారికీ తెలీదు. తను చెప్పనన్నాడు. మనల్ని కూడా చెప్ప వద్దన్నారు. మీరు ఇట్లా తీసుకోవడం ఇష్టం లేకపోతే, ఆనక కాలూ-చెయ్యీ కూడదీసుకున్న తర్వాత, ఆ డబ్బును తిరిగి ఇచ్చేయండి. తీసేసుకోమని నేనూ చెబు తాను" కాసేపాగింది. ఆ దేముడి గదిలో, ఆమె మాట్లాడడం ఆపేసింతర్వాత, నిశ్శబ్దం కొంతసేపు రాజ్యమేలింది. ఆ వృద్ధ దంపతులు రాములవారి వేపూ, సీత మ్మవేపూ చూస్తున్నారు. వాళ్ళలో రకర కాల ఆలోచనలు.

పటంలో ఉన్న సీతమ్మతల్లి అంటోంది. "ఏమయ్యా- సీతారామయ్యా- నా పేరూ మా ఆయన పేరూ కలిపి పెట్టుకున్నావు కదా- ఈ మాత్రం తెలీదా? మా అత్తగారి ఆజ్ఞ తీసుకునే నన్ను మా ఆయన అడవు లకు తీసుకువెళ్లాడా? ఆయనతో ఉన్నంత కాలం నన్ను అపురూపంగా చూసుకో లేదూ? ఒక రహస్యం చెప్పనా? ఆ అడవి దారుల వెంట నడుస్తున్నప్పుడు, రాముల వారు ముందు నడచి, ఆ దార్లో ముళ్లూ- గట్రా లేవని తెలిసింతర్వాత నన్ను ముందుకు నడవమనేవారు. ఒక్కొక్కసారి,



లక్ష్మణస్వామిని అటువేపుగా తిరిగి నుంచోమని చెప్పి నన్ను ఎత్తుకుని కూడా ముందుకు తీసుకువెళ్ళేవారు. రాత్రిపూట నా కాళ్లు నొప్పులు పుట్టి, నేను బాధపడు తుంటే- ఎందుకులే- చెప్పుకుంటే నాకే సిగ్గుగా వుంటుంది- మీరు నా పిల్లలేగదా, చెబితే తప్పులేదు.. చెబుతున్నాను- ఆయన నా కాళ్లు పట్టేవారు. భర్త అన్న వాడు మొట్టమొదట చెయ్యవలసిన పని, తను మెచ్చిన స్త్రీని, తనే కావాలి అనుకున్న స్త్రీని ఆరునూరైనా, తన భార్యగా చేసుకు తీరాలి. ఆ తర్వాత ఆ భార్య కోసం ఇహాన్నీ పరాన్నీ కూడా మర్చిపోవాలి!"

సీతమ్మ తల్లి నిజంగా అట్లా మాట్లా డిందా? లేక అదంతా తన భ్రమేనా?! భ్రమ అయితే మాత్రం ఏం? అందులో నిజం ఉంది కదా! అట్లా అనుకుంటే శివ శంకరం తన కూతుర్ని చుశాడు.. ప్రేమిం చాడు.. కావాలనుకున్నాడు గనుక కట్నం ఇవ్వడానికి సిద్ధపడ్డాడు.

మళ్లీ సుజాత మాటలు వినవచ్చాయి. "ఎందుకండి నాన్నగారూ, అంత దీర్ఘంగా ఆలోచిస్తారు? ఆయన నాకు నచ్చారు. మనసులో ఆయన నా భర్త అన్న నిర్ణ యానికి వచ్చాను. అంతవరకూ తప్పులేదు కదా? నా ఊహల్ని, ఆశల్ని, కోరికల్ని, ఆలోచనల్ని, నిర్ణయాలను అన్నీ ఆయనకు తెలియజేశాను. అందుకు ఈవిధంగా చేస్తు న్నారాయన. తండ్రిగా మీ మాటకు నేను ఒప్పుకుంటే, నేను మనస్సాక్షికి అపచారం చేసినదాన్ని కానా? మీరు చెప్పినట్లు చేయ కపోతే, ఆయన ఈ సాయం చేయకపోతే, నాకీ జన్మలో పెళ్లి అవుతుందా? మీరు రెండు లక్షలూ ఏరోజైనా కట్టగలిగేవారా? "

సీతారామయ్య దీర్ఘంగా శ్వాసించాడు. "పార్వతీ! ఈ బ్రీఫ్‌ను తీసుకువెళ్ళి బీరు వాలో పెట్టు. రేపొద్దున్న మనిద్దరం వియ్యాలవారింటికి వెళ్తున్నాం. రెడీగా ఉండు!" అన్నాడు.

సుజాత మొహం ఆనందంతో వెలిగిపో యింది.




"శుక్రవారం వస్తున్నాం. వివరాలు ముఖాముఖీ" కబురందుకున్న కుటుంబ రావు, ఒకపక్క సంతోషపడుతూనే, ప్రకా శంగా భార్యతో మేళమాడాడు, "ఏవీ టోయ్, ఉరుము లేకుండా ఈ పిడుగు? "

కామేశ్వరమ్మకూ సంతోషంగానే ఉంది. "మన సంబంధాన్ని వాళ్లు వొదులుకుంటా ర్టండీ? శివశంకరంలాంటి అల్లుడు వాళ్లకు పుటం పెట్టినా దొరుకుతాడా? "

"అవున్లేవోయ్! నీ కొడుకు నీకు బంగారం!"

"బంగారం కాబట్టేగా, రెండు లక్షలూ పుచ్చుకుని వాళ్లు బయల్దేరి రావడం? "

"రెండు లక్షలూ తెస్తున్నారా? లేకపోతే బేరసారాలకా? "

"పైస తగ్గినా వొప్పుకొనేది లేదని అప్పుడే చెప్పాంగా! ఇంకా బేరసారాలే విటీ? డబ్బెట్టుకునే వస్తుంటారు, మీరేం అనుమానాలు పెట్టుకోకండి"

అయినా అనుమానం తీరక, కొడుకుతో కూడా కుటుంబరావు ఆ సంగతి ప్రస్తావిం చాడు. "ఏమో డాడీ! నాకేం తెలుసు? మీకు ఇష్టం ఏదైతే అది చెయ్యండి, నన్ను మాత్రం ఇందులోకి దింపకండి!" శివశం

కరం గుంభనంగా అన్నాడు.

వియ్యాలవారొస్తున్నారని ఇల్లంతా శుభ్రంగా తీర్చిదిద్ది కామేశ్వరమ్మ మామిడాకులు గుమ్మాలకు కట్టించింది. కిటికీలకు, గుమ్మాలకు కర్టెన్లు మార్పించింది. టీపాయ్ మీద వెండిపళ్లెంలో పూలూ-పళ్లూ సర్దించింది. గది మూలల్లో ధూపం వేయించింది. తాను గద్వాలచీర కట్టుకుని, కుటుంబరావుచేత పొందూరు ఖద్దరు కట్టించింది.

"ఒరే అబ్బాయీ! టక్ చేసుకోరా, ఠీవిగా ఉంటావు" అంటూ కొడుకును ప్రోత్సహించింది. సీతారామయ్య దంపతులు రాగానే, స్వాగతం పలికి, కొబ్బరి బొండాలు కొట్టించి, ఆ నీళ్లు వెండి గ్లాసుల్లో ఇచ్చారు, ఘనసత్కారాలు జరిపించారు.

సీతారామయ్య వస్తుండగానే, శివశంకరం ఆయనకు సైగ చేశాడు. "ప్లీజ్-నా ప్రస్తావన తీసుకురాకండి. వ్యవహారమంతా మా నాన్నగారితోనే జరిపించండి!"

సాదాసీదాగా కొంతసేపు మాట్లాడింతర్వాత సీతారామయ్య అసలు విషయంలోకి వచ్చాడు. "బావగారూ! మీ మాటను కాదనలేక, స్తోమత లేకపోయినా, ఓ పుణ్యాత్ముడు పూనుకొనడంతో, డబ్బు జమ చేసుకుని, ఇదిగో రెండు లక్షలూ తెచ్చాను. తీసుకోండి!" బ్రీఫ్‌కేసు అందించాడు.

"సరే! మిగిలిన లాంఛనాలూ వగైరాలు..." కామేశ్వరమ్మ అందుకుంది.

పార్వతమ్మ ప్రాధేయపూర్వకంగా అంది, "వదినగారు మీరు పెద్ద మనసు చేసుకోవాలి. దీనికే మేం అతలాకుతలం అయ్యాం! ఇంక చిన్నమెత్తు బరువు కూడా మొయ్యలేం!"

కుటుంబరావు కొడుకువేపు చూశాడు. శివశంకరం కాసేపు మౌనంగా ఉండిపోయి, తండ్రి ఒకటికి రెండుసార్లు అడగ్గా చివరగా అన్నాడు, "అడిగిన కట్నం ఇచ్చేశారుగా మావయ్యగారు!"

ఆ మాట విన్న కామేశ్వరమ్మ మనసులో అనుకుంది, 'అప్పుడే ఆలివైపు వాళ్లు అంత దగ్గరివారయ్యారా- వాళ్ళవేపు మాట్లాడుతున్నావ్? '

అయితే ఆమె తన అభిప్రాయాన్ని బయటకు వెల్లడించలేదు. పార్వతమ్మ మెప్పుదలగా తల ఆడించింది.

"అల్లుడుగారు మా కష్టాన్ని అర్థం చేసుకున్నారు!"

"అది కాదులే వదినగారూ, మా వాడికి మీ అమ్మాయి అంత ఇదిగా నచ్చింది. వీలైతే, మా వాణ్ని సంతోషపెట్టడానికైనా, నేను కానీ కట్నం తీసుకోకుండా మీ అమ్మాయిని నా కోడలుగా తెచ్చుకునేదాన్నే! కానీ చెప్పాం కదా, కట్నం అవసరమైంది. అంతే!"

ఆ విధంగా కథ సుఖాంతమై, లోగుట్టు బయటపడకుండా, శివశంకరం- సుజాతల పెళ్లి ఘనంగా జరిగిపోయింది. సుజాత కాపురానికి వచ్చింది.

★ ★ ★

చాలా కథలు 'శుభం' కార్డుతో కంచికి చేరుతాయి. కానీ ఈ కథలో కల్యాణంతోనే అసలు కథ ప్రారంభమైంది.

ఆలోచనల్లోకి జారిపోయి, గతాన్ని నెమరు వేసుకుంటున్న సుజాత పాలుపోసేవాడి కేకతో ఈ లోకంలోకి వచ్చింది. పాలు పోయించుకుని నెస్‌కాఫీ పెట్టుకుని తాగుతున్న సుజాతకు తన ఆడబిడ్డ కిరణ్మయి జ్ఞాపకానికి వచ్చింది. కిరణ్మయి జ్ఞాపకంతో మళ్లీ గతంలోకి వెళ్ళిపోయింది.

★ ★ ★

పెళ్ళి చూపులకు, తాంబూలాలకు రాని కిరణ్మయి, పెళ్ళి ఇంకా రెండురోజులుండనగా పాలు తాగుతున్న పసిబిడ్డను తీసుకుని పుట్టింటికి వచ్చింది.

కూతురును చూడగానే కామేశ్వరమ్మకు కంట నీరు ఉబికింది. "ఇదేమిటే ఇట్లా చిక్కిశల్యమై పోయావూ? " అడిగింది బాధగా.

కుటుంబరావు కూడా బాధపడుతూ, కూతురును అడిగాడు, "చూడమ్మా- నీ మొహంలో ఇదివరకటి కళాకాంతీ లేవు. ఏదో నిన్ను కలత పెడుతోందని నాకనిపిస్తోంది. కన్నవాళ్ళతో కాకపోతే ఇంకెవరితో చెప్పుకుంటావు తల్లీ. అసలు సంగతి చెప్పు. నిన్ను సంతోషపెట్టడానికి నా ప్రయత్నం నేను చేస్తాను!"

"ఇప్పుడెందుకులే నాన్నా ఆ సంగతులన్నీ? " అంటూ కిరణ్మయి అవతలకు వెళ్ళిపోయింది.

శివశంకరం అడిగాడు, "అక్కా! నువ్వు వచ్చావు. సంతోషం. బావగారు ఎప్పుడొస్తున్నారూ? "

కిరణ్మయి తమ్ముడివేపు జాలిగా చూసింది. "చెప్పలేన్రా! వస్తే రావచ్చు లేకపోతే రాకనూ పోవచ్చు!"

"అదేమిటే? "

"అదంతేలే! వివరాలు తర్వాత!"

అట్లా అన్న కిరణ్మయి, మామూలుగా అయినట్లుగా నటిస్తూ పెళ్ళి పనుల్లో చురుగ్గా పాల్గొంది. తమ్ముణ్ని పెళ్ళి కొడుకును చేసి, బుగ్గన చుక్క పెట్టడం దగ్గర్నుంచి అతని కాళ్ళకు పారాణి దిద్దేవరకూ నవ్వుతూ తనవంతు పనులు చేసింది.

'పిల్ల మళ్ళీ మాములు మనిషైంది!' అని సంతృప్తిపడ్డ కామేశ్వరమ్మ అన్ని బాధ్యతల్నీ కూతురుకే అప్పగించింది. సీతారామయ్య అందించిన బ్రీఫ్‌కేసును కూడా అందిస్తూ "జాగ్రత్తమ్మా! పెళ్ళి పనుల్లో దీన్ని ఎక్కడ పెట్టి మర్చిపోతానో, అని నీ కప్పగిస్తున్నాను" అంది.

"ఏవిటమ్మా ఇది? "

"కట్నం సొమ్మే! రెండు లక్షలు!"

ఆ మాట విన్న కిరణ్మయి కళ్ళు మెరిశాయి. సుజాతను చూసిన తర్వాత ఆ కళ్ళల్లో మెరుపు ఇంకా ఎక్కువైంది.

తమ్ముడితో పరాచికాలాడింది. "లక్కీ ఛాన్స్ కొట్టేశావురా తమ్ముడూ! మరదలు బంగారం. కట్నం సింగారం"

సుజాతతో హాస్యంగా అంది. "కాబోయే మరదలు పిల్లా! ఆడపడుచు అంటే అర్ధ మొగుడు. అంచేత నీ మొగుడికి నువ్వు తెచ్చిన కట్నంలో సగం వాటా నాదే!"

సుజాత కూడా తక్కువ తినలేదు.

"సగం వాటా ఎందుకు? పూర్తి వాటాయే తీసుకోండి. మీ తమ్ముడుగార్నడిగితే ఆ రెండు లక్షలూ ఇవ్వనంటారా? అదేం అంత గొప్పా? "

> ## కొత్తగాలి...
>
> **నీవు హలం పడితే**
> **వ్యవసాయం**
> **నేను కలం పడితే**
> **వ్యవస్థకే సాయం**
>
> – శిల్ప.. స్వాతి,
> మీర్‌పేట, రంగారెడ్డి జిల్లా

సుజాత బుగ్గలు పుణికింది కిరణ్మయి. "తెలివిగలదానివే! విన్నానులే నీ సంగతి. పెళ్ళికి ముందే నా తమ్ముణ్ని నీ కొంగున కట్టేసుకున్నావట కదా! జాగ్రత్తమ్మా వాడుత్త అమాయకుడు!"

"వదినగారూ, ఈ కాలంలో ఎవ్వరూ అమాయకులు కారు. అట్లా అనుకుంటాం. అంతే! నిజానికి మీరమాయకులా చెప్పండి. ఇస్తే మీరు నిజంగా తీసుకోరూ, వద్దంటారా? "

కిరణ్మయి పేలవంగా నవ్వింది.

"వస్తా!" అంటూ అవతలకు వెళ్ళిపో

యింది. పెళ్ళయి మూడు నిద్రలకు శివ శంకరం, సుజాత, సీతరామయ్య గారింటికి బయల్దేరబోతున్నారు.

"తమ్ముడితో బాటు నువ్వెళ్ళవ్!" అంది కామేశ్వరమ్మ కూతురితో.

"వెళ్ళొస్తా, మరి నాకేమిస్తావ్? "

"పెళ్ళికొచ్చిన ఆడపిల్లను ఊరికే పంపిస్తామటే? మా తాహతుకు తగ్గట్టు మేమిస్తాంలే! పైగా అల్లుడితో పాటు నువ్వక్కడకు వచ్చావని వియ్యాలవారూ నీకు తగిన మర్యాదలే జరిపిస్తారు!"

తల్లిని అవతలకు తీసుకువెళ్ళింది కిరణ్మయి. "ఈ మర్యాదలన్నీ నాకు వద్దు కానీ, నా కాపురం నిలబెట్టు! అది చాలు"

**కొత్తగాలి...** 

**రాజకీయుని వాగ్దానం**
**ఓ మనీప్లాంట్!**
**ఓ నేతిబీరకాయ!!**

– చక్కా చెన్న కేశవరావు,
కావలి

అంది, అసలు సంగతి బయట పెడుతున్నట్లుగా..

కామేశ్వరమ్మ గుండెల్లో రాయి పడ్డట్లయింది. "ఏవిటే అసలు సంగతి!"

"మీ అల్లుడుగారు ఇల్లు కడతారట. ముందు స్థలం కొంటారట! ఓ రెండు లక్షలు తక్కువైంది. మిమ్మల్నడిగి తెమ్మన్నారు" ఆ మాట విన్న ఆవిడకు ఏమనటానికీ ఆ క్షణం తోచలేదు. అయిదు కాదు, పది కాదు, ఏకంగా రెండు లక్షలు! ఇస్తే ఇక అది తిరిగి రాదు. ఇవ్వకపోతే పరిణామాలు ఎట్లా ఉంటాయో? ఏమో? అని భయపడింది.

అవతల అప్పగింతలయిపోయాయి. దంపతి తాంబూలాలు కూడా ఇచ్చేశారు. బయట బయలుదేరడానికి కార్లు రెడీగా ఉన్నాయి. ఆలస్యానికి శివశంకరానికి చిరాగ్గా ఉంది.

"అక్కయ్యా! రావేమిటే? " అన్నాడు పెద్దగా.

"శంకరం! ఒకసారి ఇట్లా వచ్చిపో!" లోపల్నుంచి కామేశ్వరమ్మ కొడుకును కేకేసింది.

శివశంకరం అసహనంగా లోపలకు వెళ్ళాడు. "ఏవిటే? "

"మీ అక్కయ్యకు ఏదో కావాలట! ఇస్తేనే కానీ మూడు నిద్దర్లకు నీతో రాదట!"

"ఏవిటే అక్కయ్యా- చిన్నపిల్లలాగా! నువ్వు ఏం కోరితే మేం ఇవ్వం? అవతల అందరూ వెయిట్ చేస్తున్నారు. రావే! మా మావగారింటి నుండి తిరిగి రాగానే, నీకు కావలసింది తీసుకుందువుగానీ, సరేనా? "

"నిజంగా ఇస్తావా? "

"ఇస్తాను.. ఇస్తాను.. ఇస్తాను.."

"ఒట్టు..."

"ఎవరిమీద వెయ్యమంటావ్ ఒట్టు? అమ్మమీద వెయ్యనా.. నాన్నగారి మీద వెయ్యనా.. సుజాత మీద వెయ్యనా.. లేకపోతే నా మీద వేసుకోనా? "

"ఎవరిమీదా వద్దులే.. నీ మాట చాలు నాకు"

కిరణ్మయి తమ్ముడితో కలిసి సీతారామయ్యగారింటికి మనుగుడుపులకని వెళ్లింది. వాళ్ళు మూడు నిద్రలకు వెళ్లారే కాని-

ఇక్కడ కుటుంబరావుకూ, కామేశ్వరమ్మకూ నిద్ర పట్టడం మానేసింది. పులి మీద పుట్రగా కిరణ్మయి ఈ డిమాండ్ చేయడమేవిటి?

కట్నం సొమ్ము ఆడపిల్లకు ఇచ్చి పంపేస్తే, శివశంకర్ ఏమనుకుంటాడు?

పోనీ, అతన్ని సమాధానపర్చినా తన ఇంటిమీద ఉన్న తనఖా సంగతి ఏవిటి? కోడలు కాపురానికి వచ్చింతర్వాత, ఇంకా అప్పులూ, తనఖాలు, జీతం డబ్బులు చాల కపోవడాలూ అంటూ ఆర్థిక సమస్యలు తమను చుట్టుముట్టి బాధ పెడుతుంటే అదేం బావుంటుందీ! కొత్త కోడలు ఏమను కుంటుందీ? కట్నం తీసుకునే తాము చులకనైపోయాం, అది అన్యాక్రాంతం చేస్తే తాము ఇంకా ఇంకా ఆ అమ్మాయి దృష్టిలో చులకన కామూ?

ఈవిధంగా వీళ్ళు ఆలోచిస్తుంటే అక్కడ కిరణ్మయికి ముళ్ళమీద కూచున్నట్లుగా ఉంది.

ఆమె భర్త అప్పుడే ఒకసారి ఫోన్ చేశాడు. "హలో కిరణ్మయి ఉన్నావే? పెళ్ళి భోజనాలు చేస్తూ, వెళ్ళిన పని మర్చిపోయి నావా? ఆ స్థలానికి అప్పుడే చాలామంది ఎగబడుతున్నారు. నువ్వు ఒక్కరోజు ఆలస్యం చేసినా డబ్బుతో రాకపోయినా, జీవితంలో ఇహ మనం ఇల్లు కట్టుకోలేం. స్థలం ఉంటే బ్యాంక్ వాళ్ళు లోన్ ఇవ్వటా నికి సిద్ధంగా ఉన్నారు. నీదే ఆలస్యం! గుడ్ లక్- నీ కోసం వెయిట్ చేస్తున్నాను. కమ్ టుమారో విత్ మనీ!"

కిరణ్మయి ఇహ అక్కడ ఉండ లేకపోయింది. మొదటిరోజు రాత్రి కిరణ్మ యికి హాల్లో మంచం వేసి, పడుకోమంది పార్వతమ్మ. ఉన్న ఒక్క గదిని అలంక రించి శోభనానికి సిద్ధం చేసింది.

"అత్తయ్యగారూ! గదిలో పాలూ పళ్ళూ, స్వీట్లూ వగైరా మీరు చూసుకోండి. మా మరదలు పిల్లను నేను అలంకరిస్తాను" అంది కిరణ్మయి.

"నిజమేనమ్మా! ఆ పని నువ్వు చేస్తేనే బావుంటుంది" అంది ఆమోదంతో ఆహ్లా దంగా పార్వతమ్మ. తన భర్త సీతారామ య్యకు ఆరుబయట వేపచెట్టు కింద, నవారు మంచం వేసి, దుప్పటీ దిండూ

## చివరి నవల చతురకే!



**కీ.శే. కొండముది శ్రీరామచంద్రమూర్తి**

కీ.శే. కొండముది శ్రీరామచంద్రమూర్తి 1937 జులై 10న గుంటూరు జిల్లా, బాపట్ల మండలం, రేటూరు గ్రామంలో పుట్టారు. ఎం.ఎ., ఎం.ఫిల్ చేశారు. ఏలూరులోని సెయింట్ థెరీసా మహిళా కళాశాలలో ఆంగ్ల విభాగాధిపతిగా పని చేస్తూ 1991లో స్వచ్ఛంద పదవీ విర మణ పొందారు. సెప్టెంబరు 22, 2008న కీర్తిశేషులైన ఆయనకు ఒక కుమారుడు, కుమార్తె ఉన్నారు.

కొండముది శ్రీరామచంద్రమూర్తి 38 నవలలు, 10 నాటకాలు, 20 కథా సంక లనాలు వెలువరించారు. దాదాపు అన్ని ప్రధాన పత్రికల్లో ఆయన రచనలు ప్రచు రితమయ్యాయి. ఆకాశవాణి (విజయవా డ) నాటక పోటీల్లో ఆయన 'పద్మ వ్యూహా'నికీ బహుమతి వచ్చింది.

ఆయన నవల 'చిరుమువ్వల మరుసవ్వడి' జంధ్యాల దర్శకత్వంలో 'ఆనందభైరవి' సినిమాగా వచ్చింది. ఉత్తమ కథా రచయితగా ఆ సినిమాకు ఆ ఏడాది రాష్ట్ర ప్రభుత్వ నంది అవార్డు లభించింది. సుమారు 15 సినిమాలకు ఆయన కథలు అందించారు. కొండముది వారి చివరి నవల 'ఈషణత్రయం' ప్రచు రించే అవకాశం చతురకు లభించడం ఓ విశేషం. కొండముదివారి స్మృతికి అక్షరాంజలులర్పిస్తూ...



సర్ది, పక్కనే మరచెంబులో మంచినీళ్ళు పెట్టి "తెల్లారేదాకా మీరు లోపలకు రాకండి. ఇది ఆడవాళ్ళ వ్యవహారం. మీరు కల్పించుకుంటే బావుండదు!" అంటూ ముసిముసిగా బయటకు నెట్టి తలుపులు వేసింది. తను దొడ్లో మడత మంచం వేసుకుంది.

బయటపడుకున్న సీతారామయ్యకు విచిత్రమైన ఆలోచనలు కలుగుతున్నాయి. కవి సమ్రాట్ విశ్వనాథ, "చేసిన సంసారమే చేయుచుండు" అన్నాడు! ఈ బతుకు చక్రం అంటే అంతేకదా? మన తాతలు పుట్టారు. పెరిగారు. ఉపాధి కోసం ఏవో పనులు చేశారు. పెళ్ళిళ్లు చేసుకున్నారు. పిల్లల్ని కన్నారు. తర్వాత కన్ను మూశారు. మన తండ్రులూ అంతే! పుట్టడం, పెరగడం, కడుపు కోసం ఏవేవో పనులు చేయడం, మళ్లీ పెళ్ళీ పిల్లలూ, వాళ్ళ పెంపకం, చదువులూ, తర్వాత తాము ఈ దేహయాత్ర చాలించడం... మనమూ అంతే! మన పిల్లలూ అంతే. వాళ్ళ పిల్లలు, వాళ్ళ పిల్లలు, వాళ్ళ పిల్లలు అందరూ అంతే! ప్రపంచం పుట్టిన తదాది పిల్లల్ని కనడం, వాళ్ళను పెంచడం, అందుకు నానా బాధలు పడడం, ఈ కార్యక్రమంలో ఆడా- మగా, వారి మధ్య ఆకర్షణా! దీనికి ఏమన్నా అర్థం ఉందా? తనూ, పార్వతమ్మ కూడా కొన్ని దశాబ్దాల క్రితం ఇట్లాగే ఓ గదిలో, మనసుల్ని పంచుకుని... శరీరాల్ని పంచుకుని... సీతారామయ్య గతకాలపు అనుభవాల కౌగిళ్ళలోకి తెలియకుండానే వెళ్ళిపోయాడు. ప్రకృతాన్ని మర్చిపోయాడు.

శోభనం గదిలో అన్నీ అమర్చి, పార్వతమ్మ దొడ్లోకి వెళ్ళి తన మంచంమీద పడుకుంది. గతంలో అంటే, శోభనం పెళ్ళికూతురు దగ్గర అమ్మలూ, అమ్మమ్మలూ, అమ్మలక్కలూ ఉండి, మేలమాడి, భయం పోగొట్టి, అమ్మాయిని తయారుచేసేవారు. ఇప్పుడా అవసరం ఏముందీ? తమకన్నా, తమ పిల్లలకే సృష్టి రహస్యాలు తెలుసు. అయినా సుజాత ఎంత తెలివికలది! తన భర్తను తనే ఎన్నుకుంది. ఆ భర్త చేతనే కట్నం కట్టించింది. మూడు రోజులు, మూడు రాత్రులు ఒక మధుర స్వప్నంగా తన కూతురు గడుపుతుంది. తన కడుపు పండించుకుంటుంది. ఎంతమంది పిల్లల్ని కనాలో నిర్ధారించుకుంటుంది. సుజాతను మెచ్చుకుంటూ, మెల్లగా పార్వతమ్మ భూతకాలంలోకి వెళ్ళిపోయింది.

లోపల శోభనం గదిలో కిరణ్మయి, సుజాతకు జడకుట్టి, సంపంగి పువ్వులతో తీర్చి దిద్దింది. జడ కడుతూ, "మరదలు పిల్లా! చెబుతున్నానని అనుకోకు. నా తమ్ముణ్ని హాస్యానికైనా నేను కొట్టి ఎరగను. ఇంత పెద్ద జడతో వాణ్ని దండించకు సుమా!" సుజాత, తన వదిన తనకు కట్టిన సంపంగి జడను చూసి మురిసిపోతూ, పెదిమలకు ఎర్రరంగు లిప్‌స్టిక్ పెట్టుకోబోయింది. వారించింది కిరణ్మయి.

"వద్దు.. వద్దు.. భార్య పెట్టుకున్న లిప్‌స్టిక్ ఆ మగవాడిని ఎంత ఇబ్బంది కల్గిస్తుందో నీకు తెలీదులే! అంతకన్నా తాంబూలం వేసుకోవడం ఎంత మంచిదో! నోరు పండుతుంది. ఎర్రని పెదవుల వెనుక తెల్లదానిమ్మల వంటి మెరిసే పళ్ళు.. ఆ తమలపాకు ఆకుల్లో పచ్చ కర్పూరం, ఓ రెండు యాలకులు, లవంగాలు పెట్టి వేసుకుంటే నోరంతా పరిమళిస్తూ, ముద్దు పెట్టుకున్నప్పుడల్లా, మళ్ళీ మళ్లీ పెట్టుకోవాలన్న కోరిక చవులూరుతుంటుంది" అంటూ సుజాత చెంపమీద సుతారంగా ఓ చిన్న దెబ్బ కొట్టింది. అంతటితో ఊరుకోలేదు. జాజికాయ, జాపత్రి, లవంగాలు, యాలకులు, కొద్దిగా స్వీటు వేసి, తగినంత మోతాదులో సున్నం రాసి,

నిన్నటి నిజం

# అప్పుకోసం పుణ్యం తాకట్టు!

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ బంధువు ఒకాయన ఉత్తరదేశ తీర్థయాత్రలకు వెళ్ళారు. అనేక పుణ్యక్షేత్రాలు సందర్శించి తిరుగు ప్రయాణంలో మధురకు వచ్చారు. అప్పటికి ఆయన తెచ్చుకున్న డబ్బంతా ఖర్చయింది. మధుర నుంచి ఊరు చేరడానికి చాలినంత డబ్బు లేకపోయింది. దాంతో మధురలో ఓ తాకట్టు వ్యాపారి నుంచి అప్పు తీసుకోవాలనుకున్నారు. పేరు గాంచిన తాకట్టు వ్యాపారిని కలిసి తన తీర్థయాత్ర వివరాలు, డబ్బు అవసరం చెప్పారు. తనకు అప్పిస్తే, ఇంటికి చేరిన వెంటనే పంపిస్తానన్నారు. తాకట్టు పెట్టేందుకు తనవద్ద ఏమీలేవనీ, అందువల్ల తను తీర్థయాత్రలో గడించిన పుణ్యాన్ని తాకట్టు పెడతానని విన్నవించారు.



ఆ తాకట్టు వ్యాపారికి పుణ్యం ఆధారంగా అప్పు ఇవ్వడం అంగీకారమైంది. తగిన తాకట్టు పత్రం రాయించుకొని డబ్బు ఇచ్చాడు.

అతడు స్వగ్రామం చేరుకుని ఆ వర్తకునికి అసలును, వడ్డీతో సహా పంపించారు. కానీ డబ్బు తీసుకెళ్ళిన మనిషితో వర్తకుడు లేఖ పంపాడు. అందులో 'మీరు తాకట్టుపెట్టిన పుణ్యమే కావాలి, నేనిచ్చిన డబ్బు కాదు. అందుకే డబ్బును పంపుతున్నాను' అని ఉంది.

ఆయన కోపగించుకుని, మధ్యవర్తితో మళ్లీ లేఖ పంపారు. "ఒప్పందం ప్రకారం డబ్బు పంపగానే తాకట్టు పెట్టిన నా పుణ్యాన్ని నాకు దఖలు చేయాలి. దానిని మీ సొంతం చేసుకొనేందుకు ఆస్కారం లేదు" అని రాశారు.

చేసేదిలేక వ్యాపారి డబ్బు తీసుకుని తాకట్టు పత్రంపై చెల్లు రాసి, పంపాడు.

రెండు చిలకలు చుట్టి, ఆ రెండింటినీ సుజాతకే ఇచ్చి "జాగర్తగా విను. ఒకటి నీకూ, ఒకటి మా తమ్ముడికీనూ! నువ్వే వాడి నోటికందించాలి సుమా!" సుజాత బొమ్మలా తలాడించింది.

"ఆ తర్వాత నీకే తెలుస్తుందిలే- ఏమేం చెయ్యాలో, ఆ తాంబూలాన్ని ఎట్లా పంచుకోవాలో!" అంటూ నవ్వింది అర్థవంతంగా.

రాత్రి తొమ్మిది దాటుతోంది. రాత్రి భోజనాల దగ్గర, "అత్తయ్యగారు గదిలో మినపసున్ని ఉండలు ఉంచారు. అవి పుచ్చుకోండి. అన్నం ఎక్కువగా తినకండి" అంటూ సలహా ఇచ్చింది.

తొమ్మిదిన్నరకు సుజాతకు, కిరణ్మయి ఎక్కడెక్కడ సెంటు రాసుకోవాలో అక్కడల్లా సెంటు రాసింది. కట్టుకున్న కొత్త చీరమీద క్లాత్‌స్ప్రే చల్లింది. చల్లుతూ అంది "ఇది అనవసరం అనుకో! ఇంతకీ వంటిమీద చీర నిలుస్తుందా ఈ రాత్రి? అయినా పాలగ్లాసుతో దగ్గర చేరినప్పుడు, నీకన్నా ముందే నీ పరిమళం వాణ్ని మత్తెక్కించాలి కదా? "

సుజాతను కాసేపు ఒకచోట కూర్చోబెట్టి, గదిలో ఆగరు ధూపం నింపింది. టేబిలు మీద రాధాకృష్ణుల శిల్పాన్ని ఉంచింది. అందులో కృష్ణయ్య వ్యత్యస్త పాదారవిందంగా నిలబడి ఉన్నాడు. వంశీమోహనుడు పంచమస్వరంలో మురళి వాయిస్తున్నాడు. అతనికి దగ్గరగా ఉన్న రాధ, అతని మెడచుట్టూ తన తెల్లని మెత్తని చేతుల్ని వేసింది. తన చెంపల్ని అతని చెంపలకు ఆనించింది. అరమోడ్పు కన్ను



లతో, ముంగాళ్ళపై నిలబడి యుగయుగాల శృంగారతత్వానికి ప్రతీకగా కనిపిస్తోంది. ఆ గదిలో ఒక మూల పెద్ద సైజుది ఒక టేప్ రికార్డరు ఉంది. అక్కడ ఉన్న క్యాసెట్లు చూసి, క్షేత్రయ్య గీతాలున్న ఓ క్యాసెట్టును ప్లే చెయ్యటానికి రెడీగా ఉంచింది.

"చూడూ, ఇందులో ప్రతి పదమూ రసభరితం. ఆ పదంలో వినిపించే నాయికవు నువ్వే కావాలి. మా తమ్ముడు, ఆ శ్రీకృష్ణుడే అయిపోవాలి. ముఖ్యంగా ఆ క్యాసెట్లలో,

'పట్టకురా రొమ్ము
పచ్చి వొంటి దానినిరా
పాలంటును చేతులకు!'

అనే పదం వుంది. ఆ పదంతో మా వాడికి పిచ్చెక్కించాలి. ఎప్పుడు ఆ



క్యాసెట్టు ప్లే చెయ్యాలో నేను చెప్పనక్కర లేదుగా?" ఆ మాటలంటున్నప్పుడు కిరణ్మయి ఓ శృంగార రసవార్నిధిగా కనిపించింది. ఆ వాత్స్యాయనుడే స్త్రీమూర్తిగా అవతరించాడేమో అనిపించింది. కిరణ్మయిలో కొంటెతనం ఉందికానీ, కాముకత్వం లేదు. రసరాగం కనిపించిందికానీ, చపలత్వం లేదు. బోధ గురువుగా ఉంది కానీ, బాధ గురువుగా కనిపించలేదు.

ఆ విధంగా మరదలుకు బోధ చేసి, రెండు పుస్తకాలు బహూకరించింది కిరణ్మయి. "చూడు, ఇందులో ఒకటి కామసూత్ర. వాత్స్యాయనుడు అనే మహర్షి రాశాడు. ఇది నీకు! కామం దోషం కాదు. సాంసారిక కామం లోకహితం కోసం. రెండో పుస్తకం 'రాధికా సాంత్వనం'. ముద్దు పళని అనే ఓ గొప్ప కవయిత్రి కొన్ని శతాబ్దాల క్రితం రాసింది. రాధాకృష్ణుల శృంగార ప్రకటనకు పరాకాష్ట. ఈ రెండు పుస్తకాల్ని ఈ వయసులో మీరు భగవద్గీతకన్నా భవ్యంగా ఆరాధించాలి. గుడ్‌లక్!"

తను పడుకోవాల్సిన స్థలం దగ్గరకు వచ్చి, మంచం మీద పడుకుని నిష్కళంకమైన మనస్సుతో, తన కర్తవ్యం తాను చేశానన్న సంతృప్తితో హాయిగా నిద్రపోయింది కిరణ్మయి.

ఆమె చెప్పినట్లుగా సుజాత ఆ రాత్రిని, మరువలేని మహదానంత స్వర్గసీమగా మలుచుకుంది. ఆమె శరీరం సప్తస్వరాల వీణగా స్పందించింది, నినదించింది. వారి మోహన క్రీడలో శివపార్వతుల నాట్యమే లలితమై వారిని సంతృప్తి పరచిందా? శ్రీకృష్ణుని రాసక్రీడా రమణీయత్వమే వారికి అనుభవైకవేద్యమైందా? వారి కళ్ళల్లో ఒక కొత్త విద్యుత్తు ప్రవహించింది. వారి చెవులకు ఎప్పుడూ వినని ఒక కొత్తగీతం వినిపించింది. వారి జిహ్వాలు కొత్త రుచులకు కేంద్ర స్థానాలయ్యాయి. ఆ ఇద్దరి దగ్గరా కాలగమనం ఆగిపోయింది.

మర్నాటి ఉదయం సిగ్గుపడుతూ తన దగ్గరకు వచ్చిన సుజాతను, నుదుటి మీద ముద్దు పెట్టుకుని, ఆమె ఒడలెల్లా పరికించి చూసి "ఇహ నీ కాపురానికి ఏం ఢోకా లేదు. నీ జీవితం ఓ వడ్డించిన విస్తరి అవుతుంది. ఇది నా ఆశీర్వాదం నీకు!"

అంది కిరణ్మయి.

పార్వతమ్మ తన కూతురికి మరోసారి తలంటు పోసింది. శ్రీ రాజరాజేశ్వరికి నమస్కారం చేయించింది.

సీతారామయ్య అల్లుడికి ఉంగరం పెట్టాడు. "నిన్ననే పెట్టాల్సింది అల్లుడు గారూ! కానీ ఆ కంసాలి సమయానికి ఇవ్వలేదు- అందుకని ఆలస్యమైంది. ఏమ నుకోకండి!" అన్నాడు.

"చూడండి మావయ్యగారూ! పెళ్ళయ్యే టంత వరకే మీ కుటుంబం మా కుటుం బం వేరు వేరు అనుకోవడం! ఎప్పుడైతే మీ అమ్మాయిని నాకిచ్చేశారో, మే మిద్దరం ఒక టయ్యామో, ఇటుపైన మీరూ మేమూ రెండు కుటుంబాల వాళ్ళం కాదు, మనం ఒకే కుటుంబం వాళ్ళం. మన బాధలు, ఆశలు, సమస్యలు, అన్నీ ఒకటే!"

ఆ మాటకు సీతారామయ్య, పార్వతమ్మ ఎంతో మురిసిపోయారు.

"సుజాతా! మీ ఆయన మనిషి కాదే, దేముడు!" అన్నారు ముక్తకంఠంతో.

మర్నాటి ఉదయం శివశంకరం కించిత్ అలసటతో, కొంత ఆలస్యంగా నిద్రలే చాడు. అతనికి ప్రపంచమంతా కొత్తగా కనిపిస్తోంది. మనసు అనుభవిస్తున్న ఆనందంచేత, జగత్తులో సర్వులూ సంతో షసమన్వితులైన ఆనందమూర్తులుగా కని పిస్తున్నారు.

కిరణ్మయి తమ్ముణ్ని చూసి తల్లిలాగా నవ్వింది, "ఒరేయ్ దేముడూ!" అంటూ పాతికేళ్ల ఆ యువకుడి జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి అటూ యిటూ సర్దుతూ,

"ఏరా, కళ్లేమిట్రా, అంత ఎర్రగా ఉన్నాయి?" అడిగింది, అల్లరిచేసే అక్క య్యగా మారిపోయి.

"పోవే!" అవతలకు పోబోయాడు శివ శంకరం.

"పోతున్నానురా! మధ్యాహ్నం భోజ నాలు కాగానే, బయల్దేరుతున్నాను" అంది.

"అదేమిటే? మూడు రోజులూ ఉండవా?"

"ఒరేయ్ బుద్ధూ, వచ్చాను.. నువ్వూ సుజాతా జీవితాన్ని ప్రారంభించడం చూశాను. చాలు, ఇహ ఇక్కడ ఉండవల సిన అవసరం లేదు. అవతల నాకూ సంసార బాధ్యతలు ఉన్నాయి కదా. అప్పుడే మీ బావగారు ఓసారి ఫోన్ కూడా చేసేశారు. వెళ్ళకపోతే ఆయనగారికి కోపం వస్తుంది!"

"అవున్లే! ఆయనకే కోపం వస్తుంది, మాకు రాదు. ఒక్కగానొక్క అక్కయ్య నాకు! ఆయనగారు రాకపోతే నాకు కోపం రాదేమిటే?"

"ఆ కోపం పోగెట్టే పనిచెయ్- ఆయన గారే నీ దగ్గరకు వచ్చి సారీ అంటారు"

"అసలు కోపం ఎందుకే?"

"ఇల్లు కట్టాలని మహా తపనపడి పోతు న్నార్రా! మంచి స్థలం దొరికింది. మనీయే లేదు. కొంత తక్కువపడింది. నాన్నగారి నడిగి తీసుకురమ్మన్నారు. అమ్మకు ఫోను చేశాను. 'మా దగ్గరిక్కడేముందే! అయినా ముందు ఇంట్లో శుభకార్యం పెట్టుకుని, డబ్బెట్లా సర్దుబాటు చేస్తామే?' అందామె. ఇప్పుడేం చేయాలో అర్థం కావటంలేదు"

ఏడుపులంకించుకున్న బిడ్డకు, పమిట

## కొత్తగాలి...

**నెంబరు వన్‌గానే**
**త్వరలో మనం**
**జనాభాలో మాత్రం**

*- గంపా శ్రీదేవి,*
*సింహాచలం*

చెంగు చాటున పాలిస్తూ, "ఏరా, ఏం చేద్దాం అంటావు? "

"నేను ఫోను చేస్తాను కానీ, నాన్నగార్ని డిగి తీసుకువెళ్లు" శివశంకరం, హుందాగా అన్నాడు.

"అట్లా ఉండాల్రా తమ్ముడంటే!" మనః పూర్వకంగా తమ్ముణ్ణి మెచ్చుకుంది కిర ణ్మయి.

ఆవిడకు వెళ్లేటప్పుడు ఘనంగా సత్కారం చేసింది పార్వతమ్మ.

"అమ్మాయ్! మీ ఆడబిడ్డకు నమస్కారం చెయ్! రాత్రి గదంతా ఎంచక్కా అలంకరిం చింది కిరణ్మయి. తోడపుట్టినవాళ్ళు కూడా ఈ రోజుల్లో అంతగా పట్టించుకోరు!" ఆ పెద్దావిడ కంఠం ఆర్ద్రంగా ధ్వనించింది.

"తోడబుట్టినదాన్నే కదండీ! సుజాతకైతే ఏమి, శంకరానికైతే ఏమి? " అంటుండ గానే, సుజాత వంగి తన ఆడబిడ్డ కాళ్ళకు నమస్కరించింది.

ఆమె భుజాలను పట్టి లేవనెత్తి దగ్గరకు తీసుకుని, "తోటి ఆడదానికే అసూయ పుట్టించేటంత అందం నీది. ఇంత అంద మైన ఆడపిల్లను కనాలి సుమా! ఆ పిల్ల నాకు కోడలు కావాలి. తెలిసిందా? " అంది. ఆ మాటతో నవ్వులు విరిశాయి.

శివశంకరం బస్సుస్టేషనుదాకా వెళ్ళి కిర ణ్మయిని సాగనంపి వచ్చాడు. బస్సులో కూర్చున్న తర్వాత, లోపల్నుండే తమ్ముణ్ణి మరోసారి హెచ్చరించింది కిరణ్మయి. "ఒరేయ్, నాన్నగారికి ఫోన్ చెయ్యడం మర్చిపోకు"

శివశంకరం మేనల్లుడి చేతిలో ఓ అయి దువందల రూపాయలనోటు పెట్టాడు. అంత చిన్నవయసులోనే, ఆ పసిబిడ్డ దాన్ని గట్టిగా గుప్పిట్లో పట్టుకున్నాడు.

"చూశావా అక్కయ్యా, నీ కొడుక్కి డబ్బు మీద ఎంత ప్రేమో! వెధవకు అన్నీ వాళ్ల నాన్న పోలికలే వచ్చినట్టున్నాయి!"

"బావమరిదివి కదా, అట్లా అనడంలో తప్పులేదు. కానీ ఫోను విషయం మాత్రం మరువకు సుమా!" మళ్లీ హెచ్చరించింది కిరణ్మయి.

"మహాతల్లీ! అప్పుడే అంత చాదస్తం వచ్చిందేమే! నన్ను సతాయించకు. నువ్వు ఇల్లు చేరేసరికే, నా ఫోను నాన్నగారికి అందుతుంది. జాగ్రత్తగా వెళ్ళిరా!" అన్నాడు. బస్సు బయల్దేరింది. కుటుంబ రావు బస్సుస్టాండులో కూతురును రిసీవ్ చేసుకుని, ఇంటికి తీసుకువస్తుండగా, ఆటో లోనే అడిగాడు, "ఎంత కావాలేమిటి? "

"మా ఆయన దగ్గర రెండు లక్షలు న్నాయ్. ఇల్లు కట్టాల్సిన ఆ స్థలం రిజిస్ట్రేష నుకు నాలుగు లక్షలుండాలి!"

"అంటే రెండు లక్షలా? !"

"ఆఁ! రెండు లక్షలే!" కిరణ్మయి తేలిగ్గా అంది.

కుటుంబరావు తన కూతురు చెప్పిన దాన్ని విని, జవాబు చెప్పకుండా ఊరుకు న్నాడు. ఆటో ఇల్లు చేరింతర్వాత, అతడికి డబ్బులిచ్చేసి లోపలకు వెళ్ళిపోయాడు. తండ్రి ప్రవర్తన, మౌనం కిరణ్మయికి కోపం తెప్పించింది. తల్లి దగ్గర తన కోపాన్ని ప్రదర్శించింది. "ఏవిటే మీ ఉద్దేశ్యం? తమ్ముడు ఫోను చేశాడు. అంటే వాడికి అభ్యంతరం లేదనేగా అర్థం! అయినా అది మీ డబ్బేం కాదుగా.. కట్నం సొమ్మేగా? "

"అది కాదే అమ్మాయీ.. అప్పుచేసి స్థలం కొనడం ఇప్పుడంత అవసర మంటావా? " తన ప్రశ్న తనకే అర్థరహి తంగా అనిపించింది.

ఆ ప్రశ్నతో కిరణ్మయి అగ్గిమీద గుగ్గి లంలా మండిపడింది. "ఎంత కాలంగానో మీ ఇల్లు తాకట్టులో ఉంది. నా పెళ్ళైనప్ప ట్నుంచీ! అవునా? కట్నం సొమ్ముతో ఇప్పుడే ఆ తాకట్టు విడిపించకపోతే కొంప లంటుకు పోతాయా? మాకు బ్యాంకు

లోన్ వస్తుందంటున్నాను కదా? ఆ డబ్బుతో మీరిచ్చింది మీకు తిరిగి ఇచ్చేయ మేవిటీ? "

"మీ నాన్నగారినడిగి చూస్తాను!" తల్లి అంది.

ఆ మాటకు కిరణ్మయి జవాబుగా అంది, "అడగడం కాదు. గట్టిగా చెప్పు. డబ్బు ఇప్పించు."

కామేశ్వరమ్మ చెప్పినా కుటుంబరావు ఒప్పుకోలేదు. "అది శివుడి సొమ్ము. ఈ ఇల్లు శివుడిది. కట్నంగా వచ్చింది ఈ ఇంటి కోసమే వినియోగించాలి. అంతే!" కుటుంబరావు కరాఖండిగా అన్నాడు.

తండ్రి పట్టుదల చూసిన కిరణ్మయి చివరి అస్త్రాన్ని ప్రయోగించింది. అభోజ నంగా ఉండి, కన్నీరు పెట్టుకుంటూ సామాను సర్దుకోవడం మొదలుపెట్టింది.

చంటివాడు గుక్కపట్టి ఏడుస్తున్నాడు. "ఏడవరా ఏడు! నేనూ ఏడుస్తూనే ఉన్నాను. ఈ ఇంట్లో నువ్వూ- నేను ఎంతే డ్చినా ఎవ్వరికీ జాలి కలగదులే! మన బతుకులే ఏడుపు బతుకులై పోయినాయి. ఇక్కడున్నా అక్కడున్నా ఏడుపే కదా! మనింట్లోనే ఏడుద్దాం పద" అంటూ సూట్‌కేసు చేతిలోకి తీసుకుంది.

కుటుంబరావు బేలగా కూతురివేపు చూశాడు. "తల్లీ! రెండు లక్షలు ఇవ్వగల సమర్థుణ్ణా నేను? " అన్నాడు దీనంగా.

"పోన్లెండి నాన్నగారూ! బాధపడకండి. ఇహ ఈ విషయం మర్చిపోండి. అక్కడికి వెళ్ళింతర్వాత, ఏమైనా జరిగి, ఈ పిల్ల వాడు తల్లిలేని వాడైపోతే మాత్రం, వీణ్ని అక్కడే వదిలేయకుండా ఇక్కడకు తెచ్చి పెంచుకోండి!"

ఆ మాటలు విన్న కామేశ్వరమ్మ తట్టు కోలేకపోయింది. కిరణ్మయి తన దండ యాత్రను ఆపలేదు. "మీకు తెలీదు నాన్న గారూ! మీ అల్లుడుగారు పైకి కనిపించే టంత సాధువు కాదు. చాలా తొందర మనిషి. ఒట్టి చేతుల్తో వెళితే, బెల్టు చేతి లోకి తీసుకుంటాడు. ఆ చిత్రహింస నేను భరించలేను. అంతకన్నా చావే నయం!"

కామేశ్వరమ్మ గుండె తరుక్కుపోయింది. గభాలున లోపలికి వెళ్ళి డబ్బున్న బ్రీఫ్‌ను తెచ్చి భర్త చేతికిచ్చేస్తూ "వద్దండీ! ఈ డబ్బు మనకొద్దు. కిరణ్మయి కిచ్చేయండి. దాని కాపురం సవ్యంగా ఉంటే చాలు మన కు! అది ఇల్లు కట్టుకుంటానంటుంటే, ఆ సంగతీ మనకు సంతోషమేగా! మన ఇల్లు అయితేనేం.. దానిల్లు అయితే ఏం? అన్నీ మనవే కదా? " అంది ఆవేశపూర్వకంగా.

కుటుంబరావు తటాపటాయింపు ఇంకా తగ్గలేదు. తల్లి బ్రీఫ్ కేసును తెచ్చినా తండ్రి జాప్యం చేస్తుండడం చూసి, కిర ణ్మయి తానే చొరవతో దాన్ని అం దుకుంది. మూత తెరచి, లోపల డబ్బు ఉందో లేదో చూసుకుంది.

"థ్యాంక్స్ నాన్నగారూ! ఏవన్నా- మీకు నా మీద ప్రేమే! మీ డబ్బు మీకు పువ్వుల్లో పెట్టి ఇచ్చేస్తాం నాన్నగారూ! మిమ్మల్ని ఇబ్బంది పెట్టం. సరేనా? "

రాత్రల్లా బస్సులో కిరణ్మయి నిద్రపో లేదు. ఒకపక్క రెండు లక్షలున్న బ్రీఫ్‌కే సును కాపాడుకోవలసిరావడం, మరొక వంక, డబ్బు తీసుకువెళ్ళి భర్త చేతికివ్వ గానే, అతను చూపించే రియాక్షన్... ఒకటి రెండుసార్లు బస్సు దిగవలసి వచ్చినా, బ్రీఫ్‌కేసుతోనే దిగి వెళ్ళింది.

ఇల్లు చేరగానే, హాల్లో ఆమెకో ఊహిం చని దృశ్యం ఎదురైంది. ఆమె భర్త చుట్టు ఎవరో ఆగంతకులు నలుగురున్నారు. అతను తెల్లమొగం వేసుకుని ఏమీ పాలు పోని, ఏమీ చేతకాని మనిషిలా కన్పిస్తు న్నాడు. వాళ్ళవంక, భర్త వంకా కిరణ్మయి చూసి గబగబా లోపలకు నడిచింది. ఆమె సింక్‌లో మొహం కడుక్కుంటుండగానే,

వాళ్ళంటున్న మాటలు వినిపించాయి.

"ఏమయ్యా, పుల్లారావ్! మీ ఆవిడ రాగానే ఇచ్చేస్తానన్నావు కదా? అదిగో ఆవిడగారు వచ్చేశారుగా! ఇప్పుడు కొట్టెయ్యవయ్యా మాడబ్బు మా మొహాన!" అన్నాడు ఒకడు పరుషంగా.

రెండోవాడు, ఓ బుంగమీసాల మనిషి కరుగ్గా అన్నాడు, "తీసుకునే ముందు అడిగాను. అంత అవసరం ఏమొచ్చిందీ అని! పేకాటలో పెట్టొద్దయ్యా, జూదం ఇది, వస్తుందని గ్యారంటీ ఏవన్నా ఉందా అని. నువ్వు వినలేదు. హ్యాండ్ రెయిజ్‌లో ఉంది. కనకవర్షమే అన్నావు. కనకవర్షం సంగతెలా ఉన్నా, వేలికున్న రెండుంగరాలు, మెళ్ళో గొలుసు కూడా పోగొట్టుకున్నావు. సర్లే, నువ్వేం చేస్తే నాకేంగానీ, తీసుకున్నది వడ్డీతో సహా ఇచ్చెయ్. నా దారిన నేను పోతాను!"

ఇంకొకడు, మరొకడు కూడా డబ్బిచ్చిన వాళ్లే. అది ఏదో నిత్య జీవితావసరాలకు కాదు- చతుర్ముఖ పారాయణానికి. పుల్లారావు పిల్లిలాగా నడుచుకుంటూ భార్య దగ్గరకు వచ్చాడు. వినిపించీ వినిపించకుండా, "తెచ్చావా డబ్బు?" అడిగాడు.

కిరణ్మయి, ఓ మూలగా వున్న స్టూలు మీద పెట్టిన బ్రీఫ్‌కేసు వేపు చూసింది. "ఓమ్మో! దాన్లో ఉందా?" ఆ పెట్టె వేపుగా గబగబా నడిచి దాన్ని అందుకున్నాడు.

"వద్దు. వద్దు.. తీసుకోవద్దు" అంటూ కీచుగా అరిచింది, కిరణ్మయి చేతుల్ని అడ్డంగా పెట్టింది.

పుల్లారావు ఆమెను పక్కకు నెట్టాడు. "ఉష్!" అంటూ తర్జనితో అదిలిస్తూ "అవతల పెద్ద మనుషులున్నారు. వింటే బావుండదు!" అన్నాడు.

కిరణ్మయి కళ్ళల్లో నీళ్ళూరుతున్నాయి. 'పెద్ద మనుషులా?' అనుకుంటూ పెదవి విరిచింది. "ఖర్మ! ఖర్మ!" అంటూ తలబాదుకుంది.

## ఏం చేద్దాం మరి?

మహాత్మాగాంధీ, రవీంద్రనాథ్ టాగూర్‌ని మొదటిసారిగా శాంతినికేతన్‌లో కలుసుకున్నారు. అక్కడే వారిద్దరూ ఎన్నో విషయాలు చర్చించుకున్నారు. ఒకసారి వాళ్ళ చర్చ ఆహార పదార్థాలపైన, ముఖ్యంగా



పూరీలను గురించి సాగింది. గాంధీజీ అహింసావాది. శాకాహారి కావడంవల్ల పూరీలను తీవ్రంగా విమర్శించారు.

'పిండిని పూరీలు చేయడం కోసం నేతిలోనో, నూనెలోనో వేయించడం మంచిదేనా?' అన్నారు.

గురుదేవులకి ఆ అభిప్రాయం అంతగా నచ్చలేదు. ఆయన సీరియస్‌గానే, 'నేను పుట్టినప్పటి నుంచీ పూరీలు తింటూనే ఉన్నాను. ఏం చేద్దాం 'మరి?' అన్నారు.

పుల్లారావు ఠీవిగా హాల్లోకి వచ్చాడు. "వాట్ బ్రదర్స్! ఒక్కక్షణం ఓపిక పట్టలేకపోయారే? చెప్పాను కదా, నా భార్య అంటే లక్ష్మీదేవి. నా కోసం, నా గౌరవం కోసం ఏమైనా చేస్తుంది? మీ డబ్బు పువ్వుల్లో పెట్టి ఇచ్చేస్తానన్నానా? తొందర పడ్డారు. ఓకే! నేనేం బాధపడనులెండి, ఇవిగో మీ డబ్బులు!"

బ్రీఫ్‌కేసులో ఉన్న నోట్ల కట్టలో నుంచి ఎవరికెంత ఇవ్వాలో అంత లెక్కకట్టి ముద్ర శుద్ధిగా ఇచ్చేసి, వాళ్ళను పంపించేసి మళ్ళీ కిరణ్మయి ఉన్నచోటికి వచ్చేశాడు.

"కిరణ్! ఎంతిచ్చానసుకున్నావు. ఆఫ్ట

రాల్ ఒక లక్ష! ఇదిగో ఇంకో లక్ష ఉంది ఇందులో!! ఏం చేద్దామంటావ్? "

కిరణ్మయి తలవొంచుకునే జవాబి చ్చింది. "మళ్ళీ అప్పు చేయడం ఎందుకూ? తీసుకువెళ్ళి ఆడుకోండి.. తాగండి!"

పుల్లారావు పకపకా నవ్వాడు. "కిరణ్! మై గోల్డెన్ గూస్! నిన్ను బాధ పెట్టేటంత క్రూరుణ్ని కాదు నేను. నా సంతోషానికి ఓ లక్ష ఇచ్చావ్.. నీకో లక్ష ఇస్తున్నాను. రవ్వల నెక్లెస్సే కొనుక్కుంటావో, బ్యాంకులో డిపాజిట్ చేసుకుంటావో నీ ఇష్టం. నేను చెప్పినట్టు చేశావు. డబ్బు తెచ్చావు. సో.. నేనూ నువ్వు చెప్పినట్టే చేస్తాను. నాకు నువ్వు అడ్డం రాకు. నేను నీకు అడ్డం రాను. ఇది మనిద్దరికీ ఒప్పందం! ఇందుకు సాక్ష్యం మనకు పుట్టిన ఈ బిడ్డ!" అంటూ బయటకు వెళ్ళ డానికి ఉద్యుక్తుడయ్యాడు.

రవ్వల నెక్లెస్ అనగానే ఆమె దుఃఖం చాలా భాగం ఉపశమించింది. లేచి భర్త దగ్గరకు వచ్చి, "ఎప్పుడు వెళ్దాం బజా రుకు? " అడిగింది.

పుల్లారావు పకపక నవ్వాడు. "స్థలం ఎప్పుడు రిజిస్టరీ చేయిస్తారు అని అడుగు తావనుకున్నాను. నాకు తెలుసు కిరణ్! మగవాడికి ఆడది టెస్ట్ అన్నారు. అట్లాగే ఆడదానికి బంగారం టెస్ట్ అన్నారు. బంగారం మాట వినేసరికి నీ దుఃఖ మంతా ఉఫ్‌మని గాలికెగిరిపోయింది. నేను రైటేనా? "

"చూడండీ! మీరు చెప్పమన్నది చెప్పాను. నమ్మాను మిమ్మల్ని. మా నాన్నావాళ్ళు బాధపడ్డా అనుకున్నది సాధించాను, మీ కోసం! స్థలమే కొంటారో, ఇల్లే కడతారో, ఆ బాధ్యతంతా మీది!" అంటూ కాఫీ తెచ్చి ఇచ్చింది.

పుల్లారావు ఆమె చెంపలు పుణికాడు. "ఇట్లా ఉండాలి, ఇల్లాలంటే!" అన్నాడు. బయటకు వెళ్ళిపోయాడు.

**"శ్వశుర గృహ నివాసో, స్వర్గతుల్యం నరాణామ్!"**




**క**ట్టుకున్న చిన్నదాని ఒళ్లో సేదతీ రుతూ, మామగారింట్లో సుఖసంతోషం పొందుతూ, కాలం గడపడం కన్నా, స్వర్గ సుఖం ఏముంటుందీ? " అన్నాడు శివశం కరం, పందిరి మంచం మీద పడుకుని, కువకువలాడుతూ చిలకలు చుట్టిస్తున్న భార్యతో.

"ఆహా! ఆలాగా! అల్లుడు సర్వస్వతం త్రుడు, ఇల్లలుకన, ముగ్గు బెట్ట, విస్తళ్ళెత్తన" సుజాత అందుకుంది. శివశంకరం కుహ నా కోపంతో ఆమెను కొట్టబోయాడు. సుజాత చివాలున మంచం దిగి, అద్దం ముందుకు వెళ్లి వాలుజడను ముందుకు వేసుకుని, సుతారంగా ఆ జడ చివర్లతో ఆడుకుంటూ అంది "మర్చిపోకండి! మీ వంటి సరసుడు తమలపాకుతో తానొక టంటే నావంటి తెలివితక్కువది తలుపు చెక్కలో తారెండంది!"

అప్పటికి మూడు రాత్రుల ముద్దా- ముచ్చటా గడిచిపోయాయి. ఒకరికొకరు బాగా సన్నిహితమయ్యారు, అర్థం చేసుకు న్నారు. బయలుదేరి శివశంకరం ఇంటికి వెళ్ళిపోవటానికి సిద్ధమవుతున్నారు.

"ఇక్కడ మూడు నిద్దర్ల తతంగం అయిపోయింది! మళ్ళీ అక్కడ. ఇది నాకేం బావుండలేదు. ఏకంగా కాపురానికే వచ్చేయవచ్చుగా!"

శివశంకరం సన్నగా విజిల్ వేశాడు. "నేను ఏమనుకుంటున్నానో నీవు, అదే అనుకుంటున్నావు. నీమాట నేను విన్నట్టా. నా మాట నువ్వు వింటున్నట్టా? "

"మీ మాటే నేను వింటాను!"

"ఉహూ, నీ మాటే నేను జీవితాంతం వింటుంటాను. అప్పుడే థ్రిల్ ఉంటుంది!"

"అందరూ మిమ్మల్ని పెళ్లాం చాటు మగాడు" అంటారు.

ఇద్దరూ హాస్యాలాడుకున్నారు. నవ్వులు పంచుకున్నారు. ఒకరి ఆశలేవిటో మరొకరు తెలుసుకున్నారు.

"ఏవండీ!"

"చెప్పు!"

"ఎప్పుడూ మీ జేబులో ఓ అయిదువందల రూపాయల నోటు ఉండాలి. మీ వేలికి ఓ నవరత్నాల ఉంగరం ఉండాలి"

"మరి నీకు? "

"నొసటన బొట్టు, మెడలో మంగళసూత్రం, కాలికి మట్టెలు.."

"యూ సెంటిమెంటల్ ఫూల్.. మరి ఇద్దరికీ ఏం ఉండాలి!"

"మారుతీ ఏసీ కారు, ఓ త్రీ బెడ్ రూం ఫ్లాట్, ఇంట్లో గీజరు, వాషింగ్ మెషీన్, పెద్దటీవీ, క్యాసెట్ ప్లేయరు, సోఫా సెట్టు, డైనింగ్ టేబిలూ, వంటకో కుక్, ఇంటి పనికో సర్వెంట్ మెయిడ్, బెడ్ రూంలో ఏ.సీ.. ఓ బొచ్చు కుక్కా, ఇద్దరే ఇద్దరు పిల్లలు.."

నవ్వుతూ ఆమె నెత్తిన మొట్టి, "లిస్టు అయిపోయిందా? ఇవన్నీ ఈ రోజుల్లో జస్ట్ కామన్! ఇవే కాదు, ఇంకా నువ్వేమడిగినా ఇస్తాను. బైబిలులో అన్నార్లే 'తట్టుడీ, తెరవ బడును' అని. నేనంటాను అడుగుడీ, ఇవ్వబడును"

"నిజంగా.. నిజంగా.. నేను అడిగినవన్నీ ఇచ్చేస్తుంటారా? "

"నీ పెదవుల మీద ఒట్టు, నీ కళ్లమీద ఒట్టు. మనకు పుట్టబోయే బిడ్డ మీద ఒట్టు.. నీ అందం మీద ఒట్టు..."

"మనకు అప్పుడే బిడ్డలొద్దండీ!"

"ఏం? "

"బిడ్డలు పుట్టగానే సరా, పుట్టింతర్వాత వాళ్ళకు ఎన్ని చూసుకోవాలి? ఆలా చూసుకోవడానికి మనం ఎంత శ్రమపడాలి? " ఆమె దూరదృష్టికీ, దూరాలోచనకూ అతనికెంతో ఆశ్చర్యం వేసింది. మగవాళ్ళకన్నా ఆడవాళ్ళల్లో 'ఐక్యూ' ఎక్కువన్న విషయం అతనికి తెలిసి వచ్చింది.

> **కొత్తగాలి...**
>
> **ప్రతి నేతా**
> **మేడిపండే**
> **ప్రజల రాత**
> **పచ్చి పుండే**
>
> – పట్ల యాదగిరి,
> నల్గొండ

అత్తవారింటి మనుగుడుపులు హాయిగా అనుభవించి, సుజాతను తీసుకుని శివశంకరం తన ఇంటికి వచ్చేశాడు. మళ్ళీ అతనికి యాంత్రిక జీవనం మొదలైంది. పొద్దున్నే నిద్రలేవడం, కాలకృత్యాలు తీర్చుకోవడం, స్నానపానాదులు, అమ్మ చేతి వంట, కుటుంబరావు మాట్లాడే కాలక్షేపం కబుర్లు, పత్రికలో వార్తల పేరుతో వచ్చే వ్యాఖ్యలు, కొండకచో టీవీ- ఈ అన్నింటి మధ్యా సుజాతతో గడిపే కొద్దికాలమే అత

నికి మధురంగా భాసించసాగింది. వాళ్ళ ఇల్లు తాత తండ్రులు నుంచి వచ్చిన ఓ పెంకుటిల్లు. కుటుంబరావు మధ్య మధ్య మరమ్మతులు చేయించి, వాసయోగ్యం అనిపించాడు. ఆ ఇంట్లో ఉన్న ఒకే ఒక గదిని, ఆయన, కామేశ్వరమ్మ కూడబలుక్కుని కొత్త దంపతులకు కేటాయించి, తామిద్దరూ హాల్లోకి మారారు. గదిలో సుజాత ఏ కొంచెం పెద్దగా మాట్లాడినా ఆ శబ్దం హాల్లోకి వచ్చి ఆమెకు ఇబ్బందిగా ఉండేది.

ఒకరోజు రాత్రి, నిద్రపోతూ.. నిద్ర పోతూ.. సుజాత ఉలిక్కిపడి లేచింది.

"ఏవిటి? ఏవిట్రైంది? " శివశంకరం గాబరాపడుతూ లేచి లైటు వేశాడు. రెండు

# కొత్తగాలి... 

**ప్రేమ**
**దీపం లాంటిది**
**తైలం, వత్తి**
**నువ్వు.. నేనూ..**

– *శ్రీకాళహస్తి వెంకట శేషగిరిరావు,*
నెల్లూరు

ఎలుకలు మంచంమీద నుంచి కిందకు గెంతి, కిచకిచమంటూ పారిపోయాయి. సుజాత రెండు కాళ్ళ మడమలూ కొంత మేర వాటికి ఆహారమయ్యాయి. సుజాత భయపడిపోయింది.

ఆ రాత్రంతా, శివశంకరం ఒళ్ళోనే తల పెట్టుకుని, కాళ్ళు రెండూ దగ్గరకు లాక్కుని ముడుచుకుని పడుకుంది.

మర్నాడు శివశంకరం తండ్రికి ఈ సంగతి చెప్పి, "నాన్నగారూ! ఎలుకలు లోపలకు రాకుండా, కిటికీలన్నింటికి మెస్ కొట్టిద్దాం. ఫ్లోరింగుకు గ్రానైట్ పరిపిద్దాం. ఎ.సి. పెట్టిద్దాం!"

సీతారామయ్య అందుకు ఒప్పుకోలేదు. "ఈ కొంపకు ఏం చేసినా, పూర్వ సువాసిని పట్టుచీర కట్టుకున్నట్లుగా ఉంటుంది. మంచిరోజులు వస్తే, ఈ కొంపను పడగొట్టేసి, డాబా వేయించుకుందాంలే!"

మామగారు అవతలకు వెళ్ళింతర్వాత, సుజాత, భర్తను అడిగింది. "ఈ ఇల్లు తాకట్టులో ఉందని చెప్పారుగా. ఆ తాకట్టు విడిపించకుండా, ఏం చేసినా ఇబ్బందే కదండీ!"

"అవును సుమా!" అన్నాడు శివశంకరం, టై కట్టుకోవడానికి తయారవుతూ..

"ఉండండి. నేను కడతాను. టై కట్టుకోడం ఓ కళండీ!" టై కడుతున్నప్పుడు ఆమె పొడుగాటి తెల్లని కళ్ళు అతని గొంతు నరాలను మరింత చైతన్యవంతం చేశాయి. టై కట్టి, అద్దం ముందుకు తీసుకువెళ్ళి జుట్టు దువ్వింది. దువ్వుతూ, యథాలాపంగా అడిగినట్లుగా అడిగింది. "ఆ రెండు లక్షలూ కట్టి, తాకట్టు విడిపిస్తానన్నారుగా మావయ్యగారు!"

శివశంకరం తల పంకించాడు. "ఆc! ఆc! విడిపించే ఉంటారు!"

"విడి... పించే... ఉంటారు కాదు. పించారో, లేదో కనుక్కోండి. అన్నీ నేనే చెప్పాలి!" విసుక్కుంది సుజాత.

ఆఫీసుకు తయారైన శివశంకర్ వరండాలో బూట్లు వేసుకుంటుండగా సీతారామయ్య గేట్లో నుంచి లోపలకు వస్తూ కనిపించాడు.

"ఎక్కణ్నుంచి వస్తున్నారు నాన్నగారూ? "

"ఏదో కాలక్షేపంగా, అటు తిరిగి వస్తున్నాలే!" సీతారామయ్య జవాబు చెప్పి లోపలకు వెళ్ళబోయాడు. మళ్ళీ తండ్రిని పిలిచాడు శివశంకరం "నాన్నగారూ!"

కుటుంబరావు ఒక కాలు గడప అవతల

వేసి, ఆ పిలుపు విని కాలుతీసి ఇవతలకు వచ్చి, "ఏవిటీ? " అన్నాడు, 'ఏదో ఉందన్న' భావనలో.

"ఏంలేదూ? తాకట్టు విడిపించారా? "

కుటుంబరావు ఆ ప్రశ్నకు డైరెక్టుగా సమాధానం చెప్పలేదు. "ఏం, అట్లా అడిగావ్? "

"ఇందాక అనుకున్నాం గదా! తాకట్టు తీరిపోతే, ఎక్కడో అక్కడ మళ్ళీ అప్పుతెచ్చి డాబా వేస్తే బావుంటుందని!"

"ఇప్పుడెందుకులే ఆ విషయం? తర్వాత మాట్లాడుకుందాం. నువ్వు ఆఫీసుకు వెళ్ళిరా!"

గడప అవతల నిలబడి ఎంబ్రాయిడరీ కోసం సిద్ధమవుతున్న సుజాతకు ఆ మాట

## కొత్తగాలి... 

**వంశవృక్షాన్ని పెకిలిస్తూ**
**పుట్టిన మొలకకు**
**నీళ్లుపోసి పెంచేదే**
**ఈనాటి యువత ప్రేమ**

**– యలమర్తి అనూరాధ,**
పెనుగొండ

లెందుకో అనుమానాస్పదంగా అనిపించాయి. రాత్రి భర్తతో అదే విషయం ఇంకొక రకంగా ప్రస్తావించింది. "ఇంకా ఎన్నాళ్లండీ ఈ ఎలుకల బాధ? "

"బాధేం ఉందీ- నాకు మాత్రం చాలా హాయిగా ఉంది!"

"ఏవిటీ ఆ ఎలుకలు నా మడమలు తినడమా? "

"కాదు, నువ్వు నా ఒళ్లో పడుకోవడం! నీ వెచ్చని స్పర్శలో నేను కాలాన్ని మర్చిపోవడం!! నీ శ్వాసతో నాకు ఎంతో ఆశ్వాస లభించడం!!"

సుజాత అతణ్ణి ఆపి వారించింది. "కవిత్వం వద్దు. అదంతా మూడు రాత్రులకు ముందు. ఇప్పుడు మనం జీవితంలో మన ప్రయాణం ప్రారంభించాం. ఇందులో కటిక నిజాలు తప్ప కలలుండవు"

అట్లా ధైర్యంగా, యథార్థ వాదపటిమతో మాట్లాడుతున్న సుజాతను చూస్తున్నకొద్దీ, అతనికి ఇంకా ఇంకా చూడాలనిపిస్తోంది. ఆ కనురెప్పల కదలిక, చెంపలపై అటూ ఇటూ కదిలే వింత రంగులు, నుదిటిపై నాట్యంచేసే నల్లని ముంగురులు.. ఓహో! ఏమి అందం.. ఎంత అందం..

"ఏం కావాలో చెప్పు సుజీ!! చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను కదా!"

"ముందా రెండు లక్షల సంగతి కనుక్కోండి!" సుజాత ఖండితంగా అంది.

ఈసారి శివశంకరం, ఆ డబ్బు విషయమై తన తల్లి నడిగాడు. ఆమె దీర్ఘంగా ఆలోచించింది. చెప్పడమే మంచిదనిపించింది, "అవున్రా! నువ్వు ఫోన్‌చేసి చెప్పావుటకదా, కిరణ్మయికి అడిగింది ఇచ్చేయమని! అందుకని ఆ రెండు లక్షలూ దానికిచ్చేశారు మీ నాన్నగారు!"

"ఏవిటీ.. రెండు లక్షలూ ఇచ్చేశారా! అంత డబ్బెందుకు దానికి? "

"వాళ్ళాయన స్థలం కొంటున్నాట్ట. తర్వాత ఇల్లు కట్టుకుంటారట!" తల్లి మాటలు విన్న తర్వాత, తండ్రిని గురించిన ఆలోచన అతనిలో మొదలైంది. తామే గోతిలో ఉన్నాం. తాము బైట పడింతర్వాత కదా ఇంకొర్ని గురించి ఆలోచించవలసింది. పైగా తనచేత ఫోన్ చేయించి కిరణ్మయి తననెందుకు ఇట్లా ఎక్స్‌ప్లాయిట్ చేసింది?

సుజాతకు ఈ విషయాన్నే, శివశంకరం బాధపడుతూ చెప్పాడు.

విన్న తర్వాత సుజాత భర్తను కడిగి ఆరేసింది. నిశితంగా ప్రశ్నల వర్షం కురి

పించింది. "ఆ రెండు లక్షలూ ముందుగా ఎవరికిచ్చారు మీరు? "

"నీకే కదా? "

"అంటే ఆ డబ్బు నాదనేగా అర్థం? "

శివశంకరం తలాడించి మౌనంగా ఊరుకున్నాడు.

"మన పెళ్ళి జరగాలని, ఒక్క పైస కూడా ఉంచుకోకుండా, అంతా మళ్లీ మా నాన్నగారి ద్వారా మీకే అందజేశాను కదా? "

"మీ నాన్నగారు కట్నం లేకుండా, ఒప్పుకోనన్నారు"

"కట్నం లేకపోయినా మీరు నన్ను పెళ్ళి చేసుకొనేవారు. అవునా? కాదా? "

"అటు సూర్యుడు ఇటు పొడిచినా నేను నిన్ను చేసుకుని తీరేవాడ్నే!"

"అయినప్పుడు ఆ డబ్బును మా నాన్నగారు, మీ నాన్నగారికి ఇవ్వడం రెండు కుటుంబాల మధ్య సంబంధబాంధవ్యాలు బావుండాలనే కదా? "

"అవునవును..."

"కానీ మీ నాన్నగారు మేమిచ్చిన ఆ డబ్బును, మీరు నాకిచ్చిన డబ్బును, నా డబ్బును, మీ అక్కయ్యకు ఇచ్చేశారు! ఇస్తూ, మీతో ఒక్కమాట కూడా చెప్పలేదు. మీరు ఫోను చేశారు"

శివశంకరం నీళ్ళు నమిలాడు. "అది కాదు సుజీ. అదీ... అ...దీ...!"

సుజాతకు అసహనం అంతకంతకూ ఎక్కువవుతోంది. "అదో-ఇదో-ఏదో వొకటి ఆ ఫోను విషయం నాకు చెప్పారా? మీ నాన్నగారు రెండు లక్షలూ ఇచ్చి కూర్చుని ఆ విషయం మీకు చెప్పారా? ఆలోచిస్తుంటే ఈ ఇంట్లో ఎవరి మీద ఎవరికీ విశ్వాసం లేదు. నన్ను మీరు నమ్మరు. మిమ్మల్ని మీ నాన్న నమ్మడు. మీ నాన్న.. వద్దులెండి, పెద్దాయన, ఆయన్ని గురించి చెప్పడం బావుండదు. ఇదొక అనుమానాల కొంప. ఇక్కడ అక్కలు, తమ్ముళ్ల డబ్బులు కొట్టేస్తారు. ఎలుకలు మనుష్యుల్ని కొరుక్కుతింటాయి!"

సుజాత శాపాదపి- శరాదపి ఆ విధంగా మాట్లాడుతుందని శివశంకరం ఊహించలేకపోయాడు.

ఆ రాత్రి భోజనం చేసి శివశంకరం గదిలోకి వచ్చేసరికి, సుజాత కింద, కటిక నేల మీద ఓ దుప్పటి వేసుకుని పడుకుంది.

"సుజీ! సుజీ! ఇదేమిటి? ఈ పడుకోవడమేమిటి? "

"ఇహనుంచీ ఇంతే! మీరక్కడ.. నేనిక్కడ...!"

"కింద పడుకునే ఖర్మ నీకేవిటీ? నువ్వే మంచంమీద పడుకో- నేనే కింద పడుకుంటాను"

"ఆహా! ఏమి త్యాగమూ!!" ఆమె వెటకారంగా అంది. ఆమెను చూస్తున్నకొద్దీ, శివశంకరానికి మోహం, వ్యామోహం ఇంకా, ఇంకా ఎక్కువ కాసాగాయి. గుహనో(ద్రిక్తత అతన్ని వివశుణ్ని చేయసాగింది. తనూ వెళ్ళి ఆమె పక్కనే కూచున్నాడు. ఆమె అవతల వైపుకు తిరిగింది. అతను బలవంతంగా ఆమెను తనవైపుకు తిప్పుకున్నాడు.

"సుజీ! మొదటిరోజే చెప్పాను నీకు- ఈ ప్రపంచంలో నాకు అందరికన్నా నువ్వే ఎక్కువని. తల్లీతండ్రీ- అక్కాబావా, ఎవ్వరైనా కానీ, నీ ముందు దిగదుడుపే!"

సుజాతకు ఆ మాటలు అమృతంలా వినిపిస్తున్నాయి. కానీ అంత మాత్రాన ఆమె అతనికి వశంవదురాలు కాలేదు.

"మాటలు కాదు, చేతల్లో చూపించండి మీ ప్రేమను!" అంది.

"ఏం చేయమంటావ్? " అడిగాడు శివశంకరం.

"ఈ ఊరి నుంచి ఇంకెక్కడి కన్నా ట్రాన్స్‌ఫర్ చేయించుకోండి. వెళ్ళిపోదాం!"

"అమ్మనూ నాన్ననూ విడిచి వెళ్ళిపోవ

డమా?"

"ఇక్కడే ఉంటే ఇంటి బాకీ మీరే కట్టుకోవాలి. ఇంటి బరువంతా మీరే మోయాలి. రేపు ఎటుపోయి ఎటువచ్చినా బాధ్యతంతా మీదే అవుతుంది"

శివశంకరం ఆలోచనలో పడ్డాడు. సుజాత కట్టకడకు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించింది. "చెప్పింది నచ్చక, వేరుపడడం ఇష్టం లేకపోతే, మీరు ఆ మంచం మీదనే పడుకోండి. నేనిక్కడా- మీ రక్కడా! కాదూ- నే చెప్పినట్టు చేస్తానంటారా, నేనూ ఆ మంచంమీదకే వస్తాను"

శివశంకరం భార్యవేపు చూశాడు. ట్యూబ్ లైటు వేశాడు. ఆ పాలకాంతిలో, సాలార్‌జంగ్ మ్యూజియంలోని పాలరాతి శిల్పంలా ఆమె సుమనోహరంగా కన్పిస్తోంది. తెల్లని గాజులు, తెల్లని చీర, తల్లో తెల్లని మల్లెలు, ఎగసి పడుతున్న ఆమె వక్షస్సు... అతనిలో నాభీస్తనభర మోహావేశం, ఆమెను గబుక్కున కౌగిట్లోకి లాక్కుని, "చెప్పాను కదా, నీకేం కావాలంటే అదిస్తానని! అయితే కొంచెం టైమివ్వు!" అన్నాడు అర్థిస్తూ.

సుజాత కువకువలాడింది. అతను మొలనూలు సవరిస్తుండగా, "రాత్రి గడిచింతర్వాత- రాత్ గయా, బాత్ గయా- అనకండి" అంది.

నిద్రలేచిం తర్వాత సుజాత, భర్తకు కాఫీ తనే తీసుకువెళ్ళి ఇచ్చింది. తను కాపురానికి వచ్చిం దగ్గరనుంచీ క్రమక్రమంగా శివశంకరానికి ఏం అవసరమైనా, అవన్నీ తనే చూసుకోవడం మొదలెట్టింది. కామేశ్వరమ్మను నిదానంగా కొడుకు అవసరాలను కనుక్కోవలసిన బాధ్యతల నుండి దూరం చేసింది.

కాఫీ ఇస్తూ, తమ ఇద్దరికే వినిపించేటంత లోగొంతుతో అంది, "పోనీ.. ఇంకో పని చెప్తాను, చేస్తారా! నా మాటల్లోని ఔచిత్యం మీకే తెలిసివస్తుంది!"

శివశంకరం పేపరునుండి దృష్టి మరలించి, సుజాత రేగిన జుట్టువైపూ, అలసిన కన్నులవైపూ, వడలిన మొహంవైపూ, నలిగిన చీరవైపూ చూస్తూ చూస్తూ, "ఏవిటో చెప్పు!" అన్నాడు.

"మీ నాన్నగారిని, మీ బావగారికి ఫోన్ చెయ్యమనండి. గొంతు మీదకు వచ్చింది. అర్జంటుగా డబ్బు కావాలి.. ఆ రెండు లక్షలూ పంపించమని!"

శివశంకరం మాట మారుస్తూ అన్నాడు "కాఫీ చాలా బావుంది!"

"డబ్బు రాబడితే ఇంకా బావుంటుంది!"

ఆ మాటే ఒకటికి పదిసార్లు చెప్పింది. అతను స్నానం చేస్తున్నప్పుడు వీపు రుద్దుతూ చెప్పింది. టిఫిను పెడుతూ చెప్పింది. డ్రస్సు వేసుకుంటున్నప్పుడు చొక్కాకు గుండీలు పెడుతూ చెప్పింది. చిట్టచివరకు పడకమీద అతను మత్తుగా మల్లెల వాసనతో, తన పెదవుల తీపిలో మైమరచిపోతున్నప్పుడూ జ్ఞాపకం చేసింది. శివశంకరం ఓ నిశ్చయానికి వచ్చాడు. గుండె చిక్కబట్టుకున్నాడు. మరునాటి రాత్రి తండ్రితో కలసి భోజనం చేస్తున్నప్పుడు, తల్లితో అన్నాడు.

"అమ్మా! మీ కోడలు కాపురానికి వచ్చి ఆరునెలలు దాటిపోయింది. నేను మూడు నిద్దర్లకు వెళ్లినప్పుడు, అప్పుడే కదా, అక్కయ్యకు నాన్నగారు రెండు లక్షలూ ఇచ్చారు!"

"నేనివ్వలేదు, అది పట్టుకుపోయింది!" నిష్ఠూరంగా అన్నాడా తండ్రి

"పోన్లెండి అవసరానికి అడిగింది. మనం ఇచ్చాం. ఇప్పుడు మళ్లీ ఇవ్వమంటే- బావుంటుందేమో!"

"అందులో తప్పేముందీ? కోడలుపిల్ల వచ్చినా, ఈ పాత కొంపలోనే పడుండడం నాకేం బావుండలేదు!" అంది కామేశ్వ

రమ్మ.

భోజనాలయ్యాక నలుగురూ హాల్లోకి చేరింతర్వాత అల్లుడికి ఫోన్ చేశారు కుటుంబరావు.

మామగారి మాటలకు సరిగా స్పందించ లేదు పుల్లారావు. "నేనూ ఇబ్బందుల్లో ఉన్నాను మామయ్యగారూ! అయినా ఆ రెండు లక్షలూ నేను వాడుకోలేదు. అందులో ఒక లక్షపెట్టి మీ అమ్మాయ్ ఓ డైమండ్ నెక్లెస్ కొనుక్కుంది!"

కామేశ్వరమ్మకు తన కూతురు డైమండ్ నెక్లెస్ కొనుక్కుందన్న సంగతి ఎంతో సంతోషం కల్గించింది. ఫోను తన చేతి లోకి తీసుకుని కిరణ్మయితో అంది.

"ఏమమ్మా! డైమండ్ నెక్లెస్ కొనుక్కు న్నావా? సంతోషమమ్మా! డైమండ్స్ మంచివేనా? బాపాలాల్ కొట్లోనేనా? వజ్రాల విషయంలో అతనే నిఖార్సులే! ఆ డైమండ్స్ పెట్టుకున్నప్పుడు నిన్ను చూడా లని ఉందే తల్లీ.. రేపు సంక్రాంతికి నువ్వూ అల్లుడుగారూ రాకూడదూ? "

కిరణ్మయి ముద్దు ముద్దుగా తల్లి దగ్గర గునిసింది. "అమ్మా! మీ అల్లుడుగారంటు న్నారు.. కూతురు డైమండ్ నెక్లెస్ కొను క్కుంటే ఆ డబ్బు తిరిగి ఇచ్చేయాలా? అని. పెళ్ళప్పుడు పదికాసుల బంగారం కూడా సరిగా పెట్టలేదు కదా? ఇప్పుడు మనవడు కూడా పుట్టాడు. ఈ సమయంలో వజ్రాల నెక్లెస్ ఇవ్వడం బావుంటుంది కదా అని అంటున్నారే!"

కూతురి పలుకులు విన్న కామేశ్వరమ్మ అవాక్కయింది.

"ఏమందమ్మా అక్కయ్య? " శివశంకరం ఉత్సుకతతో అడిగాడు.

"ఆ డైమండ్ నెక్లెస్కైన డబ్బును తిరిగి ఇచ్చేయమని అడగవద్దు అంది"

సుజాత కళ్లు చికిలించింది. 'ఎంత తెలి వైంది తన ఆడబిడ్డ' అనుకుంది. భర్తవైపు, "మీ అభిప్రాయం ఏవిటి? " అన్నట్టు చూసింది.

శివశంకరం తండ్రివైపు చూశాడు. కుటుంబరావు గోడనున్న దేముడిపటం వైపు చూశాడు. ఏ జవాబూ చెప్పలేక, "నిద్ర వస్తోందిరా" అంటూ ఆయన ఆవ

## పాదుకా పురాణం!



ఓ సాహిత్యగోష్ఠికి శరత్‌బాబు, రవీంద్ర నాథ్ టాగూర్ హాజరయ్యారు.

శరత్‌బాబుకి ఇలాంటిచోట్ల చెప్పులు పోతా యని భయం. అందువల్ల ఆయన చెప్పుల్ని ఒక సంచిలో చక్కగా చుట్టి, దాన్ని తనతో పాటే పట్టుకుని కూర్చున్నారు.

రవీంద్రులు సభానంతరం వెనుతిరిగేట ప్పుడు శరత్‌బాబుతో, 'మీ చంకలో ఏదో ప్యాకెట్టున్నట్టుందే? ' అన్నారు.

శరత్‌బాబు ఉలికిపాటుతో 'అబ్బే, ఏం లేదండీ!' అన్నారు నెమ్మదిగా.

ఆయన్ని అంతటితో వదలక రవీంద్రుడు మళ్లీ 'ఏదో పుస్తకం అనుకుంటా? ' అన్నారు.

శరత్‌బాబు అసలు విషయమెక్కడ బయట పడుతుందోనని గాబరాగా 'అవున వును పుస్తకమే' అన్నారు, అంతటితోనన్నా ఆ విషయం వదులుతారేమోనని. కానీ రవీంద్రు లు మళ్ళీ శరత్‌తో 'ఏం పుస్తకమది? ' అన్నారు.

పాపం! శరత్‌బాబు ఈసారి ప్రమాదంలో పడిపోయారు. ఏంచెబుదామా అనే సంది గ్ధంలో పడ్డారు. దాంతో రవీంద్రుడు పకపకా నవ్వుతూ 'శరత్! పాదుకాపురాణం కదూ అది? అది లేకుండా ఎవరికీ పని జరగదు లే వయ్యా? ' అన్నారు.

లించాడు.

శివశంకరం సుజాతతో తన గదిలోకి వెళ్ళాడు.

కొడుకూ కోడలూ అవతలకు వెళ్ళింత ర్వాత, భార్యతో గుసగుస లాడాడు కుటుం బారావు. "ఇదేమిటే, అమ్మాయి ఇట్లా చేసిందీ? "

కామేశ్వరమ్మ తన భర్త మాటకు వంత పలకలేదు. "మనం ఎట్లాగూ పెట్టలేమని దానికి తెలుసు. అందుకనే అవకాశం వచ్చింది కదా అని జాగ్రత్త పడింది"

కుటుంబరావుకు తన భార్య మాటల్లోని అంతరార్థం తెలిసిపోయింది. "ఇప్పుడా డబ్బు రాదనుకుంటాను!"

"పోనిద్దురూ.. ఆడపిల్లకిచ్చిందానికి కక్కుర్తి పడతామా? "

కుటుంబరావుకు ఆ రాత్రి కంటిమీద కునుకే లేదు. తన ఆర్థిక పరిస్థితిని గురిం చిన ఆలోచనలు కందిరీగల్లా కుడుతు న్నాయి.




ఆ ఇంట్లో ఉన్నది నలుగురు మను షులే అయినా, ఆ నలుగురూ నాలుగు ప్రపంచాల్లో ఉంటున్నారు. కుటుంబరా వును తాకట్ల తమ్మయ్య, ఎక్కడ కనిపిస్తే అక్కడ తన అప్పు తీర్చేయమని ఒత్తిడి చేస్తున్నాడు. తమ్మయ్య ఇంటి పేరు 'తాకట్లు' కాదు. కానీ తెలిసిన వారందరూ అతనికి ఆ బిరుదిచ్చేసి, ఆ బిరుదు నామాన్నే అతని ఇంటి పేరుగా మార్చే శారు. అతనికో టెక్నిక్ ఉంది. పరిచితుల్లో ఎవరికి డబ్బు అవసరం ఉందో ముందు ఆరా తీస్తాడు. అతను డబ్బుకోసం "కావవే ఈశ్వరా!" అంటూ గజేంద్ర మోక్షంలో పద్యాలు పాడుకునే స్థితికి వచ్చే సమ యంలో ఆ విష్ణుమూర్తిలా అతని ముందు ప్రత్యక్షమవుతాడు. "చూడు బాబూ! నీకు డబ్బవసరం. నాకు తెలుసు. నా దగ్గర డబ్బుంది. అది పిల్లలు పెడితే కానీ నాకు తోచదు. పిల్లలంటే తెలుసుగా- వడ్డీ అన్న మాట! అయితే నేను అత్యాశపరుణ్ని కాదు. అవతలవాళ్లను పీడించి, రక్తం తాగేవాణ్ని కాదు. చాలా తక్కువ వడ్డీకే అప్పిస్తా. ఎంత కావాలంటే అంత!!" ఈ మాటలతో అవతలివాడు తాకట్ల తమ్మ య్యకు వశంవదుడై పోతాడు. కసాయి వాడు గొర్రెను చంపేటప్పుడు రెండు వేట్లు వేసినట్లే, రెండో దెబ్బ కొడతాడు. "అయితే ఒక షరతు ఉంది. డబ్బు తీసు కునేటప్పుడు ఇంటినో, తాకట్టు వస్తువునో, నాకు అమ్మేసినట్లు ముందే క్రయపత్రం రాసివ్వాలి. అనుకున్నట్టుగా సకాలంలో తాకట్టు డబ్బు కట్టేశావో, నువ్వూ నేనూ హాయిగా ఉంటాం. డబ్బు కట్టక ఇబ్బంది పెట్టావో నేను హాయిగానే ఉంటాను, నువ్వే మనశ్శాంతి కోల్పోతావు. తాకట్టు వాకట్టు అవుతుంది. తమ్మయ్య కబుర్లను డబ్బు అవసరం ఉన్న మనిషి పట్టించు కోడు. 'తన అవసరానికి డబ్బు సర్దుబాట వుతోంది. అప్పు విషయంలో వడ్డీ కూడా చాలా తక్కువ. అనుకున్న సమయాని కన్నా ముందే డబ్బు మొత్తాన్ని అతని మొహం మీద విసిరి కొడతాను' అట్లా అనుకుంటూ క్రయపత్రం రాసిస్తాడు సదరు బాకీదారుడు.

కుటుంబరావు కూడా ఆ విధంగానే

చేశాడు. అప్పుడు శివశంకరం ఫైనల్ ఇయర్ చదువుతున్నాడు 'అంతా ఎంత? ఒక సంవత్సరం కళ్లు మూసుకుంటే శివుడి చదువు అయిపోతుంది. తర్వాత వాడికి మంచి ఉద్యోగం వస్తుంది. అప్పుడు వాడూ తనూ కలిస్తే తమ్మయ్య అప్పెంత?' అని ధీమాగా అప్పు చేశాడు. సొమ్ము చేతిలోకి రాగానే కామేశ్వరమ్మ 'పిల్ల పెళ్ళి చేసేద్దామండీ!' అంటూ పట్టు బట్టి కూచుంది. ఆలోచించగా భార్య సలహాలో తర్కం ఉందని ఆయనకు అనిపించింది. డబ్బు ప్రవాహంలాంటిది. అది నిలకడగా ఉండదు. ఉన్నది కాస్తా కరిగిపోతే, ఆ తర్వాత కిరణ్మయి పెళ్ళి చేయడం తనకు వీలవుతుందా? 'ఉహూ కాదు' అనుకుని ఆ వచ్చిన డబ్బులో పెద్ద మొత్తమే ఖర్చు చేసి ఉన్న ఒక్కగానొక్క పిల్ల పెళ్ళినీ ఘనంగా జరిపించాడు. మిగిలిన డబ్బు శివశంకరం చదువుకు సరిపోలేదు. ప్రావిడెంటు ఫండులో లోన్ తీసుకున్నాడు. రిటైరైన తర్వాత పెన్షన్‌లో మూడో వంతు ముందుగా తీసుకుని, కొడుకు చదువును ఓ గట్టెక్కించాడు.

శివశంకరానికి ఉద్యోగం రావడం రెండేళ్లు ఆలస్యం అయింది. కుటుంబరావుకు ప్రశాంతత కరువైంది. ఇంట్లో ఖర్చు లెక్కువయ్యాయి. ఇంటి మీద తెచ్చిన అప్పు తీర్చవలసిన గడువు దగ్గర పడుతోంది. రెండు రోజుల క్రితం తాకట్ల తమ్మయ్య రైతుబజారు దగ్గర కనిపించాడు. రిటైరయినప్పట్నుంచీ పొద్దున్నే పాలూ, ఎనిమిదింటికి కూరలు తీసుకురావడం కుటుంబరావు అలవాటుగా మార్చుకున్నాడు. ఎనిమిదింటికి కూరగాయల దగ్గర తమ్మయ్య కంటపడ్డాడు.

కుశల ప్రశ్నలైన తర్వాత తమ్మయ్య సూటిగా అడిగేశాడు, "కుటుంబరావు గారూ, టైం దగ్గర కొస్తోంది కదా? ఇల్లు ఇచ్చేద్దామనుకున్నారా? అప్పు తీరుద్దామనుకుంటున్నారా?"

"అప్పు తీరుద్దామనుకుంటున్నా" కుటుంబరావు తలదించుకుని సమాధానం చెప్పాడు. "అది మేమంతా కాపురం ఉంటున్న ఇల్లయ్యా!"

"తెలుసు. ఆ ఇంట్లోనే మీ ఇద్దరు పిల్లలూ పుట్టారు. ఆ ఇంట్లోనే మీ అమ్మాయికి పెళ్ళి జరిపించారు. ఆ ఇంట్లోనే పెరిగి పెద్దవాడై మీ అబ్బాయి పెళ్ళి చేసుకుని ఉద్యోగానికి వచ్చాడు. అన్నీ తెలుసు నాకు. ఒకవేళ మీరు డబ్బు కట్టలేకపోతే, అది పాత ఇల్లయినా సరే, అప్పు కింద జమ వేసేసుకుని మిమ్మల్ని రుణ విముక్తుణ్ని చేయడానికి నాకేం అభ్యంతరం లేదు!" అన్నాడు తమ్మయ్య నిష్కర్షగా.

"ఇంకా గడువుందిగా! మళ్లీ కలుస్తాను!" కూరలు తీసుకుని కుటుంబరావు ఇంటికి వచ్చేశాడు.

కొడుకుతో చెబుదామని ఒకటి రెండు సార్లు ప్రయత్నం చేశాడు. కుదరలేదు. ఎప్పుడు చూసినా శివశంకరం, కోడలు పిల్లా కలిసే ఉంటున్నారు. లేచింది మొదలు వాడు ఆఫీసుకు వెళ్లేదాకా ఒకటే వికవికలూ, పకపకలూ. ఆఫీసు నుంచి శివుడు వచ్చేసింతర్వాత ఇద్దరూ షికారుకు వెళతారు. షికారు నుండి వచ్చింతర్వాత

## కొత్తగాలి...

**పిల్లలా వాళ్లు?**
**రిటైర్మెంట్ డబ్బు**
**దోచుకెళ్లేరు**
**ఇప్పుడు పెన్షన్**
**లాక్కోబోతున్నారు**

– మరో భారతీయుడు

అన్నాలు తిని గదిలో దూర తారు. లోగడ తనూ, శివుడూ కలసి భోజనం చేసేవారు. ఇప్పుడు ఆ అలవాటు తప్పింది. తనూ, కామేశ్వరీ కలిసి తింటున్నారు. నిస్పృహా యుడై, కష్టాన్ని భార్యతో చెప్పుకున్నాడు.

"పిల్ల పెళ్ళికి తొందరపడక పోతే, ఇప్పుడీ ఉపద్రవం ముంచుకు వచ్చేది కాదు? "

"బావుంది. ఇది ఓ తండ్రి చెప్పవలసిన మాటేనా? అట్లా చేశాం కనుక ఒడ్డున పడ్డాం. లేకపోతే డబ్బ్బా ఖర్చైపో యేది. ఇటు కిరణ్మయి కూడా గుండెల మీద కుంపటిగా ఇంట్లో కూర్చుండిపోయేది!"

"సరే. పిల్ల పెళ్ళి చేశాం. బావుంది. మరి ఇప్పుడు ఈ ముప్పును ఎట్లా తప్పించుకో వడం? ఏది పరిష్కారం!"

"కన్నవాడే మనకో దారి చూపించాలి. వాడేకదా మనకు ఆధారం!"

"వాడు నాకు దొరకటం లేదే- ఎప్పుడు చూసినా, కోడలు పిల్లా, వాడూ... "

"అదీ ఇబ్బందేనా? రాత్రికి కోడలూ నేనూ భోజనాలు తర్వాత చేస్తాం. మీకూ వాడికీ ముందు వడ్డిస్తాను. తింటూ మాట్లాడుకోండి!"

"ఇంటి గుట్టు కోడలికి తెలిసిపోతుందే మోనే!"

"తెలిస్తేనే మంచిది. తర్వాత తెలిస్తే నానా రభసా అవుతుంది? "

కామేశ్వరమ్మ తన ప్లాన్‌ను ఆచరణలో



పెట్టింది. సుజాత, భర్తతో కలిసి భోజనా నికి కూర్చోబోతుంటే, "అమ్మాయి! కొంచెం సేపాగమ్మా, నువ్వూ నేను తిందాం! వాళ్ళి ద్దర్నీ తిననీ!" అంటూ సుజాతను వారిం చింది కామేశ్వరమ్మ.

అట్లా మాట్లాడడం శివశంకరానికి కూడా ఆశ్చర్యమనిపించింది. భార్యకు కళ్ళ తోనే సంజ్ఞ చేశాడు, 'ఏమనుకోవద్దు' అని. భోజనం మధ్యలో కుటుంబరావు అతనికి తమ ముందున్న సమస్యను చెప్పాడు.

"తాకట్లు తమ్మయ్య సంగతి తెలుసుకదా నీకు. మర్చెంట్ ఆఫ్ వెనీసులో షైలాక్



కనుక్కో! పర్సనల్ లోన్!"

"కుదర్దండీ!"

కుటుంబరావుకు కొడుకు కంఠం కరుగ్గా వినిపించింది. తెల్లబోయాడు. కొడుకు తనతో ఎప్పుడూ ఇట్లా మాట్లాడలేదు. పెళ్లి మహిమా?

"సరే చేసేదేముంది? నా తిప్పలు నేను పడతాన్లే! ఇల్లు వదలుకోలేము కదా? "

ఇద్దరూ ఎడమొహం పెడమొహాలుగా భోజనాల ముందు నుంచి లేచారు. శివశంకరం అంత కరుగ్గా మాట్లాడడానికి కూడా ఓ కారణం ఉంది. తండ్రితో చెప్పుకోలేని కారణం! అమ్మక్కూడా తెలియని కారణం. సుజాతకు ఇంత వరకూ అతను చెప్పని విషయం.

నయం వాడికన్నా!"

"తెలిసి తెలిసి మరి వాడి దగ్గర ఎందుకు తీసుకున్నారు డబ్బు? "

"ఆ ప్రశ్న నువ్వు చదువుకుంటున్నప్పుడు వేయవలసింది? "

మాటలు దారి మళ్లుతున్నాయని గ్రహించి కామేశ్వరమ్మ కల్పించుకుంది.

"అది కాదురా శివా! అవసరానికి అతను ఆదుకున్నాడు. మీ నాన్నగారు తెచ్చారు. అడిగినప్పుడు ఇవ్వకపోతామా? అన్న ధైర్యంతో. ఇప్పుడతను అడుగుతున్నాడు. ఎట్లాగో అట్లా ఇచ్చేయడానికి మార్గం ఆలోచించు!"

"ఉద్యోగం చేస్తున్నావు కదుటోయ్- ఏ బ్యాంకులోనన్నా లోన్ ఇస్తారేమో

అదే విషయం మళ్లీ పడకటింట్లో ఆ కొత్త దంపతుల మధ్య ప్రస్తావనకు వచ్చింది. "ఇది మన ఇల్లు కూడా కదండీ! మావగార్ని ఒక్కర్నీ ఈ బరువు మోయమనడం సరికాదేమో, ఆలోచించండి!"

"ఏం ఆలోచించినా, ఈ బరువు నేను మోయలేను. మార్గాంతరం ఉంటే చెప్పు వింటాను!" అన్నాడు విసుగ్గా.

"మీ బావగారు, మీ అక్కయ్యగారి ద్వారా డబ్బు తీసుకున్నప్పుడు మీరు కూడా మీ మామగారి ద్వారా అదేపని చేయవచ్చు కదా? "

"అంటే? "

"ఇద్దరం మానాన్నగారి దగ్గరకు వెళ్దాం. ఇక్కడి పరిస్థితులు ఆయనకు తెలిసినవేగా! సాయం చేయమని అడుగుదాం!"

శివశంకరం పేలవంగా నవ్వాడు.

"కట్నమే ఇవ్వలేకపోయారాయన. ఇప్పుడు డబ్బు సర్ది సాయం చేయమని అడిగి, ఆయనను ఇబ్బంది పెట్టకూడదు మనం!"

"అప్పుడు కట్నం ఇవ్వలేదు కనుకే ఇప్పుడు సాయం చేయమని కోరడం!"

"సరే-నువ్వు చెప్పినట్లే చేద్దాంలే! ఒకటి రెండు రోజుల్లో వెళ్దాం!"

ఆఫీసుకు వెళ్లేసరికి మరో ఉపద్రవం

కొత్తగాలి...

**వందే**
**మాతరం**
**మందే**
**ఈ తరం**

– బద్ది నాగేశ్వరరావు,
అనకాపల్లి

వచ్చి పడింది శివశంకరం మీద. గ్యారంటర్ సంతకాలు పెట్టిన కిరీటి, సౌజన్య రావులిద్దరూ అతని సీటు దగ్గరకు వచ్చారు. "ఒకసారి టీ తాగివద్దాం రారా!" అంటూ క్యాంటీనుకు తీసుకువెళ్లారు. టీ తాగుతుండగా అడిగారు. "ఏరా, నువ్వు ఇన్‌స్టాల్‌మెంట్స్ సరిగా కడుతున్నావా?"

ఆ ప్రశ్న విన్న శివశంకరం గిల్టీగా ఫీలయ్యాడు. "లేదురా, బకాయి పడ్డాను"

కిరిటీ అన్నాడు, "లోన్ తీసుకున్నది నువ్వు. నోటీసులు వచ్చింది మాకు"

శివశంకరం తలెత్తి అతని కళ్ళలోకి సూటిగా చూడలేకపోయాడు. సౌజన్యరావు అన్నాడు, "నీ ఎకౌంటు క్లోజ్ చేశారట! నువ్వు ఆ లోన్ ఎకౌంటు అంతా ఒక్కసారే ఇప్పుడు కట్టాలట! నువ్వు కట్టకపోతే, ఆ సొమ్మును మాచేత కట్టించుకుంటామని మాకు నోటీసులు పంపారు. నువ్వు ఎట్లాగైనా సరే, ఆ లోన్ క్లోజ్ చేసెయ్యరా! లేకపోతే నీకు గ్యారంటీ ఉన్నందుకు మా కుటుంబాల్లో గొడవలు వస్తాయి. కట్టెయ్యరా, ప్లీజ్!"

శివశంకరానికి తను పాతాళంలోకి పడిపోతున్నట్లుగా అనిపిస్తోంది. ఏం చెప్పలేకపోయాడు. గుండె బరువుగా కొట్టుకుంటోంది.

"అట్లాగే!" అంటూ టేబుల్ ముందు నుంచి లేచి, క్యాంటీనులో నుంచి బయటకు వచ్చేశాడు. వెళ్ళి తన సీట్లో కూర్చోవాలనిపించలేదు. హాఫ్ డే సెలవు పెట్టి ఇంటికి వచ్చేశాడు. ఎప్పుడూ అట్లా రాని కొడుకును చూసి కంగారుపడ్డ కామేశ్వరమ్మ, "ఏమైంది నాన్నా- ఏమైంది?" అంటూ అంగలార్చింది.

"ఏమీ లేదమ్మా, తలకాయ నొప్పిగా ఉంటే, ఇంటికొచ్చేశాను" అన్నాడు శివశంకరం, ప్రశాంతంగా కనిపించటానికి ప్రయత్నం చేస్తూ. ఇంకా తల్లిముందే ఉంటే, ఎక్కడ తను అసలు విషయాన్ని కక్కేస్తానో అని, తన పడగ్గదిలోకి దూరి తలుపులు దగ్గరగా వేసుకున్నాడు.

కామేశ్వరమ్మ బాధపడుతూ సుజాతతో అంది "వాడికి ఏం కావాలో చూడమ్మా! తలనొప్పితో అల్లాడిపోతున్నాడు. అమృతాంజనమో, ఏదో రాయి. కాఫీ గట్రా ఇయ్యి!"

సుజాత కూడా కంగారుపడుతూ లోపలకు వెళ్ళింది. కానీ భర్తను చూడగానే అది తలనొప్పి కాదని ఇట్టే గ్రహించింది. "కాఫీ ఇవ్వనా?"

"వద్దు"

"అమృతాంజనం రాయనా?"

"వద్దు!"

"కణతలు పట్టనా? "

"వద్దు"

దగ్గరకు వచ్చి లాలనగా అంది, "పోనీ ఓ ముద్దు పెట్టనా? "

"వద్దు"

ఆమె నుదురు చిట్లించింది. కళ్లు చికిలించింది. "ఏమిటి సంగతి? " అని అడిగింది సీరియస్‌గా.

'చెప్పాలా, వద్దా' అని శివశంకరం కాసేపు తటపటాయించాడు. తను చేసిన పని, అమ్మకూ నాన్నకూ చెప్పేది కాదు. సుజాత కోసం చేశాడు అట్లా! అందుచేత సుజాత తెలుసుకుంటేనే మంచిది అనుకున్నాడు. వింటే సుజాత ఏదన్నా పరిష్కారం సూచిస్తుందేమోనని ఆశపడ్డాడు.

చెప్పిందంతా సుజాత సావధానంగా వింది. "నా కోసం అప్పు చేశారు. థ్యాంక్యూ! కానీ ఆ అప్పును నేను తీరుస్తాననుకున్నారా? లేక మీరు తీర్చాలనుకుంటున్నారా? "

"నేనే తీరుస్తాను!"

"ఎట్లా తీరుస్తారు!"

"అదే తెలియడం లేదు!" శివశంకరం తలపట్టుకున్నాడు.

ఈ లోపల కామేశ్వరమ్మ బైట నుండి అడుగుతోంది, "ఎట్లా వుందమ్మా అబ్బాయికి? "

"బాగానే ఉందండీ! తగ్గిపోయింది!" సుజాత లోపల్నుండే సమాధానం చెప్పింది. అత్తగారికి మంద్రస్థాయిలో సమాధానం చెప్పి, భర్తతో అధికార స్వరంతో అంది, "పరిష్కారం చెబుతాను. చెప్పినట్టు చేస్తారా? "

శివశంకరం తల పంకించాడు.

"రేపు ఇద్దరం మా పుట్టింటికి వెళ్తున్నాం! అక్కడ కొంత డబ్బు ఇప్పిస్తాను. ఆ డబ్బును బ్యాంకులో కట్టి కొంత టైం తీసుకోండి. అట్లా చేస్తే బరువూ తగ్గుతుంది, పరువూ నిలుస్తుంది"

"రెండోది కూడా ఏదైనా ఉందా? "

"మీకిష్టం ఉన్నా, లేకున్నా ఇదే అదును. మీరు ట్రాన్స్‌ఫరు చేయించుకోండి!"

"ఈ సమయంలో ట్రాన్స్‌ఫరా? "

"ఇదే సరియైన సమయం! మీకు అర్థం కాదు. మనం ఊళ్ళో లేకపోతే, ఒత్తిడి తగ్గుతుంది"

"నా ఫ్రెండ్స్ ఊళ్ళోనే ఉన్నారుగా!"

"అందుకనే.. మీ మీద ఒత్తిడి ఉండదు. ఆ బ్యాంకు వాళ్ళకు మీ ఫ్రెండ్స్ ఎదురుగా కనిపిస్తుంటారు. వాళ్ళను అడుగుతుంటారు. మీ ఫ్రెండ్స్ మిమ్మల్ని అడుగుతుంటారు. ఇదిగో, అదిగో అని మీ టైం మీరు తీసుకోవచ్చు. కాలం అనుకూలించగానే కట్టేయవచ్చు!"

సుజాత ఆడ చాణక్యునిలాగా కన్పిస్తోంది శివశంకరానికి. ఆమెకు అందం ఉంది. ఆ అందం అసాధారణమైంది. ఆమెలో తెలివితేటలున్నాయి. మీదపడే కారుమేఘాన్ని దూరతీరాలకు తరిమి వేయగల తెలివితేటలు!

ఇంకొక్క సందేహం ఉండిపోయింది శివశంకరం మనస్సులో. "ఇప్పుడు ట్రాన్స్‌ఫర్ చేయించుకుంటే, మా నాన్నగారు ఒంటరి వారైపోరూ? "

సుజాతకు అతని తెలివితక్కువతనానికి జాలివేసింది. "అయ్యా! మహానుభావా! ఇప్పుడు రంగంలో నుండి తమరు తప్పుకోకుంటే, మీ బతుకంతా గానుగెద్దు బతుకైపోతుంది. బరువులు మోస్తూ, పడుతూ, లేస్తూ, మున్సిపాల్టీ ఎద్దులా, చెత్తకుండీల చుట్టూ తిరగాల్సి వస్తుంది. మనకు వెన్నెలుండదు, సంగీతం ఉండదు, సరసాలు, శృంగారానుభవాలు ఉండవు. మన పిల్లలకు మహారాజయోగం ఉండదు. నేనూ మీరు కలుసున్నా, మన మధ్య హాస్యోక్తుల

కన్నా, రోగాల గురించి, రొష్టుల గురించి మాట్లాడుకోవడమే ఉంటుంది. నాలో ఉన్న ఈ సౌందర్యపు కళ, కృష్ణపక్షంలో లాగా తరిగిపోతూ ఉంటుంది. మీకు తొందరగా ముసలితనం వస్తుంది. డబ్బు గురించిన బాధాకరమైన ఆలోచనలతో జీవితానికున్న అర్థాన్నే మనం కోల్పోతాం. అందుకని నా మాట వినండి. ఇక్క ణ్నుంచి వెళ్ళిపోదాం. మనకు మాత్రమే చోటుండే ఓ కొత్త స్వర్గాన్ని నిర్మించు కుందాం!"

సుజాత చేసిన జ్ఞానబోధ శివశంక రాన్ని సందేహ రహితుణ్ని చేసింది.

"ఓకే! కరణేషు మంత్రీ అన్నారుగా! ఇప్పుడు నువ్వు నా మంత్రివి. ట్రాన్స్‌ఫరు కోసం బాస్‌ను ఎట్లా కాకాపట్టడమో కూడా చెప్పి పుణ్యం కట్టుకో" అన్నాడు భక్తుడిలా ఫోజు పెట్టి.

"వెరీ సింపుల్! డబ్బుకు లోకం దాసోహం! ఆయన ఖరీదెంతో తెలుసు కుని, అది సమర్పించండి, మూడో కంటివా డికి తెలియకుండా!"

"అందుకు మన దగ్గర విటమిన్ 'ఎం' ఉండాలే!"

"నా మెళ్ళో రెండుపేటల గొలుసుంది. చేతులకు జత గాజులున్నాయి. ఇవి చాలవా? "

శివశంకరానికి ఈసారి నిజంగానే భార్య మీద అపారమైన గౌరవం కలిగింది.

"ఆడవాళ్ళకు బంగారం అంటే ప్రాణం కంటే కూడా ఎక్కువ ఇష్టమంటారు. నీకు ఆ వ్యామోహం కూడా లేదా? "

"ఎందుకు లేదూ? ఏడు వారాల నగలు నాకు కావాలని ఉంటుంది. కానీ అంతకు ముందు, నా భర్త ఈ ఊబిలో నుంచి బయటపడాలని ఉంది. అందుకు నేను చేసే ఉడత సాయం నేను చేయాలిగా? "

"నువ్వు ఉడతవు కాదు సుజీ! నా పాలిట అదృష్ట దేవతవు!"

ఆ విధంగా భార్యా శిష్యుడై గొలుసునూ, గాజుల్నీ డబ్బుగా మార్చుకుని పండ్లతో, స్వీట్స్‌తో బాస్ దర్శనం చేసుకున్నాడు. కన్నీళ్లతో కల్లబొల్లి మాటలు చెప్పి ఆయ నను ఆకట్టుకుని మరో ఊరికి ట్రాన్స్‌ఫర్ ఆర్డర్స్‌ను చేయించుకున్నాడు.

కన్న తల్లిదండ్రుల్ని విడిచి, కలిసి తిరి గిన స్నేహితుల్ని విడిచి, పుట్టి పెరిగిన పెంకుటింటిని విడచి, కట్టుకున్న ఇల్లాలితో కలిసి దూరంగా వెళ్ళిపోవటానికి ముహూర్తం పెట్టుకున్నాడు శివశంకరం.

"మీ నాన్నగారికి ఈ ట్రాన్స్‌ఫర్ విషయం చెప్పేముందు మనం ఒకసారి మానాన్నగారింటికి వెళ్లి వద్దాం."

"ఇప్పుడా, నీమెళ్లో మంగళసూత్రం తప్ప మరేం లేదు. చేతులకు మట్టిగాజులు తప్ప, మరేంలేవు. వెళ్తే నన్ను చులనకగా చూస్తారేమో, పెళ్లాం సొమ్ము కరిగించుకు తింటున్నానని!" శివశంకరం గొంతు గీర పోయింది.

"ఇప్పుడే వెళ్లాలి, ఇట్లాగే వెళ్లాలి!" అంది సుజాత, ఇంకేం చెప్ప వద్దన్నట్లు. అత్తగా రింట్లో తను బంగారం లేకుండా బోసిమె డతో, ఒట్టి చేతులతో ఉన్న విషయాన్ని దాచిపెట్టి, అత్తగారు కనిపెట్టకుండా మ్యానేజ్ చేసింది.

## కొత్తగాలి...



**ఆయన ఎంతోమందికి**
**గాడ్ ఫాదర్**
**ఇంట్లోవారికి మాత్రం**
**బ్యాడ్ ఫాదర్**

– పి. కార్తీక్ సాయిరామ్,
హైదరాబాద్

పుట్టింట్లో అవి లేని విషయాన్ని బహిర్గతం చేసి, పార్వతమ్మ దగ్గర కంటనీరు పెట్టుకుంది. బిడ్డ కన్నీరు చూసి ఆ తల్లి మనసు విలవిల్లాడింది.

"ఏవిటి తల్లీ ఇది? నీ సొమ్ములు కరిగించుకుని తినవలసినంత ఖర్మ పట్టిందా ఆ ఇంట్లో? " పార్వతమ్మ ఛీ కొట్టింది.

"అమ్మా! మా ఆయనన్నేం అనకు. మా మావగారు మీకు ముందే చెప్పారు కదా, తమ ఇల్లు తాకట్లో ఉందని! తాకట్టు పెట్టుకున్నతను బాకీ తీరుస్తావా, చస్తావా అని తగవుకు దిగాడు. మా ఆయనా, మావగారూ మాటపడే మనుషులు కాదమ్మా! అందుకని మా అత్తగారి నగలూ, నా దగ్గరున్న బంగారమూ, అన్నీ అమ్మేసి, ఎట్లాగైతే ఏం ఆ గండం నుండి బయటపడ్డాం. ఇంతలో ఈ ట్రాన్స్‌ఫరొకటి వచ్చిపడ్డది. వెళ్లేముందు మీకు కనబడిపోదామని వచ్చాం!"

పార్వతమ్మ బాధపడుతూనే కూతురుకు తమమీద ఉన్న ప్రేమకు సంతోషించింది.

ఆ సాయంకాలం, తండ్రీ-తల్లీ హాల్లో కూర్చుని, కుటుంబరావు-కామేశ్వరమ్మలను గూర్చి మాట్లాడుకొంటూండగా, అవతల గదిలో శివశంకరం నిద్ర నటిస్తుండగా సుజాత తన పథకాన్ని బయటపెట్టింది.

"నాన్నగారూ! ఒక విషయం చెప్పండి. మీ అల్లుడిగారి మంచితనం మూలంగానే కదా, ఏ శ్రమ లేకుండా మీరు నా పెళ్లి చెయ్యగలిగింది."

"అందులో సందేహం ఏముందమ్మా? " అన్నాడాయన కృతజ్ఞత ధ్వనిస్తుండగా.

"సపోజ్! అట్లా జరగలేదనుకోండి! అప్పుడు ఎంతో కొంత కట్నం మీరు ఇచ్చి ఉండేవారు కదా? "

"తప్పుతుందా తల్లీ!"

"అప్పుడు మీరెంతకు ప్రిపేర్ అయ్యారు? "

"ఎంతమ్మా- ఓ లక్ష దాటకుండా ఇద్దామనుకున్నాను!"

సుజాత ఒకింతసేపు మౌనంగా ఊరుకుంది. "అదిప్పుడు ఇచ్చేయకూడదూ? "

సీతారామయ్య ఉలిక్కిపడ్డాడు. పార్వతమ్మవేపు చూశాడు, 'నువ్వు, మాట్లాడవేం? ' అన్నట్లుగా..

సుజాత కూడా తల్లివేపు చూసింది. "చెప్పవే అమ్మా!"

పార్వతమ్మ లోపలకు వెళ్లి జంతికలు తెచ్చి భర్తపక్కన పెట్టింది. కాఫీ ఇచ్చింది. "సుజీ చెప్పిందాంట్లో ఔచిత్యం ఉంది కదండీ! దానికి ఇవ్వదల్చుకుంది దానికి చేస్తే మనకూ బావుంటుంది కదండీ! పైగా ఇప్పుడు దాని సొమ్ముల్ని ఆ కుటుంబరావుగారూ, దీని మొగుడూ ఇంటి ఖర్చుల కోసం వాడేసుకున్నారు. పిల్ల చూడండి, ఎట్లా బోసిమెడతో దీనంగా కనిపిస్తోందో!"

సుజాత మెడచుట్టూ తిప్పుకున్న పమిట చెంగును కిందకు జార్చేసి, తన బోసి మెడను ప్రస్ఫుటంగా తండ్రికి చూపించింది. చేతుల్ని కిందకు జార్చి, వేసుకున్న మట్టి గాజుల్ని కూడా ఆ తండ్రి చూసేట్లు చేసింది.

సీతారామయ్య "ఛీ! ఛీ" అన్నాడు.

"కోడలు నగలు వాడుకుంటాడా? ఎంత నీచం? ఎంత నీచం? " అన్నాడు ప్రకాశంగా.

"నీచం ఏముంది నాన్నగారూ! నేను ఆ ఇంటి మనిషిని అయినప్పుడు నా సొమ్ములు ఆ ఇంటి సొమ్ములు కావా!" అంది సుజాత, గదిలో ఉన్న శివశంకరానికి వినిపించేట్లు!

ఆ మాటలు విన్న శివశంకరం 'భేష్! భలేగా మాట్లాడావోయ్!' అనుకున్నాడు తనలోతాను.

"ఎట్లాగో అట్లా డబ్బు సర్దుబాటు చేసి

ఇస్తాననుకో, మళ్లీ ఆ సొమ్మును కూడా వాడుకోరని గ్యారంటీ ఏముందీ? "

సుజాత, ఆ మాటను తాను ఒప్పుకోనన్నట్లుగా తల అడ్డంగా తిప్పింది.

"మాకు ట్రాన్స్‌ఫరైంది. వేరే వూరికి వెళ్లిపోతున్నాం. అంచేత మీ వియ్యంకుడిగారికి మేము అందుబాటులో ఉండం. మా తిప్పలేవో మావి. మా సంపాదన మాది. అందుకనే మీరిచ్చేదేదో ఇస్తే, నేను డైమండ్ నెక్లెస్ కొనుక్కుంటాను. మా ఆయన ప్రిస్టేజ్‌కి అది తగినట్లుగా ఉంటుంది!"

ఆ మాటలు విన్న శివశంకరం మరోసారి ఉలిక్కిపడ్డాడు. 'సుజాత! రియల్లీ యూఆర్ ఏ జీనియస్! మా అక్కయ్య డైమండ్ నెక్లెసు కొందని ఇట్లా మంత్రాంగం వేశావా!' అనుకున్నాడు.

ఏవైపుగా ఆలోచించినా సుజాతకు ఆ డబ్బిచ్చేసి తను తన కర్తవ్యాన్ని పూర్తిచేయడమే మంచిదనుకున్నాడు సీతారామయ్య. అడిగిన డబ్బిచ్చేశాడు. సుజాత డైమండ్ నెక్లెస్ కొనుక్కుంది.

కొనుక్కుని కిరణ్మయికి ఫోను చేసింది. "వదినగారూ! మీకో శుభవార్త!"

"ఏమిటి? నెల తప్పావా! కంగ్రాట్స్!" కిరణ్మయి గొంతులో చిలిపిదనంతో కలిసిన ఆనందం.

"అబ్బా! అది కాదండీ! నేను కూడా డైమండ్ నెక్లెస్ కొనుక్కున్నాను!"

"ఏవిటి? మానాన్న దగ్గర అంత డబ్బుందా? "

"మామయ్యగారు కాదు!"

"మరెవరు కొనిపెట్టారు? నా తమ్ముడా! వెధవ- నిన్న మొన్న ఉద్యోగంలో చేరాడు. అప్పుడే అంత సంపాయించేశాడా? "

"మీ తమ్ముడు కాదు- మానాన్నగారు!!"

"పోన్లే! కట్టుకున్న వాళ్లకన్నా కన్నవాళ్లే నయమనిపిస్తున్నారు. నీకు మీనాన్న, నాకు మా నాన్న- సరిపోయింది!"

సుజాత ఆమె మాటలకు సంతోషించింది. తర్వాత ఆ ఇద్దరూ ఇంకా ఏమేం నగలు కొనుక్కోవాలో మాట్లాడుకున్నారు.

"మాకు ట్రాన్స్‌ఫరైంది" అంటూ ఏ ఊరికైంది.. ఎప్పుడు వెళ్తున్నారు.. అన్నీ కిరణ్మయితో వివరంగా చెప్పి ఫోన్ పెట్టేసింది సుజాత.

తన డైమండ్ నెక్లెస్ విషయం తన ఆడబిడ్డకు కూడా తెలియపర్చిన తర్వాత సుజాత మనసు బాగా తేలికపడింది. శివశంకరంతో సంతోషంగా రకరకాల సంగతుల్ని మాట్లాడటం మొదలుపెట్టింది. వింటూ, వింటూ మాటల మధ్యలో శివశంకరం అన్నాడు "అంతా బాగానే వుంది కానీ, నీ నెక్లెస్ కోసం నన్నూ, మా నాన్నగార్నీ ఎందుకంత చులకన చేశావు? "

"చేస్తే మాత్రం నష్టం ఏమిటట? లక్ష రూపాయలొచ్చాయి"




**కొ**డుకు ఉద్యోగం బదిలీ సంగతి తెలుసుకున్న కుటుంబరావు దంపతులు కుప్పకూలిపోయారు. కామేశ్వరమ్మయితే రెండు రోజులు అన్నమే తినలేదు. ఇద్దరూ శివశంకరాన్ని బతిమాలాడారు. ట్రాన్స్‌ఫర్ కాన్సిల్ చేయించుకోమని. "ఇప్పుడు నాకు ప్రమోషన్ వచ్చే టైం నాన్నగారు. కాన్సిల్ చేయించుకుంటే సీనియారిటీ లిస్టులో నేను

వెనకబడిపోతాను"

కుటుంబరావుకు తన కొడుకు చెబుతున్నది ఓ కుంటిసాకన్న సంగతి అర్థమైపోయింది. వాడికి ట్రాన్స్‌ఫర్ కావాలి.

బహుశా కోడలు ఈ పాత కొంపలో ఉండలేకపోతోందేమో! ముసలివాళ్ల మధ్య వాళ్ల పడుచుదనం రైలుబండి పరుగెత్తలేక పోతోందేమో! వాళ్ల సామాన్లు సర్దుకుంటుంటే జాలిగా అన్నాడు. "ఒరేయ్! శివుడూ- ఈ ముసలితనంలో నాకు నీ ఆసరా కావాల్రా!"

శివశంకరం తండ్రివైపు అభావంగా చూశాడు. "కాకిచేత కబురంపినా నేను మీ ముందుంటాను నాన్నగారూ! అయినా అమ్మకన్నా ఇంకెవరు మాత్రం మీకెక్కువ ఆసరా ఇయ్యగలరూ? "

"ఆర్థికంగా మీ అమ్మేం ఆసరా ఇవ్వగలదురా? "

"నేను మాత్రం పెద్దగా ఏం సాయం చేయగలనూ? రెక్కల కష్టంతో బతుకుతున్నవాణ్ణి"

కామేశ్వరమ్మ కోడలివేపు చూసింది. సుజాత మెళ్లో డైమండ్ నెక్లెస్ ధగధగా మెరిసిపోతోంది. కొత్తగా కొనుక్కున్న గొలుసు, లాకెట్ ఉన్న నల్లపూసల తాడూ, చేతికి రెండు జతల రాళ్లగాజులూ ఆమెలో ఉన్న లక్ష్మీకళను సాక్షాత్కరింపజేస్తున్నాయి.

"ఇవన్నీ మా నాన్నగారు పెట్టారు" అంది సుజాత కించిత్ గర్వంతో.

"పోన్లేమ్మా! ఇటు మామగారో, అటు తండ్రో ఎవరో ఒకరు అండగా ఉంటే, ఇహ ఆడదానికి ఏ కష్టమూ ఉండదు" అంది కామేశ్వరమ్మ.

అది ప్రశంసో, నిష్ఠూరమో తెలియ లేదు. కొడుకూ కోడలూ సామాన్లు ప్యాక్ చేయించి, తాము విడిగా వెళ్లేరోజున, ఆ వృద్ధ దంపతులు కన్నీరాపుకోలేకపోయారు. కామేశ్వరమ్మను, నెత్తిమీద చెయ్యి వేసి కుటుంబరావు ఓదార్చాడు.

"ఒరేయ్ కాముడూ! పక్షులు గుడ్లు పెట్టి, పొదిగి, పిల్లలు పెద్దవై ఎగిరిపోతుంటే.. చూసి, రెక్కలు తపతప కొట్టుకుంటూ సంతోషపడతాయి. పశువులూ అంతే! చిన్నప్పుడే ఆహారం పెడతాయి. ఆ తర్వాత ఆ చిన్నవీ వాటి దారి అవి వెతుక్కుంటుంటే, ఏం పట్టించుకోకుండా ఊరుకుంటాయి. మనుష్యుల్లోనే ఈ అనుబంధాలూ, ఆప్యాయతలూ, అనురాగాలూ, వగైరా వగైరా! కోడలు పిల్లకు విడిగా ఉందామనిపించి ఉంటుంది. వాడూ సరేనని ఉంటాడు. ఈ ట్రాన్స్‌ఫర్ ఓ మిష! భరించాలి తప్పదు!"

కామేశ్వరమ్మ గయ్‌మని లేచింది. "ఏం భరిస్తారు? ఒకపక్క తాకట్ల తమ్మయ్య.. పెచ్చులూడి వస్తున్న తాతలనాటి ఇల్లు.. మరొక పక్క శుక్లాలు పెరిగిన కళ్లు.. మొరాయిస్తున్న కాళ్లు.. ఊరు పొమ్మంటోంది, కాడు రమ్మంటోంది. ఇప్పుడే కదండీ పిల్లల అవసరం.. ఈ సమయంలో పరాయి ఊరికి పెళ్లాం కొంగు పట్టుకుపోతాడా భ్రాష్టుడు!"

కామేశ్వరమ్మ నోటిని గబాలున తన చేత్తో మూసేశాడు కుటుంబరావు.

"వద్దు.. వద్దు.. అట్లా అనకు. దేవతల దీవెన కన్నా బలమైంది తల్లి దీవెన! ఎంత చెడ్డా వాడు మన కొడుకు!! ఆ పిల్ల మన వంశాన్ని నిలబెట్టడానికి వచ్చిన దేవత!!"

"ఆహా! దేవత..!" మూతి మూడు వంకర్లు తిప్పి కామేశ్వరమ్మ లోపలకు వెళ్లిపోయింది.

★ ★ ★

మధ్యాహ్నం, భర్తకోసం ఎదురుచూస్తూ జెమినీటీవీలో వస్తున్న 'ఆనందం' సీరియల్ చూస్తూ నిముషాలు లెక్కపెడుతున్న సుజాతకు వాకిట్లో స్కూటర్ మోత

వినిపించి, 'హమ్మయ్య ఆయనొచ్చేశారు!' అనుకుంటూ తలుపు తీసేసరికి ఎదురుగ్గా విషణ్ణవదనంతో నిలబడ్డ శివశంకరం కనిపించాడు. అంతవరకూ గతకాలాన్ని నెమరువేసుకుంటున్న ఆమెకు ఎన్నడూ లేనంతగా అతడంత విషాదభరితంగా కనిపించడం భయకారణమైంది.

"ఏవండీ! ఏం జరిగింది? "

శివశంకరం ముందుగా ఏం చెప్పలేకపోయాడు. లోపలికి వచ్చి సోఫాలో కూలబడి ఓ గ్లాసు ఫ్రిజ్ వాటర్ తాగాడు. తర్వాత మెల్లగా అన్నాడు, "సుజీ! ఆ తమ్మయ్య ఇంటిని స్వాధీనం చేసుకున్నాట్ట!"

"ప్చ్. పోనిద్దురూ! పాతకొంప పోతే పోయింది. అందుకు ఇంత బాధపడుతున్నారేమిటీ? మావయ్యగారి గుండెల మీద బరువు ఈవిధంగా దిగిపోయినందుకు మీరు సంతోషపడాలి!" అంది సుజాత.

"ఇల్లు పోయి, ఇప్పుడు మా నాన్నా అమ్మా ఎక్కడున్నారో? "

"ఇదీ ఓ సమస్యేనా? వెళ్లి చూసొద్దాం!"

"కాదు, మన దగ్గరకు తీసుకొచ్చేద్దాం"

"అట్లాగే, మీరు తీసుకొస్తానంటే నేను కాదంటానా? " అందేకాని, ఆ కంఠంలో ఏదో లోపించినట్లనిపించింది అతనికి.

అన్నం పెట్టి, అతను తింటున్నంతసేపూ హుషారుగా కబుర్లు చెబుతూ, అతని విషాదాన్ని తగ్గించటానికి ప్రయత్నం చేస్తూనే వుంది సుజాత.

శివశంకరం మళ్లీ ఆఫీసుకు వెళ్లిపోయాడు. తర్వాత తీరిగ్గా కూచుని ఆలోచించుకుంటున్న సుజాతకు- అత్తమామల్ని తమ దగ్గరకు తీసుకురావడం మంచిదా? కాదా? అన్న ప్రశ్నకు సమాధానం దొరకలేదు. ప్రస్తుతం తన అత్త-మామలు వస్తారు. ఆ తర్వాత తన తల్లిదండ్రులు వస్తారు. వాళ్ళక్కూడా తను తప్ప మరెవ్వరూ లేరుకదా? అప్పుడు తన ఇల్లు ఒక అనాథశరణాలయంగా మారిపోతుంది. తామిద్దరూ ఆ ఇద్దరు ముసలి దంపతులకూ సేవచేస్తూనే కాలం గడపవలసి వస్తుంది. అందుకని ఏం చేయాలి? తీసుకు రావాలా? వద్దా?

'టు బి ఆర్ నాట్ టుబీ- దట్ ఈజ్ ది క్వశ్చన్? '

దీర్ఘాలోచనలో మునిగిపోయిన సుజాతకు మొదటిసారి ఫోన్ మోగితే వినిపించలేదు, రెండోసారి రిసీవ్ చేసుకుని మాట్లాడింది.

"మరదలు పిల్లా- నువ్వేనా? " అవతల కిరణ్మయి కంఠం.

"వదినగారూ మీరా? " సుజాత కంఠంలో ఆనందం.

"అమ్మాయ్! నీ డైమండ్ నెక్లెస్ చూట్టానికి వస్తున్నా!"

"మీరు కూడా డైమండ్ నెక్లెస్ పెట్టుకునే రండి. అప్పుడే కంపేర్ చేసుకోవచ్చు!" సుజాత మొహంలో ఓ గర్వరేఖ.

అక్క వస్తోందని తెలియగానే శివశంకరంలో కూడా ఓ నూతనోత్సాహం కలిగింది. స్టేషన్లో కిరణ్మయిని రిసీవ్ చేసుకున్నాడు. స్కూటర్ మీద ఎక్కించుకుని వస్తుంటే, కిరణ్మయి అడిగింది.

"ఇంకా స్కూటరేనా? ..కారెప్పుడు కొంటున్నావు? "

"సొంత ఇల్లే లేదు. కారు కూడానా? అన్నట్టు స్థలం రిజిస్టరు చేసుకున్నారా? ఇంటికి శంకుస్థాపన ఎప్పుడు? డాబా ఇల్లా? అప్‌స్టెయిర్ బిల్డింగా? ఏమనుకుంటున్నారు? "

ఈ ప్రశ్నలకు వేటికీ కిరణ్మయి ఉత్సాహంగా సమాధానం చెప్పలేదు. విని, మౌనంగా ఊరకుండిపోయింది. శివశంకరం కూడా ప్రశ్న అడిగాడే కానీ, మళ్లీ రెట్టించలేదు.

## సూతిమెత్తని మందలింపు!



శాంతినికేతన్‌కి ఒకసారి ఒక గాడిద వచ్చింది. పిల్లల్లో కోలాహలం చెలరేగింది. రవీంద్రనాథ్ టాగూర్ ఇది గమనించి ఇలా అన్నారట- 'ఈ గాడిద ఎవరి సహపాఠియో వారు దీన్ని తమవెంట క్లాసుకు తీసుకుపోవచ్చు'

అంతే! ఆ మాటతో అందరూ సిగ్గుపడి క్లాసులకి పరుగెత్తారట.

ఇంటికి వచ్చింతర్వాత ముందుగా సుజాత మెళ్లో ఉన్న నెక్లెసును కిరణ్మయి పరీక్షించింది. "బ్యూటిఫుల్!" అంటూ మెచ్చుకుంది. "నీ మెళ్లో ఉంటే ఆ నెక్లెసు ఇంకా అందంగా ఉంది" అంది మళ్లీ.

సుజాత కూడా కిరణ్మయి నెక్లెస్‌ను పరిశీలించి చూసింది.

"వదినగారూ- మీరు నా నెక్లెసును మెచ్చుకున్నారు కానీ, నిజానికి నా దానికన్నా మీదే బావుంది. డైమండ్స్, మేకింగ్, మోడల్ అన్నీ సూపర్బ్"

కిరణ్మయి పొంగిపోయింది.

లంచ్ అయింతర్వాత తమ్ముడితో అందామె, "ఒరేయ్ శివా! నాన్నగారిని చూద్దామని బయల్దేరి వచ్చా! నీ పెళ్లి అయింతర్వాత ఇంతవరకూ రావడం పడలేదు. నువ్వూ అక్కణ్నుంచి వచ్చేశావని తెలిసింది. అందుకని వచ్చాను. ఒకసారి మీరిద్దరూ కూడా రాకూడదు. చూసేసి, నేను అటునుంచి అటు వెళ్లిపోతాను. మీరిద్దరూ కూడా ఇటు వచ్చేయవచ్చు. రేపు ఆదివారమేగా? "

తండ్రి ఇల్లు అమ్మేశానని చెప్పినప్పట్నుంచీ, అతనిక్కూడా వెళ్లి తండ్రినీ, తల్లినీ చూసివద్దామని ఉంది. అందుకని సుజాత అంగీకారం కోసం కూడా చూడకుండా, "వెళ్దాం" అన్నాడు.

"చూశావు కదా. ఈసారి పిల్లవాణ్ని కూడా తీసుకురాలేదు. మీ బావగార్ని చూడమని చెప్పి వచ్చేశాను. చూసి, వెంటనే వెళ్లిపోవాలి!"

అందుకని ఆలస్యం చెయ్యకుండా, ముందస్తుగా ఏ రైలు ఉంటే, ఆ రైల్లో బాపట్ల వెళ్లారు.

బాపట్లలో రాజ్యలక్ష్మీపురం ఉంది. ఆ పురం చివరి బజార్లో చిట్టచివరి ఇల్లు వాళ్ల నాన్న కుటుంబరావుది. రైలు దిగి ఆటో చేసుకుని ఆ ఇల్లు చేరుకున్నారు. ఆ ఇంట్లో కుటుంబరావు, కామేశ్వరమ్మా ఉండడంలేదని శివశంకరానికి తెలుసు. కానీ సోదరితో ఆ మాట చెప్పడానికి సంకోచించాడు.

'ఇల్లు అమ్మేస్తుంటే, నువ్వేం చేస్తున్నావురా వెధవాయి?' అని అంటుందని భయం. కిరణ్మయికి కోపం వస్తే వావీ వరసా చూడదు. ఆవిడ మాటలకు అడ్డూ ఆపూ ఉండదు.

గబగబా వెళ్లి తలుపు తట్టింది. "నాన్నగారూ.. అమ్మా!" అంటూ పెద్దగా పిలిచింది.

ఒకటి రెండుసార్లు పిలిస్తే కానీ తలుపులు తెరుచుకోలేదు. ఎవరో ఓ టీనేజరు వచ్చి తలుపు తీసి "ఎవరూ? " అని అడిగింది, వీళ్లెవరో తెలీక.

ఆ అమ్మాయెవరో తెలీక, "నువ్వెవ్వరమ్మా? లోపల కుటుంబరావు గారుండాలే!" అంది కిరణ్మయి.

"నాన్నా! ఎవరో వచ్చారు. ఆ ఇల్లు అమ్మినాయన గురించి అడుగుతున్నారు.

మీరొకసారి రండి" అంది.

ఓ మధ్యవయస్కుడు బయటకు వచ్చాడు. మనిషి మంచి హుందాగా, తెల్లగా, గుండ్రటి మొహంతో ఉన్నాడు. తనను తాను పరిచయం చేసుకున్నాడు.

"నా పేరు హరికిషన్, లాయర్ని. తమ్మయ్యగారి దగ్గర్నుంచి ఈ ఇల్లు కొనుక్కున్నాను!"

"తమ్మయ్యగారెవరు ఈ ఇల్లు మీకమ్మటానికి? ఇది మా ఇల్లు!" కిరణ్మయి పరుషంగా అంది.

"కుటుంబరావుగారు ఈ ఇంటిని ఆయనకు తాకట్టు పెట్టారు. విక్రయం చేశారు. క్రయ విక్రయాలు సరిగా చూసుకునే నేను కొనుగోలు చేశాను" లాయర్ హరికిషన్ మర్యాదగా విశదీకరించాడు.

కిరణ్మయి తమ్ముడి వేపు చూసింది. ఆమె కళ్ళల్లో నీళ్లు చిప్పిల్లుతున్నాయి. ఆపుకోటానికి ప్రయత్నం చేసింది. ఆపుకోలేకపోయింది. భోరుమంది. శివశంకరం తన అక్కను సాంత్వన పరచటానికి ప్రయత్నం చేశాడు.

"ఊరుకో అక్కయ్యా! ఊరుకో!" అంటూ కిరణ్మయిని సముదాయించాడు. పరిస్థితి కాస్త ఎంబరాసింగ్‌గా మారుతుండడంతో హరికిషన్ లేచి లోపలకు వెళ్లాడు. ఆయన అక్కడ లేకపోయింతర్వాత కిరణ్మయి తమ్ముడి మీద విరుచుకు పడింది.

"అయితే ఇదంతా నీకు ముందే తెలుసన్నమాట! తెలిసి కూడా నాతో ఎందుకు చెప్పలేదురా? ఎందుకు చెప్పలేదు? ఈ వయసులో వాళ్లు ఇల్లు లేక, కన్నవాళ్ళు దగ్గర లేక, ఎట్లా బతుకుతారనుకున్నావు? అసలు ఇల్లు అమ్ముకోవాల్సిన దుర్గతి వాళ్లకెందుకు వచ్చిందిరా? రెండు లక్షల రూపాయలు కట్నంగా తీసుకున్నవాళ్లు.. లక్ష రూపాయలు కట్నం ఇచ్చి కూతురి పెళ్ళి ఘనంగా చేసిన వాళ్ళు.. వాళ్ళకేం ఖర్మ పట్టిందిరా! అయినా వాళ్లు ఇల్లు అమ్ముకుని అలో లక్ష్మణా అని ఏడుస్తుంటే, నువ్వేం చేస్తున్నావురా.. చెట్టంత కొడుకువి! ఉద్యోగం చేస్తున్న వాడివి? "

"ఆడపిల్ల పెళ్ళి చేశారు కనుక అప్పుల్లో పడ్డారు. నాకోసం తీసుకున్న కట్నాన్నీ నీకిచ్చారు స్థలం కోసం!!" శివశంకరం కొంచెం కోపంగా అన్నాడు.

"ఇందులో నా తప్పేముందీ? ఇల్లమ్మిన సంగతి నాకు తెలీదు. ముందుగా నాతో చెప్పలేదు!"

లాయర్ హరికిషన్ మళ్లీ వాళ్లున్న చోటుకు వచ్చారు. ఆయనతో భార్య కూడా వచ్చింది. మొదట వాళ్ళను పలకరించిన అమ్మాయి, ఓ ప్లేట్లో బిస్కట్లూ, కాఫీ కప్పులూ పెట్టుకుని తల్లి వెంట వచ్చింది.

"నమస్కారమండీ నాపేరు దమయంతి" అంది. "ఎండలో వచ్చారు. కాఫీ తాగండి!" అందా ఇల్లాలు ఎంతో మర్యాదగా, ఆ ప్లేటూ కప్పులూ వాళ్ళ ముందు పెడుతూ.

"అబ్బే.. వద్దండీ!" అన్నాడు శివశంకరం మొహమాట పడుతూ.

ఇంకా కిరణ్మయి కళ్ళలో నీళ్లూరుతూనే ఉన్నాయి. "ఏవీ వద్దు" అంటూ తలాడించింది.

లాయరుగారు పెద్దమనిషి తరహాలో మాట్లాడాడు "చూడండి. మీ బాధ నేనర్థం చేసుకోగలను. కానీ ఇట్లా మీరు నట్టనడి ఇంట్లో కన్నీరు కార్చడం ఏమంత బావో లేదు. మాకూ కొన్ని సెంటిమెంట్స్ ఉంటాయి కదా? ఓ ముత్తయిదువు, ఓ ఆడపిల్ల, మిట్టమధ్యాహ్నంవేళ నట్టింట్లో కూచుని ఏడవటం మాకు మంచిదంటారా? ఈ ఇల్లు కొనడంలో మా తప్పేమన్నా ఉందంటారా? పైగా మీకు తెలీదు, ఇది కొని, ఓ మంచి పని చేశాను. లేకపోతే ఆ తాకట్ల తమ్మయ్య, పదిమంది ముందూ మీ నాన్నగారి పరువు తీసే

వాడు. అల్లరి పెట్టి రోడ్డు మీదికి ఈడ్చే వాడు. ఇల్లుకొని, గుట్టు చప్పుడు కాకుండా, మీ నాన్నా-అమ్మా ఇక్కణ్నుంచి బయటప డటానికి నేను తోడ్పడ్డాను! కాఫీ తాగండి ముందు, చల్లారి పోతోంది, ప్లీజ్!"

సుజాత కాఫీకప్పు తీసుకుని సిప్ చేయడం మొదలుపెట్టింది. దమయంతి, ఆమె కూతురూ కిరణ్మయినీ, సుజాతనూ పట్టి పట్టి చూస్తున్నారు. వాళ్ళిద్దరి మెడ ల్లోనూ ఉన్న డైమండ్ నెక్లెస్‌లు వాళ్ళను మరీ మరీ ఆకర్షిస్తున్నాయి. నెక్లెస్‌తోపాటు సుజాత సౌందర్యం వాళ్ళకు అబ్బురమని పిస్తుంది.

ఆ టీనేజ్ గర్ల్, సుజాత దగ్గరకు వెళ్ళి కూచుని "మీరేం క్రీం వాడతారక్కయ్యా? " అని అడిగింది ఆసక్తితో.

వాళ్లిద్దరూ మాటల్లో పడ్డారు.

శివశంకరం కాఫీ తాగడం ముగించి, "ఇల్లు అమ్మేసి, మానాన్నగారు ఎక్కడికి వెళ్లారో చెప్పగలరా? "

"చెప్పలేను. పైగా ఆయనతో పెద్దగా నాకు పరిచయం కూడా లేదు. తమ్మయ్య తోనే చూశాను ఒకసారి"

ఆయన దగ్గర నుంచి ఇంక ఏ అదనపు సమాచారమూ లభించదనుకుని, సెలవు చెప్పి సోదరినీ, భార్యనూ తీసుకుని బయ టకు వచ్చేశాడు శివశంకరం.

"ఇప్పుడేం చేద్దాం? " ప్రకాశంగా అన్నాడు.

సుజాత సలహా చెప్పింది "ఇల్లు కొను క్కున్న వాళ్ళను కాదు. ఇరుగు పొరుగుల్ని కలుసుకోండి, తెలియవచ్చు!"

"సుజాత నువ్వు వెళ్ళి ఆ ఎదురు ఇంట్లో కనుక్కో. అక్కా, నువ్వు ఈ పక్క ఇంట్లో కనుక్కో. నేను ఆ పక్క ఇంట్లో అడుగు తాను. ముగ్గురం కట్టకట్టుకుని ఒక చోటికే వెళ్ళడం ఎందుకూ? "

అలా చేయడంతో కావలసిన సమా చారం సులభంగానే తెలిసింది.

కుటుంబరావు, భార్యను వెంట బెట్టుకుని శ్రీసత్యసాయిబాబావారు వైట్ ఫీల్డులో నిర్వహిస్తున్న వృద్ధాశ్రమానికి వెళ్ళారట!

"వృద్ధాశ్రమానికా? !" శివశంకరం బాధగా అడిగాడు.

"అవున్నాయనా! ఈ వయసులో అక్క డైతే ప్రశాంతంగా ఉంటుందనుకున్నారు వాళ్ళిద్దరూ! ఆశ్రమంలో ఉండడమే కాదు, బాబావారి దర్శనమూ అవుతుంది కదా, ఆ మహానుభావుడు వేసవిలో వైట్ ఫీల్డులో బృందావనానికి వచ్చినప్పుడు! దానికి తోడు తమ వయసువారికి కొంత సేవ కూడా చేసుకోవచ్చు. మానవసేవే మాధవసేవ అన్నారు కదా!" అంది వారికి కావలసిన సమాచారం ఇచ్చిన ఆ వయసు మీరే దశలో ఉన్న పక్కింటి పిన్నిగారు.

సమాచారం తెలిసి, మనసు కొంత కుదుటపడి, వాళ్ళు ముగ్గురూ ఓ హోట లుకు వెళ్ళి భోజనాలు ముగించారు.

భోజనం చేస్తూ కూడా కిరణ్మయి, తండ్రి గురించే, తల్లి గురించే మాట్లాడింది. "నేనే కదురా, నాన్నగారి ఈ పరిస్థితికి కారణం! తీసుకున్న రెండు లక్షల్నీ తిరిగి ఇచ్చేసిన ట్లయితే, ఆయనకు ఈ దుస్థితి వచ్చేది కాదుగా? " అంటూ మళ్లీ కన్నీరు కార్చింది.

సుజాత కల్పించుకుంది. "దుస్థితి అని ఎందుకనుకుంటున్నారు వదినగారూ! చేర వలసిన చోటుకే చేరుకున్నారు అనుకో వచ్చు కదా! సత్యసాయిబాబావారిని సాక్షాత్తు భగవదవతారంగా ఎన్నిలక్షల మంది ఆరాధిస్తున్నారు? అక్కడే ఉంటే బాబావారే అత్తయ్యగారినీ, మావయ్యగా రినీ కళ్ళల్లోపెట్టి చూసుకుంటారు! ఆ దేవుడు చూసినంత ప్రేమగా, శ్రద్ధగా మనం వాళ్ళను చూడగలమా? కాపాడగ లమా? "

కిరణ్మయి మరదలు వైపు చూసింది.

"ఏమిటి నీ ఉద్దేశ్యం? దేవుడైతే మాత్రం, మన దగ్గర ఉండవలసిన వాళ్ళను తన దగ్గరుంచుకుంటాడా? తండ్రీ, బిడ్డల్నీ వేరు చేస్తాడా? పేగుబంధం కన్నా, దైవ బంధం గొప్పదవుతుందా?" కిరణ్మయి కళ్ళల్లో అసహనం ప్రతిఫలించింది.

"మీరెందుకే అట్లా వాదించుకుంటారు. వైట్‌ఫీల్డు వెళ్ళి, అమ్మనూ, నాన్నగారినీ చూసి, మాట్లాడి, ఒప్పించి మన దగ్గరకు తెచ్చేసుకుందాం. సరేనా?"

"అంత దూరం రావడానికి ఇప్పుడు నేను తయారై రాలేదురా! రెండు చీరలు బ్యాగ్‌లో పెట్టుకుని బయల్దేరి వచ్చేశాను. పైగా పసివాణ్ణి మీ బావగారి దగ్గర వది లేసి వచ్చేశాను గదా! అక్కడ వాడేం ఇల్లు పీకి పందిరేస్తున్నాడో, ఏమో!!"

"నువ్వే కదా బయలుదేరి వచ్చింది, చూడాలని ఉందని చెప్పి!! ఇప్పుడు వాళ్ళి ద్దరూ ఎక్కడున్నారో తెలిసిందిగా! వర్రీ ఏముంది? ఇంకోసారి, అన్నీచూసుకుని వెళ్దాం!" శివశంకరం సౌమ్యంగా సర్ది చెప్పాడు.

అది తప్పు అన్నట్లుగా సుజాత భర్తవేపు చూస్తూ, పై రెండు పళ్ళతో కింది పెద విని నొక్కింది.

"సుఖంగానే ఉన్నారన్నది మన భావన. ఉండాలన్నది మన ఆశ. అసలు పరిస్థి తుల్ని ఒకసారి చూసి అత్తయ్యనూ, మావ య్యగారినీ ఒకసారి పలకరించడం మన ధర్మం! వదినగారూ, అన్నయ్యగారికోసారి ఫోన్ చెయ్యండి. మీ తమ్ముడు మాట్లాడి, పరిస్థితుల్ని వివరించి ఆయనను ఒప్పి స్తారు. రెండు రోజుల్లో వస్తారన్న మీరు, నాలుగు రోజుల్లో వెళతారు. అంతలో కొంపలేం మునుగు పోవులెండి!"

కిరణ్మయి కాదనలేకపోయింది.

శివశంకరం తత్కాల్ రిజర్వేషన్ తీసు కున్నాడు. ప్రశాంతి ఎక్స్‌ప్రెస్‌లో ఎ.సి.లో

వెళ్ళి, బెంగుళూరులో దిగి, అక్కడి నుండి టాక్సీ చేయించుకుని కాళుగుడికి వాళ్లతో చేరుకున్నాడు.

"ఎందుకండీ ఇంత ఖర్చు పెడుతున్నారు? " సుజాత గొణిగింది.

"డైమండ్ నెక్లెస్‌లు! డైమండ్ నెక్లెస్‌లు!! ప్రయాణంలో గిల్టువి పెట్టుకుని బయల్దేరాలి, మీరేవో ఒరిజినల్స్‌తోనే వచ్చేశారుగా!! అందుకు? " శివశంకరం తానెంత జాగ్రత్త పరుడో వివరించాడు.

"అంతేనా? వదినగారి దగ్గర తమరు కాలరెగరేయడానికా? " సుజాత వెక్కిరించింది.

కాళుగుడి నుంచి ఇంకో అయిదు కిలోమీటర్లు ఉంది ఆ వృద్ధాశ్రమం.. ప్రేమాశ్రయం, శ్రీసత్యసాయి కృపాశ్రయం!

ఆ ముగ్గురూ ఆశ్రమంలో అడుగు పెట్టే సరికి, కుటుంబరావు తన చుట్టూ ఓ పది మంది వృద్ధుల్ని కూచోబెట్టుకుని వాళ్ళకు రామాయణం చదివి వినిపిస్తున్నాడు. తనకు తెలిసినంత వరకూ అర్థ వివరణ చేస్తున్నాడు.

"శ్రీమద్రామాయణంలో ఎందరో తండ్రులూ, మాతృమూర్తులూ మనకు కనిపిస్తారు. దశరథుడు, జనకుడు, రామచంద్ర ప్రభువు, రావణాసురుడు... ఇట్లా ఎందరో, ఎందరో! అందులో కొందరు పుత్రశోకంతో మరణించారు, పుత్రులకోసం శోకించారు. కన్న సంతానానికి వివాహం జరిపించి, తమ కర్తవ్యం అయిపోయినట్లుగా రుషులయ్యారు. కొందరు భార్యాబిడ్డల్ని పోగొట్టుకుని వారికోసం సామాన్య మానవుల్లా విలపించారు. వారినీ ఈషణత్రయాలు బాధించాయి. వాటికి కొంతవరకూ దూరమై, ఇప్పుడు దైవసాన్నిధ్యంలో జీవితాలు ధన్యం చేసుకుంటున్నాం"

చివరి మాటలంటుండగా ఆయనకు తను కన్నవారి దర్శనం అయింది. ఆశ్చర్యానికి లోనైనా దానిని ఆయన బహిర్గతం చేయలేదు. తనకు కొంచెం దూరంలో, ఆశ్రమంలో ఉన్న ఆడవారితో కలసి చెట్లకు నీరందిస్తున్న కామేశ్వరమ్మను కేక వేశాడు. "అయినవాళ్లొచ్చారు, ఆదరించు!"

కామేశ్వరమ్మ ఆ ముగ్గుర్నీ చూసి ఆనందపరవశురాలైంది. లోపలకు తీసుకువెళ్ళి అన్నీ కనుక్కుంది.

శ్రీమద్రామాయణ పఠనం ముగించుకుని కుటుంబరావు లోపలకు వచ్చాడు. ఆయనతో ఎట్లా అసలువిషయాన్ని ప్రస్తావన చేయాలా అని కిరణ్మయీ, శివశంకరం మల్లగుల్లాలు పడ్డారు. ఆ ఇబ్బందిని సుజాత ఇట్టే తొలగించింది.

మామగార్ని చూడగానే ముందుగా ఆయన కాళ్ళకు నమస్కరించింది. రెండు చేతులూ జోడించి, ప్రార్థనాపూర్వకంగా "ఇట్లా ఎందుకు చేశారు మావయ్యగారూ? " అని అడిగింది వేదనా స్వరంతో.

"ఏం చేశాను తల్లీ? "

"ఇక్కడకు వచ్చేయడం!!"

"ఎక్కడికి వచ్చానమ్మా? బాబా దగ్గరకేగా!"

"మాకన్నా బాబా మీకు దగ్గరా? "

కుటుంబరావు మనసుపండిన ఓ వేదాంతిలా, జగద్రహస్య సిద్ధాంతాన్ని అవలోకనం చేసుకున్న ఓ పరిణత వ్యక్తిలా అన్నాడు, "చుట్టాలు దొంగలు... సుతులు రుణస్థులు... కాంతలు సంసార కారణంబు!"

శివశంకరంలో నిజంగానే తనో దోషి నన్న భావన బలమైంది. తనను కూడా తాకట్ల తమ్మయ్యగానే అనుకుంటున్నాడు ఆయన. కన్నకొడుకు రుణస్థుడన్న జ్ఞానావస్థలో ఉన్నాడాయన.

"అట్లా అనుకోవద్దు నాన్నగారూ! జరిగిందేదో జరిగిపోయింది. మన ఊరికి వెళ్ళిపోదాం, రండి!" శివశంకరం ఏడుస్తు

## వన్నె తరగని ఆదరణ

ఇంటర్నెట్ వచ్చాక ఏ సమాచారం కావాలన్నా చిటికెలో లభ్యమవుతోంది. గూగుల్, బింగ్‌లాంటి శక్తిమంతమైన సెర్చ్ ఇంజన్లు వచ్చాక సమాచారం తేలికగా దొరుకుతోంది.

అయినప్పటికీ 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' పుస్తకం తాలూకు అమ్మకాల మీద ఇంటర్నెట్ ప్రభావం పెద్దగా లేకపోవటం విశేషం.

1768లో మొదటిసారిగా అచ్చయినప్పటి నుంచి అనేక ముద్రణలకు నోచుకుంటున్న ఏకైక రిఫరెన్స్ పుస్తకం ఇదే. రోజురోజుకూ ఈ పుస్తకం రచయితలు కూడా పెరుగుతూ వస్తున్నారు. ఐన్‌స్టీన్, ఫ్రాయిడ్ లాంటి ప్రముఖులు దీనిలో రాశారు. వీరేకాక డజన్లకొద్దీ నోబెల్ బహుమతి గ్రహీతలు, పులిట్జర్ అవార్డ్ గ్రహీతలు కూడా ఇందులో రాశారు.



A-Z వరకూ విషయసూచిక ప్రకారం ముప్పైరెండు సంపుటాలుగా బ్రిటన్‌లో ఇది ప్రచురితమవుతోంది. నల్లటి బైండ్ మీద బంగారు రంగు అక్షరాలతో ఈ పుస్తకాలు ఓ పెద్దపెట్టెలో వస్తాయి. 4.4 కోట్ల పదాలు గల ఈ పుస్తకాల్లో మొత్తం ముప్పైమూడువేల పేజీలు ఉంటాయి. వాటిలో అరవై అయిదు వేల వ్యాసాలు, ఇరవై నాలుగువేల బొమ్మలు ఉంటాయి. మొత్తం ముప్పైరెండు సంపుటాలుగా వెలువడే ఈ పుస్తకాల్లో ఒక్కోటి రెండు కిలోల బరువుంటుంది.

ఇంటింటికీ తిరిగే సేల్స్‌మెన్ వీటిని ఎక్కువగా మార్కెట్ చేస్తుంటారు. చాలామంది వీటి అమ్మకాల ద్వారా జీవిస్తున్నారు. ముందు ఆర్డర్ తీసుకొని, తర్వాత పార్శిల్ సర్వీస్ ద్వారా దీన్ని డెలివరీ చేస్తారు.

కొందరు ఈ పుస్తకాల్ని చదవకపోయినా కొని ఇంట్లో పెట్టుకోవటం విశేషం.



## కోళ్ల ప్రేమికురాలు!

ఓరోజు దక్షిణ కేలిఫోర్నియాలోని, హాలీవుడ్‌లో రద్దీగా ఉండే హైవేమీద కోళ్ళని తీసుకెళ్ళే ట్రక్ ప్రమాదానికి గురయింది. అందులోని కోళ్ళన్నీ రోడ్డుపక్కన పొదల్లోకి వెళ్ళిపోయాయి. వాటి గురించి ఎవరూ పట్టించుకోలేదు. దాంతో అవి అక్కడే ఉండసాగాయి. వాటిని స్థానికులు 'హాలీడే హైవే చికెన్స్' అని పిలిచేవారు.

మిన్నీ బ్లూమ్‌ఫీల్డ్ అనే వృద్ధురాలు ఆ సమీపంలోనే ఓ ఇంట్లో ఒంటరిగా తనకొచ్చే పెన్షన్‌తో జీవిస్తోంది. ఆవిడ ఆ కోళ్ళకి నిత్యం తనకున్న దాంట్లోంచి కొంత ఖర్చుచేసి తిండి పెట్టసాగింది. అలా తొమ్మిదేళ్లు ఆవిడ వాటిని పోషించింది. చావు సమీపిస్తుండటంతో తన తర్వాత వాటికెవరు తిండి పెడతారు? అని భయపడసాగింది. అంతలోనే జోడిమేన్ అనే నటి ఆవిడ పక్కింట్లో అద్దెకి వచ్చింది. ఆ వృద్ధురాలు ఎవరికీ చెందని పిల్లులకి, కోళ్ళకి మేత పెట్టడం ఆ నటి గమనించింది. తన భయాన్ని మిన్నీ ఓ రోజు జోడికి చెప్పింది.



జోడి ఆ కోళ్ళకి శాశ్వత పరిష్కారాన్ని కనుగొంది. వాటిని ఉంచేందుకు ఓ రేంచ్‌ని చూసింది. 'ఏక్టర్స్ అండ్ అదర్స్ ఫర్ ఏనిమల్స్' అనే సంస్థని స్థాపించి జోడి ఆ కోళ్ళన్నింటినీ రేంచ్‌కి తరలించింది. జోడి స్థాపించిన సంస్థ ఏటా జంతువులను, పక్షులను దయతో చూసుకునేవారికి హ్యూమానిటేరియన్ అవార్డుని ఇవ్వదలచుకుంది. మిన్నీ బ్లూమ్‌ఫీల్డ్ స్ఫూర్తితో దాన్ని స్థాపించినందున మొదటి అవార్డుని ఆవిడకే ఇచ్చిందా సంస్థ. కోళ్ళ మధ్యనున్న మిన్నీ చిత్రాన్నే చిహ్నంగా రూపొందించి ఆమెను గౌరవించారు.



న్నాడు.

"ఎందుకురా ఆ కన్నీరు?" కుటుంబ రావు తన ఉత్తరీయంతో అతని కన్నీరు తుడిచాడు. మెల్లమెల్లగా కరుణ స్వరంతో అన్నాడు, "ఓరి పిచ్చివాడా! ఒక సంగతి తెలుసుకో!

తల్లీ-తండ్రీ, పిల్లా జెల్లా
అందరు నీ కిల భవబంధాలే!
రాగం, రోగం, యోగం, భోగం
అన్నీ నీ కిల అనుబంధాలే!

అందుచేత నాకిప్పుడు, దేనిమీదా మనసులేదు. ఎవరిమీదా ఆసక్తి లేదు. ఈ జీవన్నాటకంలో జరిగేదేదో జరుగుతుంది. మనం అనుకున్నది జరగదు, మనకున్నది తప్పదని అంది విశ్వజనని అనసూయమ్మ. అందుచేత పాత విషయాల్ని



కనిపిస్తున్నాడు. ఆయన మానానికి ఆయనను వదిలిపెట్టడమే మంచిదనిపించింది.

ఆశ్రమం ప్రశాంతంగా ఉంది. పచ్చగా ఉంది. ఉన్నవారంతా భయరహితంగా ఒకానొక ప్రేమభావంతో బతుకుతున్నట్లు కనిపిస్తున్నారు. వారి వదనాల్లో ఒక దివ్య జ్యోతి తాండవిస్తోంది. అంతటి మహాదృష్టానికి తన తండ్రిని తానెందుకు దూరం చేయాలి? శివశంకరం ఒక స్థిర నిశ్చయానికి వచ్చాడు. కుటుంబరావును అక్కడే వదిలి, కామేశ్వరమ్మను తీసుకుని వెళ్ళిపోవాలన్న ఆలోచనకు వచ్చాడు. ముగ్గురూ ఆమెను ఒత్తిడి చేశారు.

"నాన్నగారు మమ్మల్ని కాదన్నారు. నువ్వూ అట్లా చేయకమ్మా!"

కామేశ్వరమ్మ కళ్లు మూసుకుని కొంతసేపు ధ్యానంలో ఉండిపోయింది. తన జీవితమంతా ఆమె ముందు వర్తులమైంది. బాల్యం, యౌవనం, పెళ్ళి, పిల్లలు, సంసారం.. అన్నీ కనిపించాయి. ఏది కనిపించినా, పిల్లలే ఆ దృశ్యాన్ని ఆక్రమించారు. వాళ్లూ, తనూ అవిభాజ్యం! కానీ మెల్లగా పిల్లలూ అదృశ్యమయ్యారు. ఎక్కడ చూసినా, ఎటు చూసినా కుటుంబరావు గారే కనిపిస్తున్నారు. తన గుండె గూట్లో ఆయన వెలుగుతున్నాడు. తనను ఆయనే ముందుకు.. మునుముందుకు నడిపిస్తున్నాడు. తను ఆయన చేతిని విడువలేదు. మెల్లగా కామేశ్వరమ్మ కళ్లు తెరిచింది. పిల్లలు ఆమె వేపే చూస్తున్నారు.

ఆ కళ్ళలో చూపు వాళ్లకు అంతకు పూర్వం తెలిసింది కాదు. అవి కొత్తగా కనిపిస్తున్నాయి. ఆమె స్థిర స్వరంతో అంది,

"మీరు రమ్మన్నారు మంచిదే! కానీ నన్ను మన్నించండి. నేను రాలేను. ఆయనతోడిదే నా లోకం, నా నడక, నా జీవితం. ఏం సంపాయించామని కాదు,

నాకు జ్ఞాపకం చేయవద్దు. బతకవలసిన కాలాన్ని ఇక్కడే గడపనీయండి! రమ్మనీ, క్షమించమనీ చెప్పి నన్ను ఇబ్బంది పెట్టకండి. మీఅమ్మ వస్తే తీసుకుపోండి. నాకేం అభ్యంతరం లేదు!"

కుటుంబరావులో శివశంకరానికి తన తండ్రి కాదు, బాబా అనుగ్రహాన్ని పరిపూర్ణంగా పొంది, ప్రశాంతి సంపదను నిండుగా అనుభవిస్తున్న మహాతాత్త్వికుడు

ఏం మిగిలిందని? అదీ ఆలోచించాలి. అన్నీ పోయినా ఆయన నాకు మిగిలే ఉన్నారు. అదే మిగిలింది, ఆ సాంగత్యం.. ఆ సహవాసం... ఆ సాన్నిహిత్యం... మీరంతా ఆయన తర్వాతే నాకు. మీరు వెళ్ళిపొండి. ఇటుపైన ఇలావచ్చి మమ్మల్ని కలత పర్చకండి. స్వామి దగ్గర, స్వామి సేవలో ప్రశాంతంగా బతకనీయండి!"

చేసేది లేక, ముగ్గురూ బాధాతప్త హృదయాలతో తిరుగు ప్రయాణమయ్యారు. కిరణ్మయి తన వూరికి వెళ్ళిపోయింది. వెళ్తూ వెళ్తూ అంది "ఒరేయ్-శివుడూ! పెద్దవాళ్ళిద్దరూ వాళ్ళదారి వాళ్ళు వెతుకున్నారు. కనీసం నువ్వూ, మరదలన్నా నాతో ఉంటారుగా? "

శివశంకరానికి ఆ మాటలు వినగానే కళ్లు బాష్పరుద్ధమయ్యాయి. "అదేం మాటలక్కా! ఇప్పుడు నువ్వేగా నాకు అమ్మా-నాన్నా!"

కిరణ్మయి సుజాతను పొదవి పట్టుకుని ప్రేమగా అంది, "సుజీ! నువ్వు నాకు మరదలుగా ఉండకు, చెల్లెలుగా ఉండు!"

సుజాత కంఠం కూడా ఆ మాట విని వణికింది. "అదేమిటి వదినగారూ, అట్లా అంటారు? ఇప్పుడు మీరేగా మాకు పెద్ద దిక్కు! మీరే మమ్మల్ని చూస్తుండాలి. సరియైన దార్లో నడిపించాలి!"

శివశంకరం తన సోదరికి ఖరీదైన చీర కొనిపెట్టాడు. పుల్లారావుకు సఫారీ సూటు పెట్టాడు. మేనల్లుడికి టాయ్స్ ఎన్నో ఇచ్చాడు. ట్రెయిన్ ఎక్కిస్తూ సుజాత, కిరణ్మయితో అంది, "వదినగారూ! మీరూ, నేనూ మన నెక్లెస్‌లు మార్చుకుందామా? "

కిరణ్మయి ఒక్క క్షణం కూడా ఆలోచించలేదు. "అట్లాగే" అంటూ తన నెక్లెస్ తీసి సుజాత మెడలో వేసింది.

సుజాత కూడా తన మెడలో వున్న డయిమెండ్ నెక్లెస్ తీసి, సుతారంగా కిర ణ్మయి మెళ్లో వేసింది. వాళ్ళిద్దరు చేస్తు న్నది చూస్తూ, మెచ్చుకుంటూ అట్లాగే నుంచుండిపోయాడు శివశంకరం. తన తల్లిదండ్రుల వైరాగ్యభావం వాళ్ళల్లో నూత నానురాగ భావ శబలతకు కారణమైందా? అని లోలోపల ప్రశ్నించుకున్నాడు. ఏమైనా అది రాగవారధిని బలోపేతం చేసేదే కదా అని కూడా సంతృప్తి చెందాడు. ట్రెయిన్ బయలుదేరటానికి సూచనగా కూత కూస్తోంది. కిరణ్మయి లోపలకు ఎక్కి, కిటికీ ఊచల్లో నుంచి చూస్తూ నవ్వుతూ సుచనగా అంది. "ఇవ్వ వలసింది మరొకటి ఉంది మర్చిపోకు!"

"నేనేం ఇవ్వాలీ? "" ఆ సూచనకు, సుజా తకు జవాబు స్ఫురించలేదు.

"నాకు కోడల్నిస్తానన్నావుగా? "

సుజాత సిగ్గుపడుతూనే కొంటెగా అంది. "అది నా చేతుల్లో లేదుగా? "

"ఓసి కొంటెదానా? "

రైలు కదిలింది. కిరణ్మయి మాటలు గాల్లో తేలిపోయాయి.

సందడిగా వున్న ప్లాట్‌ఫాం క్రమంగా చైతన్యాన్ని కోల్పోతోంది. చీకటిని తరిమేసి దీపకాంతి, ఆశలకు అగ్గలమవుతోంది. రోడ్లన్నీ కళకళలాడుతున్నాయి. ఆకాశంలో నక్షత్రాలు, దేవతలు పెట్టుకున్న మిణు గురు పువ్వుల్లా మిలమిల్లాడుతున్నాయి.

ఇంటికొచ్చేసరికి శివశంకరం, సుజాత దుఃఖవివశత తగ్గి, మామూలు మనుషులై పోయారు. ఆ రాత్రి మళ్ళీ వాళ్ళకు మొద టిరాత్రిలా మారింది. మంచంమీద పర చిన కొత్తదుప్పటి నలిగి, సిగ్గుతో కమిలిపో యింది. సుజాత ఒళ్ళెల్లా నలిగిపోయింది. శివశంకరం మనసంతా కరిగిపోయింది. మొహంమీద పట్టిన చెమటను చీర చెర గుతో తుడుచుకుంటూ "వదిన గారడిగిన బహుమతిని ఆమెకిచ్చేద్దామనుకుంటు న్నారా? " అడిగింది.

"మొదటిరాత్రి పెట్టుకున్న ఒట్టును తీసి గట్టున పెట్టేస్తే...!"

శివశంకరం తన భార్య చెంపకు చెంప చేర్చి ప్రేమగా అడిగాడు. సుజాత అత నికి చక్కిలిగింత పెట్టింది. శివశంకరం నవ్వాడు.

అప్పుడన్నదామె "అందాల రాజా! నేను మోసేది తొమ్మిది నెలలే! మీరు మోయవ లసింది తొంభయి సంవత్సరాలు!"

"ఐయామ్ రెడీ!"

"ఐయామ్ ఆల్‌సో రెడీ!"

ఈ విధంగా వాళ్లు మొదటిరాత్రి మాట్లా డుకున్న మాటలకు తిలోదకాలిచ్చి, పిల్లల్ని కనాలన్న కొత్త నిర్ణయానికొచ్చారు. అందుకుపక్రమిమించారు.



సీతారామయ్య చిన జియ్యరుస్వామి ఆధ్యాత్మికోపన్యాసం విని, ఇంటికొచ్చేసరికి, పార్వతమ్మ కాళ్లు కడుక్కోను నీళ్ళిచ్చి, ఆ తర్వాత మంచి నీళ్ళిచ్చి, తాగాక కాస్త పంచదార తెచ్చి ఆయన నోట్లో పోసింది.

"ఏవిటే విశేషం? అంత తీపివార్త ఏవిటి? "

"తీపివార్తేనండీ! అమ్మాయి నెల తప్పింది! మీరు తాతయ్యా...!"

"నువ్వు అమ్మమ్మనూ!"

ఇద్దరూ నిర్మలంగా, హాయిగా నవ్వుకున్నారు. కడుపు నిండుగా భోజనం చేశారు.

"ఏమండీ- ఎప్పుడు వెళ్లొద్దాం అమ్మాయి దగ్గరకు? " అని అడిగింది పార్వతమ్మ అతని పక్క సర్దుతూ.

"లేడికి లేచిందా పరుగా? కాస్త డబ్బు చూసుకోవద్దూ? కడుపుతో వున్న ఆడపిల్లను చూట్టానికి వెళ్తున్నామంటే ఎంత వైభవంగా వెళ్ళాలీ? "

"అవన్నీ! అమ్మాయిని మన ఇంటికి తీసుకువచ్చి గాజులు పెట్టేవేళ... ఇప్పుడు కాదు. ఈ విషయాలు మగవాళ్లకేం తెలుస్తాయి కానీ, మీరు కాస్త ఊరుకోండి, నే చెప్పినట్టు చెయ్యండి. నా వెనకే రండి, అది చాలు!" పార్వతమ్మ సాధికారంగా అంది.

"జీహుజూర్!" సీతారామయ్య తల ఆడిచాడు. మరునాడే భార్యను తీసుకుని సుజాత దగ్గరకు బయలుదేరాడు.

శివశంకరం అత్తమామల్ని మామూలుగానే ఆహ్వానించాడు. అల్లుణ్ని చూడగానే సీతారామయ్య నిండుగా నవ్వుతూ, "కంగ్రాట్స్ అల్లుడుగారూ!" అన్నాడు.

శివశంకరానికి మామగారు ఎందుకు అభినందిస్తున్నారో అర్థం కాలేదు. "నాకు ప్రమోషన్ ఏమీ రాలేదే? " అన్నాడు అమాయకంగా.

"వచ్చిందండీ అల్లుడుగారూ! ఇది ఆఫీసులో ప్రమోషన్ కాదు. జీవితంలో ప్రమోషన్! మీరు తండ్రి కాబోతున్నారు! అమ్మాయి ఫోన్‌చేసి చెప్పింది!"

అంతటి శుభవార్త సుజాత ముందుగా తనకు చెప్పనందుకు అతనికి కొంత అసంతృప్తి కలిగింది.

ఆ రాత్రి బుంగమూతి పెట్టుకుని, అవతలివైపుకు తిరిగి పడుకున్న భర్తను బలవంతంగా తనవైపుకు తిప్పుకుని, "అబ్బాయిగారికి ఎందుకు కోపం వచ్చిందో తెలుసు కానీండి, ముందు నేచెప్పేది వినండి" అంటూ ఏం జరిగిందో వివరించింది.

"మధ్యాహ్నం నాకు కళ్లు తిరిగాయి. ఏదోగా ఉన్నట్లనిపించింది. ఏమిటబ్బా అనుకుంటూ, మీకు ఫోన్ చేద్దామని, చేస్తే మీరు కంగారు పడతారని, చెయ్యకుండా నేనే మనకు తెలిసిన నర్సింగ్‌హోంకు వెళ్లాను. అక్కడున్న ఆ గైనకాలజిస్ట్, ఆ ప్రశ్న ఈ ప్రశ్న అడిగి, పరీక్ష చేసి, పీరియడ్స్ అవుతున్నయ్యో లేదో ఆరాతీసి, ఆ తర్వాత "యూ ఆర్ ప్రెగ్నెంట్!" అంది. మీకు ఫోన్‌చేసి చెబుదామనుకుని బూత్‌కు వెళ్లాను. అంతలో ఇంకో ఊహ వచ్చింది. మీకు ఫోనులో చెప్పకూడదు స్వయంగా చెప్పాలి. మీ రియాక్షన్స్ స్వయంగా చూడాలి. అందుకని మా అమ్మకు ఫోన్ చేశాను. వాళ్ళు ఇంత తొందరగా వస్తారనుకోలేదు!" అంది క్షమాపణ కంఠంతో.

ఆమెను అట్లా చూసిన శివశంకరానికి కోపం కాస్తా ఎగిరిచక్కాపోయింది. ఆమెను అమాంతం మీదకు లాక్కున్నాడు కౌగిలింతలో నలిపేశాడు. ఏం కావాలో కోరుకోమన్నాడు. ఏవేవో వరాలిచ్చాడు. ఆ క్షణాల్ని ప్రేమ మధువుతో నింపేశాడు.

కూతురును చూడడానికని వచ్చిన సీతారామయ్య దంపతులు, ఇంటి సంగతే మర్చిపోయారు. శివశంకరానికి ఇంటి బాధ్యతలేవీ పట్టించుకోవాల్సిన అవసరం లేకపోయింది. జీవితం హాయిగా ఉంది.

ఓరోజు సాయంకాలం ఆఫీసు నుంచి వచ్చి స్నానం చేసి, సుజాతతో ఓ కామెడీ సినిమాకు వెళ్దామని బయల్దేరేంతలో పార్వతమ్మ లోపలి నుంచి వచ్చి, "అల్లుడుగారూ! ఒక్కక్షణం!" అని నిలిపేసింది.

బయలుదేరబోతున్న ఆ ఆలుమగలు ఆగిపోయారు. గడియారం అరగంట కొట్టింది. అయిదున్నర!

శివశంకరం అసహనంగా అన్నాడు

# ఏనాడు ఏ జంటకో..



"మనం ఎంత పుణ్యంచేసుకుంటేనో కదా మన దివ్యకి కోటీశ్వరుల సంబంధం కుదిరింది" అంది శాంత సంబరంగా.

ఆ మాటలు విన్న రాజా మౌనం వహించాడు. అతనికి అంతా కలలా ఉంది. తమ ఒక్కగానొక్క కూతురికి కోట్లకు పడగలెత్తిన శ్రీధర్, సువర్ణల పుత్రరత్నం శ్రీరామ్‌తో నిశ్చితార్థం జరగడాన్ని అ తను ఇప్పటికీ నమ్మలేకపోతున్నాడు. ఇక అంతా సుఖాంతమేననుకున్న తరుణంలో.. రాజా, శాంతల సంసారనావ ఒక్కసారిగా తలకిందులైంది. ఎందువల్ల? రాజా ఏమయ్యాడు? దివ్య, శ్రీరామ్‌ల పెళ్ళి జరిగిందా? సామాన్యులకు, ఐశ్వర్యవంతులకు మధ్య ఉండే సంబంధ బాంధవ్యాలను ఆసక్తిగా చిత్రించిన పొత్తూరి విజయలక్ష్మి నవల **ఏనాడు ఏ జంటకో..** చదవండి!

**జనవరి చతుర కానుక**

"చెప్పండి!"

దూరంగా ఉన్న సీతారామయ్య కూడా వాళ్ళ దగ్గరకు వచ్చాడు "అమ్మాయిని మా ఇంటికి తీసుకుని వెళ్లామనుకుంటున్నాను"

శివశంకరానికి నెత్తిమీద గుండురాయి పడ్డట్లయిది. "ఇప్పుడా? ఇప్పుడెందుకూ? ఇంత తొందరగానా? "

"అదికాదు నాయనా! ఇక్కడ మీరిద్దరే కదా ఉన్నది? చిన్న పనీ పెద్ద పనీ అదే చేసుకోవాలి కదా! పైగా మీరు ఆఫీసు కెళ్లి పోతే అమ్మాయి ఒంటరిగా ఇంట్లో ఉండా ల్సివస్తుంది. కడుపుతో ఉన్నప్పుడు అట్లా వంటరిగా ఉండడం మంచిది కాదు. అంచేత మా అమ్మాయిని పురుడు పోసు కునే వరకూ మా దగ్గరే ఉంచుకోవాలను కుంటున్నాం!"

జీవం లేనట్లుగా, బలహీనంగా శివశం కరం అన్నాడు "సుజాత ఏమంటోంది? "

"రానంటోంది. దాని మొహం! దానికేం తెలుసు, మంచీచెడూ! అందుకని మీతో చెప్పడం! దాన్ని పంపించే భారం మీదే! బయలుదేరటానికి రేప్పొద్దున్న ముహూ ర్తం బావుంది!"

సినిమా ప్రోగ్రాం రద్దయింది. గదిలో కళ్లు మూసుకుని కూచుని దీర్ఘాలోచనలో ఉన్న భార్య దగ్గరకు శివశంకరం బరు వుగా నడుచుకుంటూ వచ్చాడు. కొంచెం దూరంగా మంచం మీద కూచున్నాడు.

ఇద్దరూ మౌనంగానే ఉన్నారు. ఇద్ద ర్లోనూ రకరకాల ఆలోచనలు.

ఆ నిశ్శబ్దాన్ని శివశంకరమే ముందుగా భంగించాడు. "సుజీ! ఇంతకాలం నువ్వు చెప్పడం, నేను చేయడం జరిగింది. ఇప్పుడు నేను చెప్పడం, నువ్వు చెయ్యడం

జరగాలి!" అతను లేచి నిలబడ్డాడు. నాలు గడుగులు వేసి భార్య దగ్గరకు వచ్చాడు. ఆమె భుజాలమీద రెండు చేతులూ వేసి దగ్గరగా లాక్కున్నాడు. సుజాత కళ్లు తడి తడిగా ఉన్నాయి. శివశంకరం కదిలిపో యాడు. మెల్లగా ఆమెను చుంబించాడు.

"భయం వద్దు! సుఖంగా వెళ్తావు... లాభంగా తిరిగి వస్తావు" అతనామె చేతు లను పట్టుకుని గట్టిగా నొక్కాడు.

"భయం కాదు. మీకు కాఫీ పెట్టుకో వడం కూడా చేతకాదే- నేను దగ్గర లేకుండా ఈ అయిదారు నెలలూ ఎట్లా ఉంటారో అని!"

ఆ మాటలు అతన్ని ఎంతగానో రాగవి రాగానికి లోనుచేశాయి. "ప్రతి తండ్రి జీవి తంలోనూ ఈ అవస్థ తప్పదు. నేనూ అందరిలాంటిడ్నే కదా? " అతనన్నాడు.

"కాదు, మీరు అందరి లాంటివారు కాదు. మీరు స్పెషల్! ఎవరన్నా ఎదురు కట్నం ఇచ్చి పెళ్లి చేసుకుంటారా? మామ గారి దగ్గర కట్నం పేరుతో డబ్బు తీసు కుని అది పెట్టి మళ్లీ పెళ్లానికి నగలు చేయిస్తారా? చేసుకున్నదాని మాట విని వేరు కాపురానికి అంగీకరిస్తారా? అన్నీ మీలో ప్రత్యేకతలే! అందుకనే మీకో సలహా ఇద్దామనుకుంటున్నాను"

శివశంకరం కుతూహలంతో అడిగాడు "చెప్పు... చెప్పు... అదేమిటో? "

"పురుడో, పుణ్యమో, మిమ్మల్ని విడిచి నేనుండలేను. మనం కలిసే ఉండాలి. ఎక్కడ ఉన్నా సరే! అందుకని మీరు సెలవు పెట్టండి. మా నాన్నగారింటికి నాతోపాటు వచ్చేయండి. కొంతకాలం అయింతర్వాత, ఏం చేయాలో అప్పుడు మళ్లీ ఆలోచించుకుందాం!"

"పోనీ, అందరం ఇక్కడ కలిసి ఉండొచ్చు కదా? " అతను సూచించాడు.

"మా నాన్నగారికి అహంభావం ఎక్కువ. అది ఆయన ఆత్మగౌరవం అను కుంటారు!"

సుజాత అన్నట్టుగానే సీతారామయ్య దంపతులు అల్లుడు చేసిన ప్రపోజల్‌ను వీటో చేశారు.

"అది పద్ధతి కాదు బాబూ! అల్లుడొచ్చి మామగారింట్లో ఉండడం సంప్రదాయం. మామ గారొచ్చి అల్లుడింట్లో తిష్ట వేయడం అగౌరవం"

బయలుదేరేటప్పుడు భర్తకు ఎన్నో జాగ్రత్తలు చెప్పింది సుజాత. ఉదయం బెడ్‌కాఫీ దగ్గర్నుంచి రాత్రి బెడ్‌లైట్ ఆర్పే సేవరకూ ఏ క్షణంలో అతనేం చేయాలో పూసగుచ్చినట్టు వివరించింది. అన్నీ ఓ క్రమంలో రాసి క్యాలెండరుకు గుచ్చింది. వెళ్లబోతూ, బాగా దగ్గరగా వచ్చి చెవిలో నోరునెట్టి "మర్చిపోకండి, సెలవు పెట్టి వచ్చేయండి. మీరు వచ్చే వరకూ రాత్రుళ్లు నాకు నిద్ర పట్టదు!" అంటూ మూతి గుండ్రంగా తిప్పింది.

సుజాత వెళ్లిపోయింది. ఆమెతోనే ఇంట్లో ఉన్న సౌభాగ్యం శూన్యమైనట్లుగా అతని కన్పించింది. క్షణాలు యుగాలుగా అనిపించాయి. శివశంకరం డల్‌గా, మూడీగా మారిపోయాడు. ఆ స్థితిలో అనుకోకుండా తగిలిన రెండు దెబ్బలకు తట్టుకోలేకపోయాడు. దెబ్బలంటే అవి శారీరకమైనవి కాదు. ఉద్యోగ సంబంధమై నవి. పరువు ప్రతిష్టలకు సంబంధించినవి.

సుజాత పురుటికి పుట్టింటికి వెళ్లిన ఓ వారం రోజులకు అతను అప్పు తీసుకున్న బ్యాంక్ నుంచి ఓ నోటీసు వచ్చింది.

'ఎన్ని రిమైండర్లు మీకు పంపించినా, జవాబు లేదు. ఇన్‌స్టాల్‌మెంట్లు కట్టడం లేదు. అంచేత మీరు, ప్రతీనెలా జీతంలో కట్టేటట్టు మీ మేనేజ్‌మెంటు వారికి ఈ సంగతి తెలియజేయడమైనది!'

శివశంకరం ఆ లేఖ చూసి తెల్లమొహ

మేశాడు. మేనేజ్‌మెంటు పర్మిషను లేకుండా బ్యాంకులో అప్పు తీసుకోకూడదు. అది క్రమశిక్షణారాహిత్యం అవుతుంది. ఇప్పుడేం చేయాలి? ఆ ఉత్తరం వచ్చిన వారం రోజులకు ఆఫీస్ మేనేజరు తనకు కబురు చేసి, పనివేళల్లో తన క్యాబిన్‌లోకి వచ్చి పర్సనల్‌గా కలుసుకోమన్నాడు.

శ్రీముఖం ఇవ్వటానికో, చీవాట్లు పెట్టడానికో అని శివశంకరానికి అర్థమైపోయింది. పులి గుహలోకి చొరబడవలసి వచ్చిన లేడి కూనలా దడదడ లాడుతూ అతను ఆఫీసరు దగ్గరకు వెళ్లాడు.

ఆ ఆఫీసరు చాలా మర్యాదగా ఆహ్వానించాడు. "రండి, కూచోండి" అన్నాడు.

శివశంకరం వణుకుతూ కూర్చున్నాడు. ఆ ఆఫీసరు మహాశయుడు బ్యాంకివారి లేఖను అతని ముందు పెట్టాడు.

"ఇదేమిటీ? " ఆయన గొంతులో కాఠిన్యం లేదు. "అప్పు తీసుకున్నారా? " ఓ సాధారణ విషయాన్ని గూర్చి తెలుసుకుంటున్నట్లుగా ప్రశ్నించాడు.

శివశంకరం అవునన్నట్లు తలూపాడు.

"డిఫాల్టర్ అయ్యారా? "

శివశంకరం "అవును సార్!" అంటూ ఒప్పుకున్నాడు.

"డిఫాల్టర్స్ నా ఆఫీసులో పనిచేయటం నాకు ఇష్టం లేదు" ఆయన మొదటి బాంబు పేల్చాడు. "మేనేజిమెంటుకు తెలియకుండా లోన్లు చేయడం, వాటి విషయంలో డిఫాల్టర్ కావడం మేం సహించం" రెండో బాంబు పేల్చాడు.

"మీకు క్రమశిక్షణ లేదు. క్యారెక్టర్ లేదు. అది ఆఫీసుకు అగౌరవం" మూడో బాంబు పేల్చాడు. "అంచేత మిమ్మల్ని ఇమ్మీడియట్ ఎఫెక్ట్‌తో సస్పెండ్ చేస్తున్నాను" నాలుగో బాంబు పేలింది.

"సస్పెన్షన్ పీరియడ్‌లో మీ జీతంలో మూడోవంతు మాత్రం సబ్‌సిస్టెన్స్ ఎలవెన్స్ అంటారు. అది ఎందుకంటే బతకడానికి, కనీస అవసరాలు తీర్చుకునేందుకు! మరి ఆ వచ్చేదాంట్లో బ్యాంక్‌కి ఏంకడతారు? మమ్మల్ని ఏం మినహాయించి వాళ్ళకు పంపించమంటారు? అంచేత ఉద్యోగం నిలుపుకోవాలంటే ఉన్నదేదో అమ్మేసి, దాన్ని బ్యాంక్‌కి కట్టేసేయండి. దోషరహితంగా బయట పడండి. అప్పుడు ఉద్యోగం నిలబడుతుం ది. లేకపోతే ఇదే గుడ్ బై అనుకోండి!"

కళాకాంతులు కోల్పోయిన మొహంతో, మేనేజరు గదిలోనుంచి అతను బయటకు

## నవంబరు-2010
## చతుర ప్రహేళిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **కె.వి.సుబ్బారావు**
   - జంగారెడ్డిగూడెం, ప.గో.జిల్లా
2. **ఎ.హరికుమార్**
   - సివిల్ లైన్స్, నాగపూర్
3. **ఎస్.శరణ్య**
   - మౌలాలి, హైదరాబాద్
4. **ఎన్.జగన్మోహనరావు**
   - చైతన్యపురి రోడ్, కరీంనగర్
5. **డా.ఆర్.అనిత**
   - తార్నాక, సికింద్రాబాద్

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. స్నోబాల్ | 6. మురసాకి షికిబు |
| 2. జోన్స్ | 7. 1984 |
| 3. బాక్సర్ | 8. బోస్ |
| 4. గొర్రెలు | 9. వంశీ |
| 5. మొజెస్ | 10. రాజశేఖరం |

వచ్చాడు. ఇప్పటికిప్పుడు డబ్బు కట్టాలంటే ఎట్లా? అదీ రెండు లక్షలకు పైనేవుంది, వడ్డీతో కలుపుకుని.

ఏమీ పాలుబోక, పాత స్నేహితులు కిరీటి, సౌజన్యారావుల్ని కలుసుకున్నాడు. వాళ్లీసారి మనసువిప్పి మాట్లాడలేదు.

"నా దగ్గర డబ్బెక్కడుంది బ్రదర్? అప్పుడు గ్యారంటీ సంతకం పెట్టమంటే పెట్టాను. పెట్టినందుకు నా చెప్పుతో నేను కొట్టుకుంటున్నాను. ఇహ ఈ జన్మలో ఇంకెవరికీ, ఎప్పుడూ గ్యారంటీర్ సంతకం పెట్టకూడదు అని నిర్ణయించుకున్నాను!"

సౌజన్యారావు మరో విధంగా మట్లాడాడు. అందులో మరింత కాఠిన్యం వుంది. పైకి మాత్రం అతని మంచికోరి చెబుతున్నట్లుగా వుంది. కానీ అతన్ని నిలువునా పాతేశాడు.

"శంకరం! ఒకసారి దోమ కరించిందనుకో, ఈసారి అది అల్లంత దూరంలో ఉండగానే మన జాగ్రత్తలో మనం ఉంటాం. అట్లాగే ఒకసారి దెబ్బతిన్నవాడు రెండోసారి ఎంత జాగ్రత్త పడతాడు. నువ్వంటే నాకెంతో స్నేహభావం వుంది. కానీ ఏం లాభం? నువ్వు నీ మీద ఉన్న నమ్మకాన్ని పోగొట్టుకున్నావు. అందుచేత ముందు నమ్మకాన్ని పెంచుకో. విశ్వాసాన్ని పెంచుకో. ఆ నమ్మకం పెరిగిందనుకో, నువ్వు లక్షలడిగినా, రాతకోతలు అక్కర్లేకుండా నీ ఇంటికొచ్చి ఇచ్చిపోతారు. ఇప్పుడు నువ్వు వాళ్ల ఇంటికి వెళ్లి కాళ్లా - వేళ్లాపడి అడిగినా ఎవ్వరూ ఇవ్వరు. అంచేత నీది వృథా ప్రయాస. నీ తిప్పలు నువ్వుపడు, వెళ్లు!"

శివశంకరానికి అన్ని దారులూ మూసుకుపోయినట్లయింది. పోనీ, వెళ్లి తన మామగారు సీతారామయ్యనే అడుగుదామా? అని కూడా అనుకున్నాడు. మామగారిని అడగాలంటే ముందు సుజాతకు అసలు విషయం చెప్పాలి. తన చేతకానితనానికి ఆవిడ మాత్రం ఛీ కొట్టదూ? తన భార్యముందు చులకనైపోవడం అతనికి ఇష్టం లేకపోయింది. ఆవిడ దగ్గర లక్ష రూపాయల డైమండ్ నెక్లెస్ ఉంది. దానిని అమ్మి కొంత బరువు దించుకో వచ్చు. కానీ అది వాళ్ళ నాన్న చేయించింది. స్త్రీ విత్తం ఎప్పుడో విన్న శ్లోకంలో 'పాదం' జ్ఞాపకం వచ్చింది.

'ఉత్తమం స్వార్జితం విత్తం...
మధ్యమం పిత్రార్జితం-
స్త్రీ విత్తమధమాధమం' అన్నారు చిట్టచివర్లో. స్త్రీసంపాదన మీద బతికే మొగుడు, మగాడే కాదు. వాడికి గౌరవ ప్రతిపత్తులుండవు. తనకా బతుకు వద్దు.

పైగా ఆ డైమండ్ నెక్లెస్ పెట్టుకుని సుజాత తన కళ్ళముందు తారట్లాడుతుంటే సృష్టిలోని సౌందర్యమంతా కళ్ళ ముందు రాశీభూతమై నడయాడుతున్నట్లుంటుంది. ఆ నెక్లెస్ ఆమె మెడలో లేకుంటే, అది బోసిపోయి, చెన్ను దరిగి, తన అందాల సుజాత ఎంత దీనంగా కనిపిస్తుంది. నో! నో! నో! తను ఆ దృశ్యాన్ని భరించలేడు.

ఇప్పుడు తను లోకంలో ఒంటరివాడు. ఎవరి సహాయమూ పొందలేనివాడు! ఈ పరిస్థితిలో అతనికి మంద మలయానిలంలా, గంధపు సువాసనలా, తనలోని తండ్రి తనానికి విజయకేతనంలా, జీవన సాఫల్యాతభారానికి తొలి మెట్టులా, సీతారామయ్య ఫోను చేశాడు.

"కంగ్రాట్స్ అల్లుడుగారూ! నాకు మనవరాలు పుట్టింది. తల్లీపిల్లా క్షేమం. సుజాత మీ కోసం ఎదురుచూస్తోంది!"

ఎప్పటికప్పుడు పాపం, సుజాత తనకు ఫోను చేస్తోనే ఉంది. 'ఎప్పుడు వస్తున్నారు? ' అని అడుగుతూనే ఉంది. వెళ్తే తనలో ఉన్న చేతకానితనం ఎక్కడ బయ

టపడుతుందో అని అతనే ప్రయాణాన్ని వాయిదావేస్తూ వచ్చాడు.

నొప్పులు ప్రారంభమైన విషయాన్ని కూడా ముందుగానే తెలియజేశారు. రెక్కలు కట్టుకుని వెళ్ళి సుజాత ముందు వాలిపోయి, 'ఏం ఫర్వాలేదు, సుజీ! నేను న్నాను!' అని ధైర్యం చెప్పాలన్పించింది.

కానీ తనున్న పరిస్థితి... ఆర్థికంగా ఉన్న నైచ్యం.. అతణ్ని కదలనీయలేదు. అయితే సుజాత ప్రసవించిందన్న సంగతి తెలియగానే తనను తాను నిగ్రహించుకో లేకపోయాడు. దానికితోడు సుజాత చేసిన ఫోను అతణ్ని మరింత తొందరపెట్టింది.

"ఏవండీ! అమ్మాయి అచ్చు మీ పోలికే నండీ! ఆడపిల్ల తండ్రి పోలికతో ఉంటే అదృష్టవంతురాలవుతుందంటారు. పోలిక మీది! రంగు నాది..." ఫోనులోనే సుజాత నవ్విన నవ్వు అతనికి పంచమ స్వరంలా వినిపించింది. "ఆ ఉద్యోగాన్ని పట్టుకుని అట్లా వేళ్ళాడుతారేం? మన ఇంట్లో మహా లక్ష్మి పుట్టిందండీ, ఇహ మనకు పట్టిం దల్లా బంగారమే!"

ఎప్పుడూ సుజాత ఇంతే! క్షణం మాట్లా డితే చాలు, ఒక జీవితకాలానికి సరిపో యిన ధైర్యాన్నిస్తుంది.

ఏమైతేనేమి, ఎంత బాధపడితేనేమి, మొత్తానికి శివశంకరం భార్య దగ్గరకు వెళ్ళగలిగాడు. అత్తవారింట్లో అపూర్వమైన గౌరవాన్ని అందుకున్నాడు.

"అల్లుడుగారూ! సుజాతను ఇక్కడకు తీసుకు వచ్చినప్పటి నుంచి, మీరు ఎప్పు డెప్పుడు వస్తారా? అని ఎదురుచూస్తూనే ఉంది" అన్నాడు సీతారామయ్య, అను రాగం మిళితమైన నిందాకంఠంతో.

"ఉద్యోగంలో తీరిక దొరకలేదండీ!" ఓ చిన్న అబద్ధం. కానీ ఆ అబద్ధమే అతని అంతస్తును పెంచింది.

అత్తగారు అతణ్ని ఓ కొత్త కోణంలో గౌరవించింది.

"బాబూ! పిల్లలు పుట్టింతర్వాత, తల్లిదండ్రుల స్థితే మారిపోతుంది. పైగా తొలి చూలుగా ఆడపిల్ల పుట్టింది. అది జ్ఞాపకం ఉంచుకుని అమ్మాయి, మీరు సంసారం గడపాలి!"

ఆమె చేసిన పాయసం, ఆ క్షణంలో అతనికి తియ్యగా అనిపించలేదు. సుజాత, ఆమె పక్కన, నవారు మంచం మీద పర చిన మెత్తని పరువు మీద, మెత్తని షోలాపూర్ దుప్పటి మీద, పొత్తి గుడ్డల్లో ఉదయిస్తున్న సూర్యకాంతిని పొదువుకున్న మేఘమాలాల అంచులపై జ్వలిస్తున్న కాంతి శిఖల్లాంటి శరీర కాంతుల్లో, ఆక ర్ణాంత విశాల నేత్రాలతో, ముట్టుకుంటేనే కందిపోయే శరీర భాగాలతో, 'ఈ పిల్ల తప్పిజారి ఈ లోకంలోకి వచ్చిన ఏ దేవత సంతానమో కాదుగదా అనిపించేట్లుగా, ఓ చిన్న ఆడపిల్ల... ఆ తల్లీ పిల్లల్ని చూసి శివశంకరం మనస్సు ఆనంద డోలికల్లో విహరించింది.

'ఇంత అందమైన బిడ్డను తనకు ఇచ్చిన సుజాతకు తనేం ఈయగలడు?' అని ఆ తండ్రి తనను తను ప్రశ్నించుకున్నాడు.

'ఇంత అందమైన శిశువును తనకు వర ప్రసాదంగా ఇచ్చిన ఆ తండ్రికి తనేమి ఉపాయనం ఈయగలదు?' అని ఆ తల్లి ప్రశ్నించుకుంది.

ఇద్దరి ఆశలూ ఆ పసిబిడ్డ చుట్టూతానే తిరుగుతున్నాయి.

"ఏమండీ! దీని చేతికి బంగారు మురు గులూ, కాళ్ళకు వెండి పట్టాలూ, అయిదు వేళ్ళకు చిన్న చిన్న ఉంగరాలు నాన్నగారూ చేయిస్తారట! అమ్మేమో అమ్మవారి బొమ్మతో ఉన్న పతకంతో చిన్న గొలుసు మెడలో వేస్తుందట! మరి మీరేం చేయి స్తారు?" అడిగింది సుజాత. "మొలకు ఓ బంగారుమొలతాడూ, సిగ్గుబిళ్ళా చేయిం

చండి!" అంది సుజాత, ఏదో తక్కువలో సరిపడుతున్నట్లుగా!!

"అట్లాగే! అట్లాగే!" శివశంకరం తలాడించాడు. "నువ్వు చెప్పడం, నేను చెయ్యక పోవటమూనా? "

"ములగచెట్టు ఎక్కించకండి! ఉద్యోగానికి సెలవు పెట్టి ఇక్కడకు వచ్చి నా దగ్గర ఉండమన్నాను. వచ్చారేమిటి? ఇంట్లో అమ్మా-నాన్న కనిపెట్టుకుండటంతో సరిపోయింది. లేకపోతే.." సతాయించింది.

"వాళ్ళున్నారన్న ధైర్యంతోనే నేను రాలేదు. లేకపోతే ఇరవై నాలుగ్గంటలూ నేనే ఉండేవాణ్ని, నీ దగ్గర" శివశంకరం గొప్పగా అన్నాడు.

"పోదురూ! గొప్పలకేం తక్కువలేదు. నేను చెప్పింది ఏమీ చెయ్యరు!"

"చేస్తాను.. చేస్తాను.. చేస్తాను.. సరేనా? నువ్వు ఉద్యోగానికి సెలవ్ పెట్టమన్నావు. నేను రాజీనామానే చేసేద్దామనుకుంటున్నాను!"

"ఆం" నోరువెళ్ళబెట్టింది సుజాత.




**బా**రసాల, మూడు వారాలయ్యాక చేసుకుందామని సుజాతను ఒప్పించి, కన్న కూతుర్ని కొంతసేపు లాలించి, ఊరికి ప్రయాణమయ్యాడు శివశంకరం.

మళ్ళీ అతను పడుతున్న ఇబ్బందులన్నీ అతణ్ని చుట్టుముట్టాయి. తట్టుకోలేక పోతున్నాడు. సహోద్యోగులు, 'ఇటువంటివి కామన్, బ్రదర్! డబ్బు కట్టేయ్!! బీ హ్యాపీ!' అంటూ సలహా ఇస్తున్నారు.

'మమ్మల్ని బయట పడేయ్ శంకరం' అని కిరీటీ, సౌజన్యారావుల వేడుకోలు..

మెయిన్‌టెనెన్స్ ఎకౌంటెన్స్ కూడా బ్యాంకు బాకీకి జమ అవుతుండడంతో చేతిలో పైసాలేక, దొరికిన చోటల్లా ఊళ్ళో అప్పులు చేస్తే, వాళ్ళు కనబడిన చోటల్లా అతణ్ని పీక్కుతింటున్నారు. పాలవాడికి బాకీ! పచారీ కొట్లో బాకీ! కూరల కొట్లో అరువు! చాకలివాడికి దరువు.. చివరకు జీవితమే బరువు అనిపించింది అతనికి!!

ఇప్పుడు తన ఇంటికి వచ్చిన పసిబిడ్డకు, ఆ బిడ్డ తల్లి కోరిన మొలతాడు కూడా చేయించలేని దీనస్థితి!

ఏం చెయ్యాలిప్పుడు! ఏం చేయాలి?

చటుక్కున తాకట్ల తమ్మయ్య జ్ఞాపకం వచ్చాడు. అతను షైలాకే కావచ్చు. కానీ సమయానికి ఆదుకునేవాళ్ళు కూడా అతని వంటి వాళ్ళే!

శివశంకరం రకరకాలుగా ఆలోచిస్తూ తమ్మయ్య దగ్గరకు వెళ్ళాడు. తమ్మయ్య మోకాళ్ళ పైకి ధోవతి కట్టుకుని, నుదుటి మీద అడ్డంగా మూడ విభూది రేకలూ, వాటి మధ్య గంధపు బొట్టుతో, పెద్ద బొజ్జతో, చెవులకు ఎర్ర రాళ్ళ దుద్దులతో, వద్దామా వద్దా అన్న బట్టతలతో పై మీద ఓ కండువా వేసుకుని, వాకిట్లో వాలుకుర్చీలో కూచుని, ఎవరి తాకట్లు వాకట్లు చెయ్యాలా అని లెక్కలు సరిచూసుకుంటున్నాడు. అతను శివశంకరాన్ని చూడగానే ఆహ్వానించాడు.

"నువ్వు ఆ కుటుంబరావు కొడుకువి కదూ? " అని అడిగాడు. "మీ విషయంలో, ఆ ఇల్లు తాకట్టు పెట్టుకున్నా, వడ్డీ కూడా గిట్టుబాటు కాలేదు!" అన్నాడు విచారంగా.

## నిన్నటి నిజం

### ఆత్మోపదేశం!

దేవుడు నరసింహశాస్త్రి, భార్య గౌరమ్మతో పాటు ఉడుపి వెళ్లారు. అక్కడ సభలో భగవద్గీతపై ఉపన్యాసమివ్వాలి. సభా వేదిక నెక్కగానే 'మీకొక టెలిగ్రాం' అంటూ ఆయన



చేతికొక కాగితమిచ్చాడు పోస్ట్‌మాన్. దాన్ని చూసిన దేవుడు మొహం వివర్ణమైంది. కాని అది క్షణికమే! సభ వ్యవస్థాపకులు "ఏమిటీ టెలిగ్రాం" అన్నారు. ఆయన ప్రశాంతంగా, "నా పుస్తక ప్రచురణ గురించి వెంటనే రమ్మన్నారు. ఉపన్యాసం కాగానే కారులో కడూరు స్టేషన్‌కు తీసుకెళ్ళి బెంగళూరు రైలెక్కిస్తారా? " అన్నారు.

"దానిదేం భాగ్యం" అన్నారు వ్యవస్థాపకులు.

దేవుడుగారి ఉపన్యాసాన్ని అమోఘం అన్నారు శ్రోతలంతా. అనుకోకుండా దేవుడు గారితో కలిసి వచ్చిన బెళగెరె కృష్ణశాస్త్రిగారు ఎంతగా మెచ్చుకొన్నారంటే "దేవుడిగారి ఉపన్యాసాల్లో ఇదే అత్యుత్తమం" అన్నారు.

అయితే బెళగెరె కృష్ణశాస్త్రికి బెంగళూరు చేరుకున్నాక అసలు విషయం తెలిసింది. కోలారులో కన్నడ లెక్చరర్‌గా పనిచేస్తున్న దేవుడుగారి జ్యేష్ఠ కుమారుడు, డి.ఎన్.రాము ఆకస్మికంగా మరణించాడని టెలిగ్రామ్ వచ్చింది. మరి ఆ విషయం దాచిపెట్టి భగవద్గీతపై అంత గొప్ప ఉపన్యాసం ఎలా ఇవ్వగలిగావని కృష్ణశాస్త్రి అడిగారు. ఆ వార్త తన భార్యకు ఎలా చెప్పాలో అర్థంకాక, అక్కడ చెబితే పరిస్థితి ఎలా మారుతుందోనని చెప్పలేదన్నారు. వాస్తవానికి తన ఉపన్యాసంలో సభకు గీతోపదేశం చేయలేదని, తనకు తానే ఉపదేశించుకున్నానని అన్నారు. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' అనే ఉపదేశాన్ని తనకు అన్వయించుకొని సభలో ధైర్యంగా ఉపన్యాసం ఇవ్వగలిగినట్లు తెలిపారు.

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

---

శివశంకరం సమాధానం చెప్పలేదు. సుజాత దగ్గర నుంచి తిరిగి వచ్చేముందే తన తండ్రి ప్రస్తావన వచ్చింది.

"మనవరాలు పుట్టిన సంగతి, అత్తగారికీ, మావయ్యగారికీ తెలియజెయ్యండి" అంది సుజాత, "ఎప్పుడో చెప్పి ఉండాల్సింది మీరు! నే చెబితేగాని చెయ్యరూ? " అంటూ విసుక్కుంది.

మామగారింట్లో ఉండగానే, శివశంకరం తండ్రికి ఫోన్ చేశాడు. కుటుంబరావు ఫోను కాన్సిల్ చేసుకున్నాడు. అంచేత ఆశ్రమానికి ఫోన్ చేయాల్సివచ్చింది.

శుభవార్తను అందుకుని కుటుంబరావు మాట్లాడాడు. ఆయన కంఠంలో ఆనందం, ఉత్కంఠ వగైరా భావాలేవీ ధ్వనించలేదు.

"బావుంది. నీ భార్యకూ, కూతురికీ బాబా ఆశీర్వాదాలు అందించు! ఎప్పుడూ ఆయన మీవెంటా, ఇంటా ఉంటాడు.. శుభం!" అంటూ కాల్ కట్టేశాడు.

కామేశ్వరమ్మలో మాత్రం కొంచెం రియాక్షన్ కనిపించింది.

"బావుందిరా! మనవంశ వృక్షం ఓ కొమ్మను వేసిందన్నమాట! శుభం! ఎలా వుంది నా మనవరాలు? సుజాత కులాసాగా ఉందికదా? అడిగానని చెప్పు!"

"అమ్మా! నువ్వొసారి వచ్చి చూడమ్మా!" శివశంకరం ఆర్ద్రంగా ఆహ్వానించాడు.

"వస్తానో, రానో చెప్పలేను. అంతా బాబా సంకల్పం! మీ నాన్నగారు మొన్న అన్నారు, 'ఈ బంధం తొలిగితే తప్ప ఆ పైనున్న వాడితో అనుబంధం పెరగదని'. అంచేత మీ నాన్నగారు వస్తారో లేదో

ఆయన వస్తేకాని, నేను రాలేను కదా? "

ఇదంతా స్ఫురణకు వచ్చింది శివశంకరానికి. తమ్మయ్య తన తండ్రి గురించి ప్రస్తావన చేసేసరికి 'తన తండ్రీ-తల్లీ ఇప్పుడొక దివ్య లోకంలో ఉన్నారు. ఈ భౌతిక లంపటాలు వాళ్ళను అంటవు. ఈషణ త్రయం వాళ్ళను బాధించదు. వాళ్లు మనీషులు! వాళ్ళను గురించి తాకట్ల తమ్మయ్య లాంటివాళ్లకు మాట్లాడే అర్హత లేదు' అని తమ్మయ్యను మనసులో అసహ్యించుకుంటూనే, పైకి సానుభూతి చూపించాడు.

తమ వ్యవహారంలో నష్టం వచ్చినందుకు బాధ పడుతున్నట్లుగా నటించాడు.

"సర్లే! అయిపోయిన పెళ్ళికి మేళం ఎందుగ్గానీ, ఇప్పుడెందుకు వచ్చినట్టూ? " అంటూనే ఓ డ్రింకు తెప్పించి ఇప్పించాడు.

"తాగు! తాగు! నా దగ్గర కొచ్చినోళ్ళకు ఇట్టా నేను మరియాద సేత్తా! నాకు పడనివాడైనా సరే!"

"అది తమ సంస్కారం!" శివశంకరం ఆయనను అందలం ఎక్కించాడు.

"ఇంతకూ నువ్వెందుకొచ్చినట్టబ్బాయి? "

"ఎవరు మాత్రం తమ దగ్గరి కెందుకొస్తారయ్యా? డబ్బు కోసమేగా? "

"అంతేలే! నువ్వన్నదీ నిజమేలే! అవును గానీ నా పేరే తాకట్ల తమ్మయ్య కదా, మరి తాకట్టెట్టడానికి ఏంతెచ్చావు? "

శివశంకరం సంకటంలో పడ్డాడు. తాకట్టు పెట్టడానికి తనదగ్గరేముంది గనుక! ఇల్లు లేదు, అదెప్పుడో పోయింది. వెండి బంగారాలు లేవు. వస్తు వాహనాలు లేవు. ఏం ఆలోచించకుండా గభాలున అన్నాడు, "నా ఉద్యోగం!"

"ఏందీ- ఉద్దోగమా? తమషాగా ఉందే! ఎవురూ ఇంతవరకూ తమ ఉద్దోగాన్ని తాకట్టెట్టి డబ్బు తీసుకోలా? " తమ్మయ్య ఆలోచనలో పడ్డాడు. "సర్లే! అప్పు తీసుకుని యాడకు పోతావ్ గానీ- ఎంత కావాలేటి పైకం? "

"రెండు లక్షలు!!"

"ఏందమ్మోయ్! ఎవుడన్నా ఉద్యోగం మీద లక్షలు అప్పిస్తాడేటి? "

శివశంకరం తన తెలివితేటలన్నీ ఉపయోగించాడు, జవాబు చెప్పటానికి!

"ఇస్తాడు! బ్యాంకుల్ని తీసుకోండి. నెల జీతగాళ్ళకే ముందుగా లోన్స్ శాంక్షన్ చేస్తారు. ఎందుకంటే నెలనెలా జీతంలో కట్ చేసుకోవచ్చు కదా! ఇహ ఇళ్ళమీద, పొలాల మీద ఇచ్చారనుకోండి. ఇంటి విషయంలో రానురాను విలువ తగ్గుతుంటుందే తప్ప, పెరగదు. పొలంలో వాన వచ్చినా, ఎండ తగిలినా, నీరు తగ్గినా, ఎక్కువైనా, పంట గోవిందా! ఆ రైతు బాకీ కట్టలేడు. మీరు వెళ్ళి కట్టితీరాలి అని గొంతుమీద కూర్చుంటే ఆత్మహత్య చేసుకుంటాడు. అంచేత నాలాంటి ఉద్యోగస్థుడికి ఇవ్వడమే అన్ని విధాల మంచిది!"

తాకట్ల తమ్మయ్యకు ఆ వాదన నచ్చింది. ఇంకా కొంతసేపు గింజుకునీ, ఒట్టుపెట్టించుకుని, పకడ్బందీగా పత్రం రాయించుకుని, "మీ ఆఫీసరు గారున్నారుగా.. ఆయన చేత ఓ సంతకం పెట్టించుకు రండి!" అన్నాడు చివరగా.

ఆ మాటతో శివశంకరానికి పాము కుట్టినట్లయింది. తనకు తెలుసు, తన పై ఆఫీ

## కొత్తగాలి...



**కీచులాటను**
**ఒక లలితకళాస్థాయికి**
**తీసుకెళ్లిన ఘనులు**
**మన రాజకీయపక్షాల పక్షులు**

- ఏ. సూర్యప్రకాశ్,
నిజామాబాద్

సరుకు తనమీద నమ్మకం పోయింది. ఇప్పుడు మళ్లీ కొత్తగా ఓ అప్పు కోసం సంతకం పెడతాడా? పెట్టడు గాక పెట్టడు. మరి కింకర్తవ్యం?

ఆలోచించి, ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చాడు. ఆ సమయంలోనే పిల్లకు నామకరణం చేసుకోమని మామగారి నుండి ఉత్తరం..

రాజీనామా చేస్తావా? డబ్బు కడతావా? కోర్టులో కలుసుకుందామంటావా? అప్పుడది క్రిటికల్ కేసో, ఛీటింగ్ కేసో అవుతుందని తెలుసా? అంటూ బాస్‌గారి నుంచి గద్దింపు, బెదిరింపు..

మధ్యలో సుజాత సన్నాయి నొక్కులు.. 'నగలు చేయిస్తున్నారుగా? ' అంటూ!

ఒక నిర్ణయానికి వచ్చాడు శివశంకరం. రబ్బరు స్టాంపులు చేసేవాడి దగ్గరకు వెళ్ళాడు. ఆఫీసరుగారి డెజిగ్నేషన్‌తో ఒక రబ్బరు స్టాంపు చేయించాడు. ఆయన అడ్రసుతో లెటర్ హెడ్ ప్రింటు చేయించాడు. తనకు కావలసినవన్నీ సిద్ధం చేసి, ఆఫీసరుగారి సంతకాన్ని ఫోర్జరీ చేశాడు.

కాగితం అందుకున్న తాకట్ల తమ్మయ్య, "చూడండీ! నెలనెలా కట్టకపోతే, ఆనక మీరు నన్నేం అనొద్దు. నేనసలు లెక్క దగ్గర మాంచోణ్ణి కానని, ఎవుర్నీ లెక్కసేయనని తెలుసుగా? " అంటూ డబ్బిచ్చాడు.

వెంటనే అతను ఆఫీసరు దగ్గరకు వెళ్ళాడు. ఉద్యోగానికి లాంగ్ లీవ్ పెట్టాడు.

"అప్పున్నవాడికి లీవ్ ఎట్లా ఇస్తానయ్యా? " ఆఫీసరు అంతెత్తున్న లేచాడు.

శివశంకరం వో యాభైవేల రూపాయలు తీసి ఆఫీసరుగారి టేబిల్‌మీద పెట్టాడు. "ఇది నా ఎకౌంటులోనే జమ చేస్తారో, మీ ఎకౌంటులో జమ చేసుకుంటారో నాకనవసరం. మీరు నా జీవితాన్ని కాపాడాలి. మీరు దయదల్చకపోతే నేనూ, నా భార్యా సూసైడ్ చేసుకుంటాం. మొన్ననే పుట్టిన ఆడపిల్ల అనాథ అవుతుంది. ఆ ఉసురు మీకు తగులుతుంది!" అన్నాడు కళ్ళనిండా నీళ్ళు పెట్టుకుంటూ!

ఆఫీసరు, ఆ డబ్బువేపూ, అతని వేపూ మార్చి మార్చి చూశాడు. కొంత సేపైంత ర్వాత తల పంకించి, ఆ డబ్బు తీసి హ్యాండ్ బ్యాగులో పెట్టుకుంటూ, "సరే! నీ కన్నీళ్ళు చూసి, నీకు సాయం చేయకుండా ఉండలేకపోతున్నాను. సరే! సెలవు పెట్టు. నిన్ను సస్పెండ్ చేయడం లేదు కాబట్టి, నీకు ప్రతినెలా జీతం వస్తూనే ఉంటుంది. జీతం తీసుకుపోవడానికి ఎవర్నో ఆథరైజ్ చెయ్యి. బ్యాంకు వాళ్ళకు మాత్రం కనబడకుండా జాగ్రత్తపడు!"

శివశంకరం ఆయన రెండు చేతులూ పట్టుకున్నాడు. "మీరు దేవుడు సార్! మా నాన్నగారు చెయ్యలేని సాయం కూడా మీరు చేస్తున్నారు!" అంటూ మళ్ళీ మళ్ళీ ఆయనకు నమస్కారం చేస్తూ బయటకు వచ్చేశాడు.




**క**న్నకూతురుకు నామకరణం ఇంకా మూడు రోజులుందనగా శివశంకరం మామగారింటికి వచ్చాడు. కిరణ్మయినీ, తన బావగారినీ ఆహ్వానించాడు. తండ్రికీ, తల్లికీ తెలియపరిచాడు. వీలు చేసుకుని రమ్మనమని మరీ మరీ ప్రార్థించాడు.



# రచయితలకు సూచనలు



**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

---

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టి పెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్టులో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

**చతుర**

చిరునామా : ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082
ఈ మెయిల్ : vipula.chatura@gmail.com

వచ్చినరోజు రాత్రే సుజాతతో చెప్పాడు. "నువ్వు చెప్పినట్లే చేస్తున్నాను. ఇహ ఆ ఉద్యోగం చెయ్యను. ఇదిగో డబ్బు. నువ్వు డిగినట్లే తెచ్చాను. ఏం చేస్తావో నీ ఇష్టం. నన్నేం చెయ్యమంటావో చెప్పు!"

అతని మాటలతో ఆమె తల్లో మల్లె పూలు పకపక నవ్వాయి. చేతికున్న గాజులు గలగలలాడాయి. కాటుక కళ్ళు మిలమిలలాడాయి.

"ముందు ఓ కారు కొనండి!"

"అంత డబ్బేదీ? "

"కార్లకూ, మోటారు సైకిళ్ళకూ ఫైనాన్స్ ఇచ్చేవాళ్ళు కోకొల్లలు. మీ అక్కయ్య, బావ గారూ వచ్చేసరికి మనముందు కారుం

# కొత్తగాలి...



**నీటి చుక్కకై**
**కన్నీటి పర్యంతం ఎదురుచూపులు**
**అదే వరదల్లే ముంచెత్తితే**
**కన్నీటి పర్యంతం వెర్రిచూపులు**

– వోలేటి శ్రీనివాసరావు,
వుడాకాలనీ, విజయనగరం

డాలి. మహాలక్ష్మికి ఒంటినిండా బాలతొడుగు ఉండాలి"

"పిల్ల పేరు మహాలక్ష్మా? "

"అవునండీ! అది మనకు లక్ష్మీదేవే! బారసాల సాయంకాలమే. చీట్ల కంపెనీ ఎనౌన్స్ చెయ్యండి. ముందు యాభైవేల రూపాయల చీటీతో ప్రారంభం చెయ్యండి. మొట్టమొదటి చీటీ దేముడి పేర మనం కడదాం. రెండోది మీ అక్కయ్యగార్ని తీసుకోమనండి"

తన భార్య తెలివితేటలకు 'ఔరా' అనుకున్నాడు.

"ఇంకో విషయం సుమా!" అంది మళ్ళీ హెచ్చరిస్తున్నట్టుగా.

శివశంకరం 'ఏమిటీ' అని అడక్కుండానే మళ్ళీ సుజాత అంది. "ఇదంతా ఇక్కడ కాదు సుమా! మనం హైదరాబాద్ వెళ్తున్నాం! అక్కడ ప్రారంభిస్తున్నాం. అక్కడ చార్మినార్ బ్యాంక్‌లో ఓపెన్ చేస్తున్నాం! ఓ ఎమ్మెల్యేనూ మరో ఎంపీనీ పేట్రన్స్‌గా పెట్టుకుందాం! లోకల్ పేపర్లలో ప్రకటనలు గుప్పిచ్చేద్దాం!"

సుజాత గీచిన గీత దాటకుండా శివశంకరం ఆమె చెప్పినట్టే చేశాడు. కారు కొన్నాడు. కూతురు వంటినిండా బంగారపు తొడుగు తొడిగాడు.

బారసాలకు వచ్చిన కిరణ్మయి, సుజాత వైభవాన్నీ, తెలివితేటల్నీ చూసి అబ్బురపడింది. ఆడబిడ్డకు సుజాత ఉంగరం చేయించింది. కంచిపట్టు చీర పెట్టింది.

శివశంకరం తన బావగార్ని అడిగాడు, "బావగారూ! రాకరాక వచ్చారు మీరు. ఏం కావాలో చెప్పండి. హ్యాపీగా ఇస్తాను"

కిరణ్మయీ, పుల్లారావు బాగా ఆలోచించి "శివశంకరం! నీ వ్యాపారంలో మమ్మల్ని వాటాదార్లుగా చేర్చుకో!"

"మరి పెట్టుబడీ? " అంది సుజాత.

పుల్లారావుకూ, కిరణ్మయికీ ఆ మాట చురుక్కున తగిలింది. వాళ్ళు మొహాలు ముడుచుకున్నారు. కిరణ్మయి తటాలున తన మెళ్ళో ఉన్న డైమెండ్ నెక్లెస్ తీసి, అతనిముందు పెట్టింది. "తమ్ముడికి, ఇదే మా పెట్టుబడి!" అంది భర్త గౌరవం దెబ్బతినకుండా.

వద్దులేవే అనబోయాడు శివశంకరం.

"ఏదో తమాషాకు అన్నాను" సుజాత మళ్ళీ మాట కలిపింది. "మర్యాద కాదండీ. అది పద్ధతి! షేర్ కాపిటల్ కింద ఏదోకొంత పెట్టుబడి పెట్టాలి కదా!"

ఆ మాటతో, వాళ్ళు నెక్లెస్‌ను సుజాతకిచ్చి, చీట్ల కంపెనీలో వాటాదారులై వాళ్ళ

ఊరికి ప్రయాణమయ్యారు.

కారులో వాళ్ళను డ్రాప్ చేస్తూ, స్టేషన్లో అన్నాడు శివశంకరం, తన అక్కయ్యతో..

"అక్కయ్యా! మేనల్లుడికి ఒక్క చొక్కా-లా గూయేనా అనుకుంటున్నావు కదూ? వాడికి హైదరాబాదులో కాన్వెంట్ స్కూల్ లో చేరడానికి డొనేషన్ కడుతున్నానే! వాడు అయిదో క్లాసులోకి వచ్చేసరికి, నీ కోడలు ఎల్ కేజీలోకి వస్తుంది. ఆ తర్వాత ఇద్దరూ హాయిగా ఒకచోట ఉంటారు, ఒకచోట చదువుకుంటారు, ఒక చోట కలసి పెరుగుతారు. వయసు వస్తున్నకొద్దీ, వాళ్ళ మనసులు కూడా కలిసి పెరుగుతాయి. ఆ తర్వాత...."

"అర్థమైంది లేరా!" అంటూ కిరణ్మయి తమ్ముణ్ణి మెచ్చుకుంది.

"ఇది నా ఆలోచనేం కాదు, సుజాత ఆలోచనే!"

"నువ్వు చెప్పనక్కర్లా! నేను చూస్తూనే ఉన్నాగా!"

పిల్లవాణ్ని, భర్తనూ తీసుకుని కిరణ్మయి వెళ్ళిపోయింది.

"జాగ్రత్త! చీట్ల కంపెనీ సరిగ్గా నడుపుకుంటే అంతా లాభమే! ఏ పొరపాటు చేసినా మనం మిగలం!" పుల్లారావు హెచ్చరించాడు, గేటు దగ్గర నిలబడి.

రైలు దూరమైంది. వాళ్ళూ కనుమరుగయ్యారు. వెళ్తూ, వెళ్తూ సుజాత తన తండ్రితో అంది "నాన్నగారూ! ఈ ఊళ్ళో ఈ ఇల్లు తప్ప మీకేం ఇంట్రస్ట్ ఉంది? దీన్నమ్మేసి, మీరూ మాతో వచ్చేయండి. అందరం కలిసే ఉందాం! ఇల్లమ్మేస్తే వచ్చే డబ్బును కూడా మనం చీట్లల్లో పెట్టి, వ్యాపారాన్ని పెంచుకోవచ్చు!"

"ఇల్లు అమ్ముకోడం ఏం బావుంటుందే? " సీతారామయ్య నసిగాడు.

"వ్యాపారంలో కలసి రావాలేగానీ, ఈ కొంప ఓ లెక్కా? కొన్ని అంతస్తుల బిల్డింగ్ కొనుక్కోవచ్చు. మీరు హరికథకో, షికారుకో వెళ్ళడానికి వో కారు, అమ్మకు గుడికి వెళ్ళడానికో కారు, మీ మనవరాలు స్కూలుకు వెళ్ళడానికో కారు.. ఇట్లా కార్లు, ఫ్లాట్లు, రియల్ ఎస్టేట్ బిజినెస్...."

ఓ స్వర్గ ఖండం కళ్లముందు నిలిచింది. కార్ల మాట ఎలా ఉన్నా, తాము, తమ వృద్ధాప్యంలో కూతురు దగ్గర, వాళ్ళతోనే కలిసి ఉండవచ్చు కదా అన్నమాట ఆ వృద్ధ దంపతుల్ని ఆకట్టుకుంది. ఇల్లు బేరానికి పెట్టారు.

శివశంకరం హైదరాబాదులో చాలా కష్టపడ్డాడు. మధ్య తరగతి వాళ్ళనే ఎక్కువగా చేర్పించాడు. వాళ్ళు చీటీ డబ్బు సవ్యంగా కట్టినంతవరకూ అతని

## కొత్తగాలి...



**కొబ్బరాకుపై**
**గువ్వల జంట**
**గాలికి ఊగుతూ**
**ఉయ్యాలా.. జంపాలా**

- పినిశెట్టి లక్ష్మీశారద,
రాజమండ్రి

వ్యాపారం మూడు పూలు, ఆరు కాయలై పెంపొందింది.

చీట్లు పాడిన వాళ్ళకు, సకాలంలో డబ్బు చెల్లించాడు. మంచి పేరు తెచ్చుకున్నాడు. చీటీ కడితే 'మహాలక్ష్మి చీటీ కంపెనీలోనే కట్టాలి' అన్న పేరు వచ్చింది.

సంపాయించింది పెట్టి షేర్లు కొన్నాడు, సుజాత సలహాతో.

పిల్లను తీసుకుని ఓ మొక్కు తీర్చుకుందామని, కార్లో యాదగిరిగుట్టకు బయల్దేరారు వాళ్ళు. కార్లో వెనక సీట్లో పిల్ల పడుకొని ఉంది. ముందు సీట్లో భర్త పక్కన

కూచుని సుజాత, కన్నులరమూతలుగా మూసుకుని, క్యాసెట్ ప్లేయరులో నుంచి వస్తున్న ఓ పాటను వింటోంది. శివశంకరం హుషారుగా కారు నడుపుతున్నాడు. తెల్లవారుతున్న సమయం. కాకులు కావు కావుమంటూ ఆకసంలో ఎగురుతున్నాయి. దార్లో ఉన్న ఓ పల్లెటూళ్ళో రోడ్డుకు అడ్డంగా కొన్ని ఆవులు పడుకుని ఉన్నాయి. కార్లు, లారీలు వచ్చినా అవి లేవటం లేదు. అవతలకు కదలడం లేదు. శివశంకరం కారు మెత్తగా పరుగిడుతోంది. ఎదురుగా రెండు లారీలు వేగంగా వస్తున్నాయి. ఒకదాని హెడ్‌లైట్లలో మరొకదాని హెడ్‌లైట్లు కలసిపోతున్నాయి. ఒకదానిని తప్పించుకుని దాటి

### కొత్తగాలి...

**ఆశించడం కాదు దోస్తానం.. అంటే అందించడమే మరి!**

– పెరుక రాజు

నర్సింగాపూర్, కరీంనగర్

ముందుకు పోవాలని మరొకదాని ప్రయత్నం. ఒకడు పంజాబీలో తిడుతున్నాడు. రెండోవాడు తురకంలో. రెండూ పడుకున్న ఆవులదాకా వచ్చాయి. ఆ లారీల వేగానికి, ఆ లైట్ల కలపోతకు ఆవులు బెదిరాయి. అటు ఇటు పరుగెట్టాయి. అటుపక్కగా శివశంకరం చిన్న కారు. ఇటుపక్కగా లారీల జిగేలుమంటున్న లైట్లు.

శివశంకరం తన కారు లైట్లు వేశాడు. అతని కళ్ళల్లో లైట్లు పడ్డాయి. స్టీరింగ్ పట్టు తప్పింది. రెండు లారీలు ఒకదానిని ఒకటి వొరుసుకుంటూ మారుతీని గుద్దుకున్నాయి. కారు ముందుభాగం బాగా దెబ్బ తింది. స్టీరింగ్ వచ్చి శివశంకరానికి గుద్దుకుంది. ఫ్రంట్ డోరు వదులై, లోపలకు వచ్చి సుజాతను ప్రెస్ చేసింది. క్షణాల్లో అందరూ మూగారు. లారీ డ్రైవర్లు కనిపించలేదు. లారీలు రోడ్డుకు అడ్డంగా దెబ్బ తిని నిలబడిపోయి, ట్రాఫిక్ జామ్‌కు కారణమయ్యాయి. కిందకు కారిన రక్తం... దెబ్బలు తగిలిన మొహాలు... శివశంకరానికీ, సుజాతకూ స్పృహలేదు. వెనక సీట్లో పడుకున్న మహాలక్ష్మి ఉన్నట్టుండి ఏడుస్తోంది. అటుగా వచ్చిన ఓ ముసలవ్వ 'అయ్యాయ్యో!' అనుకుంటూ పసిపిల్లను తన చేతుల్లోకి తీసుకుంది.

అప్పడే 'హైవే' చెకింగుకు వచ్చిన ఓ పోలీసు పార్టీ యాక్సిడెంటును చూసి, వాళ్ళను, పసిబిడ్డతో సహా హైదరాబాదుకు తమ జీపులోనే పంపించింది.

స్పృహ వచ్చీరాని స్థితిలో సుజాత కలవరిస్తోంది. "అమ్మా! మహాలక్ష్మి.. మహాలక్ష్మి!"

శివశంకరం కలవరిస్తున్నాడు. "సుజీ! సుజీ!"

డాక్టర్లు వాళ్ళ టెస్టులు వాళ్ళు పూర్తి చేశారు. ఇంకా కొంతకాలం హాస్పిటల్‌లోనే ఉండాలన్నారు.

లారీల ఓనర్లు వచ్చి పోలీసులతో మాట్లాడుతున్నారు. వాళ్ల మాటలు వాళ్ళవి. డబ్బు చేతులు మారింది, కాగితాల్లో రాతలు మారాయి. ఎడమవేపు ఉన్న మారుతీ కారు, కుడిచేతి పక్కకు వచ్చింది. శివశంకరానిదే తప్పని తేలింది.

హాస్పిటల్‌లో ఉన్న శివశంకరం దగ్గరకు సి.ఐ. వచ్చాడు. అతనితో ఓ కానిస్టేబిలూ వచ్చాడు "లా ప్రకారం అయితే మీ మీద కూడా కేసు పెట్టాలి. మీ కారు ఇన్సూరెన్స్ టైం అయిపోయింది. డ్రైవింగ్

# దొరుకునా .. ఇటువంటి గురువు!

నిన్నటి నిజం

ప్రముఖ వాగ్గేయకారుడు మైసూరు వాసు దేవాచార్య మనుమడు ఎస్. కృష్ణమూర్తి మైసూరు ఆకాశవాణి స్టేషన్ డైరెక్టరుగా పని చేశారు. ఆయన డిగ్రీ చదివే రోజుల్లోని సంగతి ఇది.

తాతగారి సంగీత నేపథ్యం దృష్ట్యా కృష్ణ మూర్తిని అందరూ ఇష్టపడేవారు. వారందరిలో అధ్యాపకులు ఎల్. ఎస్. రామారావు అతడ్ని బాగా అభిమానించేవారు. ప్రిన్సిపాల్ రాలోదొర కూడా అతడి సంగీతకృషిని చాలాసార్లు మెచ్చుకున్నారు.



చదువు పూర్తయి పరీక్షలు వచ్చేశాయి. పరీక్షహాలులో అడుగు పెట్టగానే కృష్ణమూర్తితో రామారావు 'గుడ్‌లక్' అని దీవించారు. దాంతో అతనికి బాగా ఉత్సాహం వచ్చింది. చక్కగా జవాబులు రాశాడు. నిశ్చింతగా ఇంటికెళ్లాడు.

అంతలోనే సుడిగాలిలా ఇంటిముందు సైకిలు దిగారు అధ్యాపకులు రామారావు. అతని వెంట ఒక టాంగా కూడా వచ్చింది.

తమ ఇంటికి అధ్యాపకులు హఠాత్తుగా రావడంతో కృష్ణ మూర్తి, అతని తండ్రి ఏం కొంప మునిగిందోనని కలవరపడ్డారు.

"కృష్ణమూర్తీ! పద కాలేజీకి. సుఖం మరిగిన దాసయ్యా పదం మరచినట్టుంది నీ కథ. జవాబులు చక్కగానే రాసినా హాల్ టికెట్ నెంబరు వేయలేదు. నీ జవాబు పుస్తకం రాలోదొర చేతిలో వుంది. నిన్ను పిలుచుకురమ్మన్నారు. ఆయనకు సారీ చెప్పి, దానిపై నీచేతితో నెంబరు వేద్దువు. పద. నీకు సైకిలు రాదని తెలిసే టాంగా తెచ్చాను" అన్నారు రామారావు.

నెత్తిన పిడుగు పడ్డట్టయింది కృష్ణమూర్తికి. ఏంచేయాలో తెలియక విగ్రహంలా నిలబడ్డ అతడిని అధ్యాపకులే టాంగా దగ్గరికి లాక్కెళ్ళి, లోపల కూర్చోబెట్టారు.

లైసెన్స్ టోకెన్ మీ దగ్గర లేదు. రాంగ్ సైడులో డ్రైవ్ చేస్తున్నారు. అంచేత-" అంటూ కానిస్టేబిలును మిగిలిన తతంగం పూర్తి చెయ్యమని చెప్పి, వెళ్లిపోయాడు.

ఆ కానిస్టేబులు శివశంకరంతో అన్నాడు, "ఓ యాభైవేలు కొట్టించండి. మీకు ఇన్సూరెన్సు పైకం రావడానికి ఎట్లా కాగితాలు రాయాలో అట్లా రాసిస్తాం!"

"ఇచ్చేద్దామండీ!" అంది సుజాత.

ఇంట్లో ఉన్నది వాళ్లకు ఇచ్చేసి, బయట పడ్డారు కేసులేని కేసులోనించి వాళ్ళిద్దరూ! హాస్పిటలు బిల్లు ఓ లక్ష అయింది. అదే సమయంలో 'పాట' పాడిన వాళ్ళకు డబ్బు చెల్లించవలసి వచ్చింది. అయిదు చీట్లు నడుపుతున్నారు. ఒకసారి మూడు లక్షలు వాళ్లకు కట్టాలి. పులిమీద పుట్రగా అప్పు ఇచ్చిన బ్యాంకే వాళ్లు, నానా యాతనాపడి, అతని అడ్రసు కనుక్కుని, అతని మీద క్రిమినల్ కేసు వేసి, దగ్గరుండి సమన్లు అందజేయించారు. నాన్ బెయిలబుల్ వారంటు తెచ్చారు.

వాకిట్లో పోలీసుల జీపు వచ్చి ఆగింది. సుజాత ఆ జీపును చూసి భయపడి పోయింది.

ఆ జీపులో వచ్చిన సి.ఐ. అడుగుతున్నాడు "శంకరంగారు మీరే కదా? బెయిల్ తెచ్చుకొనే వరకూ మీరు స్టేషన్లో ఉండాలి. తప్పదు.. రండి!"

లోపల ఎక్కడో ఉన్న పార్వతమ్మ, మహాలక్ష్మిని ఎత్తుకుని హాల్లోకి వస్తూ, "అమ్మాయ్! దీనికి జ్వరంగా ఉందే, అల్లుడుగారితో చెప్పి ఆస్పత్రికి తీసుకుని వెళ్ళి

పెద్ద డాక్టరు కెవరికైనా చూపించమని చెప్పు!" అంటోంది. పోలీసుల్ని చూసి నోట్లో మాట నోట్లో మింగేసుకుంది.

హాల్లో ఫోను మోగింది. కిరణ్మయి. తమ్ముణ్ణి పిలుస్తోంది. శివశంకరం పోలీసుల మధ్య ఉన్నాడు. సుజాత అందుకుంది ఆ ఫోను. "సుజాతా! అవసరంగా డబ్బు కావలసి వచ్చింది. కాస్త తమ్ముడితో చెప్పి, ఓ లక్ష పంపించమని చెబుదూ? "

"లక్ష...! లక్ష! లక్ష! ప్రతి వాళ్లకూ? ఓ లక్ష కావాలి. అర్ధాంతరంగా ఎక్కడినుంచి తీసుకురావడం? "

"సుజాతా! ఏమిటీ దారి? ప్లీజ్ - ప్లీజ్... సలహా చెప్పు!"

శివశంకరం తనను పట్టుకుపోవడానికి వచ్చిన పోలీసుల్ని అవతలకు తీసుకుపోయాడు. ఏదో మాట్లాడబోయాడు. కాసేపు మాటలయ్యాయి. ఆ సి.ఐ. అన్నాడు..

"సరే! మీరు ఇంట్లో లేరని రాసుకుపోతాం! ఇందుకుగాను ఓ లక్ష ఇవ్వండి! ఓ వారం రోజులలోపు ముందస్తు బెయిలుకు అప్లై చేసుకోండి"

మళ్లీ లక్ష!

సుజాత ఆ మాటలు వింది. తన నెక్లెసు తెచ్చింది. శివశంకరానికి ఇచ్చింది.

"వాళ్ల కిచ్చేయండి!" అంది.

శివశంకరం భార్యవేపు గాజుకళ్లతో చూశాడు. నెక్లెస్ ఇచ్చి అరెస్టు వారంటు తప్పించుకున్నాడు.

కారమ్మేసి చీట్లు పాడినవాళ్లకు డబ్బు చెల్లించాడు. సీతారామయ్య తన ఇల్లు అమ్మి వచ్చిన డబ్బులో కొంత భాగాన్ని కిరణ్మయికి పంపించి ఊపిరి పీల్చుకున్నాడు.

మహాలక్ష్మిని హాస్పిటలుకు తీసుకువెళ్లి తీసుకు వస్తూ, ఆమెకున్న బాల తొడుగు 'ను కరిగిస్తున్నాడు.

తాకట్లు తమ్మయ్య ఒకరోజున ఉన్నట్టుండి ఊడిపడ్డాడు.

"ఏవయ్యా- పెద్ద మనిషీ! ఉద్యోగం పేరుసెప్పి నా కాడ్నుంచి డబ్బు నొక్కేశావు! ఉద్యోగమే నీకు లేదు గందా - యాడ్నుంచి డబ్బు తెచ్చి నా అప్పు తీరుత్తావు? " ఇంటి ముందు యాగీ మొదలు పెట్టాడు.

సుజాత లోపల్నుండి కోపంగా బయటకు వచ్చింది. "అనవసరంగా అరవొద్దు రేప్పొద్దున్న రండి. డబ్బు తీసుకువెళ్ళండి"

ఆమె ఉగ్రరూపం చూసి, కొంత తగ్గి, "అట్టాగే! రేప్పొద్దున్నొత్త! ఈకపోతే బావుండదు!" అంటూ వెళ్లిపోయాడు ఈసడింపుగా!

"ఎట్లా ఇస్తాం సుజీ? " శివశంకరం అడిగాడు అయోమయంగా.

"కంగారొద్దు. అమ్మనూ, నాన్నగారినీ ఈ రాత్రికి కాశీకి పంపించండి! మనం కూడా ఈ ఊరు వదిలి వెళ్లిపోతున్నాం. ఎక్కడైనా బతుకుదాం! డబ్బు సంపాయించుకోడానికి లక్ష మార్గాలు!! డబ్బే ముఖ్యం ఈ బతుకులో!! ఇప్పుడు ఫెయిలయినా రేపు ఫెయిలవుతామా? గెలుస్తాం అనే నమ్మకం నాకుంది. మీకు నా మీద నమ్మకం ఉంటే అది చాలు నాకు!"

శివశంకరం ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. "కట్టుకున్న భార్యమీద నమ్మకం లేకపోతే ఆ భర్త బతుకే దండగ!!" అన్నాడు.

తెల్లవారుకల్లా ఆ ఇల్లు ఖాళీ అయింది. మరోచోట మళ్ళీ వాళ్ళ జీవన పోరాటం ప్రారంభమైంది!!

ఆ పోరాటంలో పూలూ ఉన్నాయి, ముళ్ళూ ఉన్నాయి. పన్నీరూ ఉంది. కన్నీరూ ఉంది! ఈ మూడునాళ్ల బతుకులో ఈషణత్రయం వీటన్నిటికీ కారణమని వాళ్లకు తెలుసు! తెలిసి కూడా ఏమీ చేయలేని ఓ నిస్సహాయత!! ©

కాలాతీతం



ఫ్రెంచి నవల

# గార్గాంటువా అండ్ పాంటాగ్రుయెల్

ఒక విజ్ఞాన సర్వస్వంలాంటి నవల ఇది. కానీ ప్రపంచ సాహిత్యంలో చిరస్థాయిగా నిలిచిపోవటానికి కారణం మాత్రం ఇందులో 'అశ్లీలం', 'బూతు' ఉందని ముద్రపడటమే. ఔత్సాహికులు దీన్ని చదవాలనుకోవటానికి ఈ 'అపఖ్యాతి' కొంతమేరకు సాయం చేస్తుంది. అయితే కొద్దిపేజీలు తిరగేస్తే సంక్లిష్టమైన రచనా సంవిధానం, పాండిత్య ప్రదర్శన, సుదీర్ఘ వర్ణనలు, వివరాలు, చర్చలు, వాదోపవాదాలతో తల బొప్పిగట్టి 'అందని ద్రాక్షలు పుల్లన' అని ఆధునిక పాఠకులు అనుకోవటం ఖాయం.




కొందరు దీన్ని జేమ్స్‌జాయ్స్ రాసిన చైతన్య స్రవంతి నవలాశిఖరమైన 'యూలిసిస్'తో పోలుస్తారు. గార్గాంటువాలో కూడా కథనం డొంకతిరుగుడుగా ఉంటుంది. దాదాపు పన్నెండు భాషా, సాహిత్యాల ప్రస్తావనలూ, ఉదాహరణలూ సామాన్య పాఠకుణ్ణి ఉక్కిరిబిక్కిరి చేస్తాయి. విలా, వర్జిల్, సిసిరో, ప్లూటార్క్, టాసిమెన్‌లు మాత్రమే గాక, హిప్పొక్రేట్స్, గాలెన్, ప్లినీల వైజ్ఞానిక సమాచారం కూడా మనకు తెలిసుంటే పుస్తకం బాగా అర్థమవుతుంది. ఇవిగాక కింగ్ఆర్థర్ కాలంనాటి ప్రేమగాథలు, జానపద సాహిత్యం, మిస్టరీ నాటకాలు, వీరగాథలు వగైరా దీనిలోని అదనపు సొగసులు.

కథనమంతా హాస్య, వ్యంగ్య ధోరణిలో

# ఫ్రాంస్వా రాబెలా ( 1490 - 1553 )

కొన్ని కాల్పనిక రచనలు చదివితే, మనకు వాటిని రాసిన వాళ్లమీద అనేక అపోహలు కలుగుతాయి. ఆ అభూతకల్పనలు రచయిత జీవితానికి ఆపాదించి, అతని మీద ఒక రహస్య వల్మీకం నిర్మిస్తాం. అలాంటి రచయితే ఫ్రాంస్వా రాబెలా. తండ్రి ఒక సత్రం నడిపేవాడనీ, రాబెలా పచ్చి తాగుబోతనీ, సుఖలాలసత అతడి జీవితాన్ని శాసించిందనీ, చివరికి మరణశయ్యమీద కూడా దైవదూషణ చేస్తూ ప్రాణం విడిచాడనీ కథలు ప్రచారంలో ఉన్నాయి.



రాబెలా జీవిత చరిత్రను సాధికారికంగా గ్రంథస్థం చెయ్యటానికి చరిత్ర పరిశోధకులు దీర్ఘకాలం కృషిచేశారు. ఇప్పుడు మనకు తెలుస్తున్న సమాచారం ప్రకారం ఆయన 1483-1495 మధ్య పుట్టాడు. జన్మస్థలం ఫ్రాన్స్‌లోని చినాన్ వద్ద ఉన్న లా దెవినీర్. తండ్రి న్యాయవాది. సంపన్నుడే. చుట్టుపక్కల ఊళ్ళలో పలుకుబడి వున్న వ్యక్తి. సంతానంలో అందరికన్నా చిన్నవాడు రాబెలా. ఏడెనిమిదేళ్లప్పుడే క్రైస్తవ సన్యాసుల మొనాస్టరీ(ఆశ్రమం)లో ప్రవేశం చాడంటే తండ్రి ఎంత కఠినాత్ముడై ఉంటాడు! అయితే అతనికి ఆ కఠోర జీవితం నచ్చలేదని రాబెలా తొలి రచనల ద్వారా మనకు తెలుస్తుంది. అనేక మొనాస్టరీలు మారి, చివరికి మత విశ్వాసాలకు ప్రాధాన్యం ఇవ్వని ప్రీస్టుగా వైద్యవిద్య అభ్యసించాడు రాబెలా. లియాన్స్ ఆస్పత్రిలో వైద్యుడిగాను పనిచేశాడు.

ఆ రోజుల్లో లియాన్స్ మేధావులకు కేంద్రం. వారి సాంగత్యంతో సాహిత్య కృషి ప్రారంభించాడు. తన 'గార్గాంటువా' పుస్తకాలు ప్రచురించాడు.

మనం ముఖ్యంగా గమనించాల్సింది రాబెలా నాటి యూరోపియన్ సామాజిక పరిస్థితులు. అది 'సాంస్కృతిక పునర్వికాసం' (రెనాసాన్స్) ఉద్ధృతంగా కొనసాగుతున్న కాలం. మత విశ్వాసాలకు వ్యతిరేకి అని కించిత్తు అనుమానం కలిగినా పరిణామాలు తీవ్రంగా ఉండేవి. ఇవి అనవసర భయాలు కావు. రాబెలా పుస్తకాల ప్రచురణకర్త, ఎటేన్ డోలెను ఈ కారణంగానే సజీవ

సాగుతుంది. సమకాలీన ఛాందసత్వాన్ని, అధికార మదాంధులను ఎద్దేవా చేస్తూ మత మౌఢ్యాన్ని, పునర్వికాస కాలంనాటి అంధకారాన్ని ఛేదించటం రాబెలా లక్ష్యం.

నిజానికి 1532లో ఒక అనామకుడు రాసిన 'గార్గాంటువా' పుస్తకం అచ్చయ్యింది. అది చూసి రాబెలాకు ఆ కథ మళ్లీ రాయాలనే ఊహ వచ్చివుంటుందని కొంతమంది విమర్శకుల అభిప్రాయం.

ఫ్రెంచి జానపదగాథలలో, ఒక మహాకాయుని పేరు గార్గాంటువా. రాబెలా నవలలో కూడా కథానాయకుడు సౌమ్యుడే కానీ మహాకాయుడు. అతని తల్లిదండ్రుల ఆకారాలు కూడా తక్కువేమీ కాదు. వాళ్ల పేర్లు గ్రాంగూజియె, గార్గామెల్. తల్లి ఎడమ చెవిలోంచి పుట్టాడు గార్గాంటువా. పుట్టగానే, అందరు శిశువుల్లా బేరుబేరుమని కాక, 'దాహం, దాహం' అని అరిచాడు. వాడి ఆకలి తీర్చటానికి 17,913 ఆవుల పాలు అవసరమయ్యాయి. ఇక పొత్తిళ్ల కోసం కొన్ని వందల గజాల గుడ్డ కొన్నారు.

మూడేళ్లనుండి అయిదేళ్లదాకా ఇంటిదగ్గరే గార్గాంటువా విద్యాబుద్ధులు నేర్చుకున్నాడు. అందరు పిల్లల్లాగే తింటూ, తాగుతూ, నిద్రపోతూ గడిపాడు. బురదలో ఆడుకున్నాడు. చొక్కాతో ముక్కు తుడుచుకున్నాడు. ఇక్కడ రాయటానికి వీల్లేని మరికొన్ని పనులు కూడా చేశాడు. అలాంటివన్నీ ఈ గ్రంథంలో ఉన్నందునే, 'రాబెలాసియన్' అనే మాట భాషలో స్థిరపడింది.

ఈ మహాకాయుని విద్యాభ్యాసం గురించి

దహనం చేశారు.

క్రైస్తవానికి సంబంధించి రాబెలా ప్రొటెస్టెంట్ లేదా కనీసం 'ఫ్రీ థింకర్' కూడా కాదు. ఎవరినీ అగౌరవపరిచే ఉద్దేశమూ అతనికి లేదు. కానీ ఖాతరుచెయ్యనితనం, అధికార ధోరణులను ఎద్దేవా చేసేతనం అతని స్వభావంలోనే ఉంది.

'గార్గాంటూవా' ప్రచురణ తర్వాత రచయిత మీద దాడులు పెరిగాయి. ఆత్మరక్షణ కోసం, కార్డినల్ జీన్ డూ బెల్లే వద్ద వ్యక్తిగత వైద్యునిగా, సలహాదారునిగా చేరాడు రాబెలా. కొన్నాళ్ళు ఫ్రాన్సును వదిలి దేశాంతరవాసం కూడా చేశాడు.

పరిస్థితులు కుదుటపడ్డాక, తిరిగి వచ్చి యూనివర్శిటీ ఆఫ్ మాంట్ పెలీర్‌లో బి.ఎ. పూర్తి చేశాడు. మత గ్రంథాలు అధ్యయనం చేసి మధ్యయుగాల తాత్త్విక ధోరణులను ఆకళింపు చేసుకున్నాడు. న్యాయశాస్త్రం చదివాడు. గ్రీక్ వైద్యంలో నిష్ణాతుడైన రాబెలాకు డాక్టర్ ఆఫ్ మెడిసిన్‌గా గుర్తింపు వచ్చింది. చర్చి అధీనంలో వైద్యం ప్రాక్టీసు చెయ్యాటానికి అనుమతి తీసుకున్నాడు. అయితే శస్త్ర చికిత్స మాత్రం నిషిద్ధమన్నారు అధికారులు.

1532లో లియోన్‌లో శరీర నిర్మాణశాస్త్రం మీద ఉపన్యాసాలిచ్చాడు. అనేక వైద్యగ్రంథాలను అనువాదం చేసి సంకలనాలుగా ప్రచురించాడు. ఆ నగరంలో అధికారవర్గాన్ని వ్యతిరేకించే మేధావులు, మానవతా వాదులతో పరిచయమేర్పడింది. వాళ్లే అతణ్ణి 'సజీవదహనం' వంటి శిక్షల నుంచి అనేకసార్లు రక్షించారు. అప్పటికి రాబెలా వయసు కేవలం నలభై ఏళ్లే. మతదూషణ, అశ్లీలత ఉన్నాయన్న కారణంతో 1532లో అచ్చయిన 'పాంటాగ్రుయెల్'ను అధికారులు ఆంక్షలు విధించారు. మరోవైపు శవాలను కోయడంతో తనంతటివాడు లేడని పేరు తెచ్చుకున్నాడు రాబెలా. పుస్తకాలతో ఎందర్ని బాధించినా, వైద్యుడిగా ఎందరికో ప్రాణభిక్ష పెట్టాడీ రచయిత. ఆయన 'హస్తవాసి' గురించి యూరోపియన్ దేశాలలో చాలా ప్రచారం జరిగింది. రాబెలా స్పర్శ తగిలితే చాలు, 'శవం కూడా లేచి కూర్చుంటుంది' అన్నారు.

1564లో అచ్చయిన పాంటాగ్రుయెల్ అయిదో భాగం తక్షణ నిషేధానికి గురైంది. వైద్యునిగా, పండితునిగా, విద్యావేత్తగా, మానవతావాదిగా రాబెలా ఇప్పటి వారికి గుర్తులేదు. 'రాబెలాసియన్' అంటే 'విశృంఖలత'కు పర్యాయపదంగా మారిపోయింది. దానికి కారణం 'పాంటాగ్రుయెల్ అండ్ గార్గాంటువా' రచనే.

'మదిరోన్మత్త తాత్త్వికుడు రాబెలా' అన్నాడు వోల్టేర్ ఆయనను ప్రశంసిస్తూ.

రాయడానికి అనేక అధ్యాయాలు కేటాయిస్తాడు. రచయిత మధ్యయుగాలనాటి మూర్ఖత్వం మీద, విద్యావిధానం మీద నిశిత వ్యంగ్యాస్త్రాలు సంధించాడు. ఎంత చదివినా సహజంగా ఉన్న బుద్ధీ, జ్ఞానం కూడా పోగొట్టుకుని మరబొమ్మలా తయారయ్యాడు కుర్రాడు. బెత్తం విరిగితే తప్ప విద్యార్థుల కేమీ ఒంటబట్టదని ఆనాటి ఉపాధ్యాయుల నమ్మకం మరి.

అది దూరప్రయాణమైనా, కొడుకును పారిస్‌కు పంపించాడు తండ్రి. అక్కడి విద్యావిధానం పూర్తిగా భిన్నమైంది. పుస్తకాలనుండే గాక, ప్రాక్టికల్స్ ద్వారా కూడా జ్ఞానార్జన జరుగుతుంది. పాఠాలు వింటారు. దర్జీలు, నేతగాళ్లు, గడియారాల తయారీదార్లు, ప్రింటర్లు, స్వర్ణకారులు మొదలైన వృత్తి నిపుణుల పనిని స్వయంగా చూసి నేర్చుకుంటారు. మూలికావైద్యం, ఇతర మందుల గురించీ అధ్యయనం చేస్తారు. ఆనాటి వైజ్ఞానిక, అభ్యుదయ దృక్పథాన్ని సమర్థించటం, రచయిత మానవతా వాదానికి నిదర్శనం. ఇలాంటి రచనలు చెయ్యటమంటే, ఆనాటి అధికారవర్గాలతో నేరుగా తలపడటమే.

గార్గాంటువా తండ్రికి పొరుగు దేశం రాజు పైక్రోబోల్‌తో చిన్నతగువు వస్తుంది. దానికి కారణం పైక్రోబోల్‌కు చెందిన కొందరు వ్యక్తులు, గార్గాంటువాకు చెందిన రొట్టెల్ని దొంగిలిస్తారు. ఇలాంటి చిన్న చిన్న పంతాలు, పట్టింపులు, అల్ప విషయాల కార



కుంభకర్ణుడిని తలపించే గార్గాంటువా

ణంగానే నాటి భూస్వామ్య-రాచరిక పాలనలో యుద్ధాలు జరుగుతుండేవి. ఇక్కడ కూడా ఆ తగవు కాస్తా యుద్ధంగా పరిణమిస్తుంది. తనకు సాయంగా కొడుకును పారిస్ నుండి పిలిపించుకుంటాడు తండ్రి. అరివీర భయంకరమైన గార్గాంటువా, యుద్ధంలో శత్రువును అవలీలగా మట్టికరిపిస్తాడు.

నవల రెండో భాగంలో గార్గాంటువా, బాడెబెల్‌ను పెళ్లాడుతాడు. ఆమె తండ్రి యుటోపియా దేశపురాజు అమారాట్. వాళ్ళ సంతానమే పాంటాగ్రుయెల్. ఇది అప్పటికే అందరికీ సుపరిచితమైన మరో జానపద పాత్ర.

గార్గాంటువాకు 484 ఏళ్లప్పుడు పాంటాగ్రుయెల్ పుట్టాడని చాలా కచ్చితంగా చెబుతాడు రచయిత. పుట్టినప్పుడు శిశువు ఎంత బరువున్నాడంటే, ప్రసవంలోనే మరణించింది తల్లి. తండ్రిలాగే, విద్యాభ్యాసం కోసం పారిస్‌కు వెళతాడు పాంటాగ్రుయెల్. అక్కడ పానర్జ్‌తో పరిచయమేర్పడుతుంది. పానర్జ్ వయసు 45. ఒక జబ్బు అతణ్ణి కుంగదీస్తుంది. అది అందరికీ తెలిసిన 'పేదరికం' అనే జబ్బే. ఆ నాటి సమాజంలోని దుర్భర దారిద్ర్యాన్ని రచయిత ఎత్తి చూపుతాడు. సాధారణంగా మర్యాదస్తులందర్లాగే, అతడూ తన పరువు ప్రతిష్ఠలకు భంగం కలుగకుండా దొంగతనాలు చేస్తుంటాడు. అలా తాత్కాలికంగా ఉపశమనం పొందుతుంటాడు. అంటే పొట్ట పోసుకోవడం గురించి కాదు మనం మాట్లాడుతున్నది. మద్యం, మగువ లేకుండా ఉండలేడతడు. 'కనీసావసరాలు' తీర్చుకోవటానికైనా, ఎంతో కొంత సంపాదించక తప్పదు. ఇలాంటి చిన్న చిన్న విషయాలు మినహాయిస్తే అతడు సచ్ఛీలుడే.

ఇక మూడోభాగంలో పాంటాగ్రుయెల్ సాహసకార్యాలూ, 'సూక్తులూ' ఉంటాయి. పానర్జ్‌ను పెళ్ళి చేసుకోవాలని కోరిక కలుగుతుంది. దానికోసం అతడు మిత్ర బృందంతో ఒరాకిల్ (భవిష్యవాణి) ఆఫ్ హోలీ బాటిల్ (పవిత్ర కలశం) సలహాకోసం సుదీర్ఘ ప్రస్థానం ప్రారంభిస్తాడు. దారిలో అనూహ్య పరిస్థితులు ఎదురవుతాయి. వింత చేష్టలు చేసే విచిత్ర వ్యక్తులు తారసపడతారు. ఉత్కంఠభరితమైన అనేక సంఘటనల తర్వాత వాళ్లు దీపదేశం, లాండ్ ఆఫ్ లాంటర్న్స్ చేరుకుంటారు. అక్కడ వేడినీటి సరస్సులో దర్శనమిస్తుంది 'కలశం'. ఆ దేశంలోని ప్రధాన దేవాలయంలో పుజారిణిగా వున్న బాక్‌బక్ సాయంతో కలశం బోధించిన జీవనరహస్యం గ్రహిస్తారు. అయితే ఇంతకూ ఆ కలశం పలికింది ఒకే ఒక్క మాట, 'ట్రింక్'. అంటే 'డ్రింక్' అని అర్థం అంటుంది పూజారిణి. అలా ముగుస్తుందీ కథ.

గొప్ప నవలల్లో కథ ముఖ్యం కాదు. తమ ప్రాపంచిక దృక్పథం పాఠకులతో పంచుకోవటానికీ, సమకాలీన సమాజ చిత్రణకు కథను వేదికగా ఉపయోగిస్తారు రచయితలు. విషయ ప్రాముఖ్యతే లేకపోతే ఈ ఫాంటసీ నేటికీ చర్చనీయ గ్రంథంగా ఉండేదే కాదు.

ఆనాటి నిరంకుశత్వానికీ, మత ఛాందసానికి నిరసనగా తిరుగుబాటు బావుటా

# చిరాయువు



డెబ్బైఒక్క ఏళ్ళ థామస్ జెన్నింగ్స్, అమెరికాలోని అదృష్టవంతుడైన వ్యక్తిగా పేరొందాడు. టెన్నిస్సీ రాష్ట్రానికి చెందిన అతను పన్నెండుసార్లు చావునుంచి తప్పించుకున్నాడు.

పదమూడో ఏట మలేరియాతో ఐదు నెలలు కేవలం సూప్‌తో జీవించి బతికి బట్టకట్టాడు. ఆ రోజుల్లో మలేరియాతో చాలామంది మరణించారు.



రెండో ప్రపంచ యుద్ధంలో నర్మాండీలోని ఒమహా బీచ్‌లో యుద్ధంలో పాల్గొని తుపాకి గుండు తగిలినా బతికాడు. అంతకు ముందే మందుగుండు సామగ్రి గల ట్రక్‌ను డ్రైవ్ చేస్తూ, ఆగిపోయినదాన్ని దిగి తోస్తున్నాడు. అది పల్లంలోకి కొన్ని అడుగులు ముందుకి వెళ్ళి, లాండ్‌మైన్ మీదకి ఎక్కి పేలిపోయింది. థామస్‌కి మాత్రం ఏమీ కాలేదు.

కొరియా యుద్ధంలో కూడా ఐదుసార్లు చావునించి తప్పించుకున్నాడు. ఓసారి పెన్సిలిన్ ఇంజక్షన్ ఇవ్వడంతో రియాక్షన్ వచ్చింది. కాని సమయానికి డాక్టర్ మందిచ్చి రక్షించాడు.

అతని మొదటి భార్యా ఓసారి పోట్లాడుతూ మాంసం కొట్టే కత్తితో నాలుగుసార్లు అతన్ని పొడిచింది. అదృష్టవశాత్తూ ముఖ్య అవయవాలకి ఏమీ కాలేదు. 1967లో ఓ ఇల్లు కడుతుంటే, పైకప్పు కూలి ఎడమ చేతి ఎముకలు విరిగాయి. 1987లో క్లోమగ్రంథి వాచి నాలుగు రోజులు కోమాలో ఉండి బతికి బయట పడ్డాడు. ఇంకా ఎన్నెన్ని ప్రమాదాలను తప్పించుకుంటాడో!

ఎగరేసిన రాబెలా, 'నీ ఇష్టం వచ్చినట్టు చెయ్యి' అంటూ ఉద్బోధించాడు. పాంటాగ్రుయెల్ పాత్ర 'దాహానికి' ప్రతీక. శారీరక సంబంధాల మాధుర్యం, ప్రకృతి అందాలు, విజ్ఞానం, కళలు, సారస్వతం తనివితీరా గ్రోలి దాహం తీర్చుకోవాలి. 'మనిషిగా పుట్టిన నా ఊహల హర్మ్యానికి సజీవ వ్యక్తులే పునాది రాళ్లు' అన్నాడు రాబెలా. మొదటి రెండు భాగాలలో శారీరక ధర్మాల గురించి, స్త్రీల గురించి మొరటుగా వర్ణించిన మాట నిజమే.

రాబెలా కథాకథన సంవిధానం అద్భుతం. పదునైన హాస్యం, వ్యంగ్యం తొణికిసలాడుతుంది. సమకాలీన ఫ్రెంచి యూరోపియన్ సమాజంలోని రుగ్మతలపై ఎక్కుపెట్టిన ఘాటైన విమర్శ అతనికి ఎంతోమంది శత్రువులను సంపాదించి పెట్టింది. అయితే దాని వల్లనే నేడు మనం రాబెలా అభ్యుదయ, మానవతా దృక్పథానికి జోహారులర్పిస్తున్నాం. ఈనాటికీ అతని రచనకున్న ప్రాముఖ్యం అంతరించలేదు. ఇక ఇది కల్పిత కథే అయినా, వందలాది పుస్తకాల, క్రీడల, రచయితల, సంగీత కళాకారుల, పాకశాస్త్ర ప్రవీణుల, సామెతల, పిట్టకథల, మొక్కల, జంతువుల, సరీసృపాల ప్రస్తావనలతో ఒక గొప్ప విజ్ఞాన సర్వస్వమనిపిస్తుంది. మాటల గారడీలో కూడా రాబెలా సిద్ధహస్తుడు. ఆయన ఫ్రెంచి భాషలో 600 కొత్త పదాలు ప్రవేశపెట్టాడు. అలా ఆయన ఆ భాషాభివృద్ధికి దోహదం చేశాడు. ఈ ప్రత్యేకతలన్నీ ఆ రచనల అనువాదాల్లో ఆస్వాదించలేం.

**–ఎం.వసంత**




# ఆధునిక నవలేతిహాసం మాలపల్లి



**ఉన్నవ లక్ష్మీనారాయణ 'మాలపల్లి' నవల ఇరవయ్యో శతాబ్ది తెలుగు సాహిత్యంలో ఉత్కృష్ట రచనగా గణుతికెక్కింది. ఈ శతాబ్దంలో వచ్చిన ఉత్తమోత్తమ గ్రంథాలలో ఇరవైని లెక్కిస్తే, మొదటి పదింటిలోనే ఉన్నవవారి మాలపల్లి పరిగణనకు వస్తుంది. సమకాలీన ప్రముఖ సాహితీవేత్తల ప్రశంసలకు పాత్రమయింది. అస్పృశ్యుల సామాజిక దయనీయ జీవితాన్ని చిత్రిస్తూ భారతీయభాషల్లో వచ్చిన తొలి నవల మాలపల్లి ఆధునిక నవలేతిహాసంగా ప్రసిద్ధికెక్కింది.**

**ఈ** సమస్త సృష్టి పంచభూతాత్మకం అయినట్లు ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లిని కూడా ప్రధానంగా ఐదు అంశాల పరంగా వ్యాఖ్యానించుకోవాలి. ఇతివృత్తం, భాష.. శైలి, సామాజిక వాస్తవ చిత్రణ, సృజనాత్మక ప్రతిభ, సాహిత్య ప్రయోజనం అనే ఐదంశాలను ఈ బృహద్రచనలో ఉన్నవవారు సమర్ధంగా నిర్వహించారు. అందువల్లే ఈ 'మాలపల్లి' ఆధునిక నవలేతిహాసం అవుతోంది. ఈ అంశాలను నవలలో ఎలా నిర్వహించారో సమీక్షించే ప్రయత్నమే ఇది.

రెండు ప్రపంచయుద్ధాల మధ్యకాలంలో తెలుగుసాహిత్యంలో ఓ కొత్త ప్రపంచాన్ని ఆవిష్కరించారు ఉన్నవవారు. తెలుగు నవలాసాహిత్యానికి వారు తెచ్చిన ఆధునికత అది. తెలుగు నవల ఆవిర్భవించి అప్పటికి ఏభై సంవత్సరాలై ఉంటుంది. ఉన్నవకు పూర్వం ఏభై సంవత్సరాల్లో కానీ. తర్వాత ఏభై సంవత్సరాల్లో కానీ మళ్లీ మాలపల్లి వంటి రచన రాలేదు. అదీ ఆయన ప్రతిభ. ఆ రచన విశిష్టత.

చారిత్రక కోణంలో చూస్తే తెలుగు నవలా రచనకు 1872లోనే మొదటి ప్రయత్నం జరిగినట్లు చెప్పవచ్చు. ఆ తర్వాత ఆరేళ్లకు వీరేశలింగం పంతులు గారి రాజశేఖర చరిత్ర వచ్చింది. అయితే అది ఆయన స్వతంత్ర రచన కాదు. అనువాదం కాదు కానీ, అనుసరణం అని చెప్పవచ్చు. ఇంగ్లీషులో దానికి మాతృక ఉంది. ఆ విషయం వీరేశలింగంగారే స్వయంగా చెప్పారు కూడా. వీరేశలింగం తన సృజనాత్మక ప్రతిభనంతా ఆ నవలలో దర్శింపజేశారు. ఆలివర్ గోల్డ్‌స్మిత్ 'ది వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' ఆధారం చేసుకొని రాజశేఖర చరిత్ర రచించినట్లు వీరేశంగారే చెప్పి ఉండకపోతే ఎవరూ కనుక్కోలేనంత చక్కగా రచించారాయన. పత్రికలో ధారావాహికంగా వచ్చిన మొట్టమొదటి నవల కూడా రాజశేఖర చరిత్రే. ఈ

## ఆధునికత అంటే ఏమిటి?

ఆధునికత అంటే కాలసంబంధం కాదు. భవిష్యద్దర్శనం. సామాజిక పరిణామాలు ఏవిధంగా రూపుదిద్దుకుంటాయో, రూపుదిద్దుకోవాలో నిరూపించగలగటం. గతాన్ని స్పష్టంగా దర్శించి, వర్తమానాన్ని అర్థం చేసుకొని, మంచి గతమున కొంచెమేనోయ్, మందగించక ముందుకడుగేయ్ అని ప్రతిపాదించగలగడమే ఆధునికత. వర్తమాన సామాజిక సమస్యలతో ఏమీ సంబంధం లేకుండా, గతకాలం గుణ కీర్తనంగాని, వర్తమాన కాలానికి జవాబుదారీ వహించని పాండిత్యం ప్రదర్శనంగాని ఆధునిక దర్శనం కాదు. ఆ రచయిత మన సమకాలికుడే కావచ్చు. వేషభాషలలో, సాంఘిక వ్యవహారాలలో మన సమీపవర్తి అయి ఉండవచ్చు. పురాణకథలను, గడచిన కాలపు అలంకారాలతో, ఛందాలలో చెప్పడం ఆధునికత అనిపించుకోదు. ఈ దృష్టితో చూచినప్పుడు ఇరవయ్యో శతాబ్ది సాహిత్యంలో ఆధునికత.. కథా ప్రక్రియ, నవలా ప్రక్రియలతో ప్రారంభమైంది కాని భావ కవిత్వంతో మట్టుకు కాదని చెప్పాలి. పౌరాణిక నాటకాలతో కానే కాదు. చారిత్రక నవలలో ఆధునిక స్పర్శ ఏ కొంచెమో ఉంటే ఉంటుందేమో కానీ, సాంఘిక నవలలో మాదిరిగా వస్తు, శిల్ప, భాషాగతంగా, వాస్తవికతపరంగా కనిపించే నవీనతను మాత్రం అందులో మనం ఎంతమాత్రమూ ఆశించలేం.

నూటముప్పైరెండేళ్ల కాలంలో రాజశేఖర చరిత్ర ముప్పై ప్రచురణలైనా పొంది ఉంటుంది. తెలుగు నవలా రచనలో ఆధునికతను దర్శింపజేసింది వీరేశలింగమే. ఆ ఆధునికతను వస్తు, శిల్ప, భాష, శైలి అంశాల్లో పరిపుష్టం చేసి, మరింత విశాలం చేసినవారు ఉన్నవ లక్ష్మీనారాయణ.

### వీరేశలింగం... ఉన్నవ..

ఆసక్తికరమైన విషయం ఏమంటే ఉన్నవ లక్ష్మీనారాయణ రాజమండ్రి వెళ్లి సంఘ సంస్కరణలోనూ, తత్సంబంధమైన సంస్థా నిర్వహణలోనూ వీరేశలింగంగారి దగ్గర తర్ఫీదు పొందారు. ఉన్నవవారి ఆహ్వానంపై వీరేశలింగంగారు గుంటూరు వచ్చి అక్కడ సంఘ సంస్కరణ కార్యకలాపాలకు ఆసరా అందించారు. తెలుగునాట సంస్కరణ భావాలను వ్యాపింపజేసిన రెండోతరం వారిలో ఉన్నవవారు అగ్రగణ్యులు. వీరేశలింగంగారిది మహానది ప్రయాణమైతే, ఉన్నవవారిది సముద్రతరణం వంటిది. ఆయన ఐర్లాండు వెళ్లి అక్కడ బారిస్టర్ కూడా చదివారు. సామాజిక రాజకీయ ఆర్థిక సారస్వత ఉద్యమాలను, చైతన్యాన్ని ఆయన ఐర్లాండులో అధ్యయనం చేశారు. వీరేశలింగానికి ఒక తరం తరవాత పుట్టారు ఉన్నవ. ఆ ఆధునికత ఆయనలో స్పష్టంగా కనిపిస్తుంది.

**ఉన్నవ లక్ష్మీనారాయణ జయంతి 4న**

### అంతకు పదింతలు

వీరేశలింగంగారి రాజశేఖరచరిత్ర నవలకు పది రెట్లు పెద్దది ఉన్నవ రచించిన మాలపల్లి. ఇద్దరూ బ్రహ్మ సమాజాభిమానులే. అయితే ఉన్నవవారిది విశాల దృక్పథం. గతాన్ని పూర్తిగా తోసిరాజనలేదూ, ఖండించనూ లేదు. చీకటి కడుపునే సూర్యుడు పుడతాడనేది ఉన్నవ దృక్పథం. ఉన్నవవారిది సమన్వయ దృష్టి. వీరేశలింగం తెలుగునాట రాజరామమోహనరాయ్ వారసులు. ఉన్నవ వివేకానందుడి అనుయాయి అనిపిస్తుంది. వీరేశలింగం ఆశయం చెడుగు నిర్మూలనం. ఉన్నవ ప్రయత్నం బడుగుల జీవన పునర్నిర్మాణం. రామమోహనరాయ్‌నీ, ఈశ్వరచంద్ర విద్యాసాగరుడిని ఒక వేదికమీద సమావేశపరచినవారు వీరేశలింగం. తిలక్ మహారాజునూ, గాంధీజీని

## పురుషార్థాల సంకేతం..?

సంప్రదాయాన్ని ఆధునిక భావాలతో అనుసంధించిన విధానం మాలపల్లి నవలలో కనపడుతుంది. ఈ నవలను నాలుగు భాగాలుగా రచించడంలో చతుర్విధ పురుషార్థాల సంకేత స్ఫురణ కూడా ఉందేమో అనిపిస్తుంది. భక్తి జ్ఞాన కర్మ మార్గాలను ఈ నవలలో ఉన్నవ వారు వ్యాఖ్యానించారు. దేనినీ కాదనలేదు, దేనినీ వద్దనలేదు. అవసరమైన వారికి విగ్రహారాధన కూడా తోడ్పడుతుందనే ఆయన తీర్పులాగా కనిపిస్తుంది. బ్రహ్మసమాజం, ప్రార్థనా సమాజం, ఆర్యసమాజం త్రిపుటీకరణం కూడా మాలపల్లిలో నిర్వహించారు.

సమన్వయ పరచినవారు ఉన్నవ. ఇద్దరూ ఏకేశ్వరోపాసకులే. వీరేశలింగం విగ్రహారాధనను నిరసించారు. ఉన్నవ నిరసించలేదు. మాలపల్లి మొదటిభాగం పదకొండు, పన్నెండు అధ్యాయాలు భారతదేశంలో చిరకాలంగా వర్ధిల్లుతూ వస్తున్న శక్త్యారాధనకు సంబంధించినవి. పదకొండో అధ్యాయం పేరు 'దేవాలయం', పన్నెండో అధ్యాయం పేరు 'అమ్మవారు'. ఈ దేవత పేరు 'మూలాంకురాంబ'. ప్రజల నోళ్లలో 'మూలగూరమ్మ' అయింది. ఈమెను ఆదిశక్తి, పరాశక్తి అని వర్ణిస్తారు ఉన్నవవారు. సమస్త సృష్టికి ఆమే ఆధారం. పదహారో శతాబ్దంలో అక్బర్‌పాదుషా సేనాని అమీన్‌ముల్కే తెలుగుదేశంపై దండెత్తి వచ్చాడు. అప్పుడు ఈ దేవాలయం కొంత భాగం శిథిలమైంది. ఆ అమీన్‌ముల్కే తన పేరుమీద అమీనాబాద్ ఊరు కట్టించాడు. ఈ విషయాలన్నీ ఈ రెండు ప్రకరణాలలో ఉన్నవ రాశారు.




### వందకు పైగా పాత్రలు

స్థావర జంగమాలు, ప్రకృతి సౌందర్యం, ఆచారాలు, విశ్వాసాలు, సాంఘిక జీవనం, సాంఘిక వ్యవస్థ సంబంధులుగా మాలపల్లిలో నూరుకుపైగా పాత్రలను లెక్కించవచ్చు. మాలపల్లి మొత్తం తొంభైమూడు చిన్న చిన్న అధ్యాయాలుగా విభక్తమైంది. పల్లెసీమల వాడుక భాష ప్రయుక్తమైంది. అందువల్ల సహజత్వమేర్పడింది.

ఈ నవలలో ఇతిహాస లక్షణమైన సంపూర్ణత సిద్ధించింది. ప్రతివ్యక్తిలోనూ సహజాతాల ప్రభావం ఉంటుంది. తమకు తెలిసినా, తెలియకపోయినా వీటి తీవ్రత మానవుడిపై పనిచేస్తుంది. ఇంగ్లీషులో వీటిని 'ఇన్‌స్టింక్ట్స్' అంటారు. సహజాతం అంటే తనతో సంక్రమించేదన్నమాట. ప్రధానంగా ఇవి ఆరు అని ఆధ్యాత్మిక వేత్తలు, ఇంద్రియ నిగ్రహ ప్రయత్నపరులు చెబుతారు. ఈ సహజాతాలను శత్రువులుగా, ఆత్మోన్నతికి ఆటంకాలుగా భావిస్తారు. వీటిని అంతఃశత్రువులుగా పేర్కొంటారు. ఈ ఆరూ ఏమంటే కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం అనేవి. ఈ ఆరింటిని పాత్రగతంగా జీవిత ప్రాతిపదిక చిత్తవృత్తులను విశ్లేషించారు మాలపల్లిలో. అందువల్లే ఇతిహాస నవల అయింది.

### కథాక్రమం..

మంగళాపురంలో మాగాణీ, మెట్టా కలిపి చౌదరయ్య ఎనిమిది వందల ఎకరాల భూస్వామి. లక్ష రూపాయలపైన

## ఇతిహాసమంటే...

మాలపల్లిని ఇతిహాసం అని చెప్పడానికి కారణాలేమిటి? భారతీయ సాహితీ సాంస్కృతిక సంప్రదాయంలో రామాయణ, భారతాలు ఇతిహాసాలు. ఇలా జరగటానికి ఆస్కారముంది, ఈ కథలు ఇలా జరిగాయి అని మానవ స్వభావాన్ని, ప్రవృత్తులను వర్ణించే, వ్యాఖ్యానించే సన్నివేశాలు, సంఘటనలు ఏ రచనలో ఉంటాయో దానిని భారతీయ సాహిత్య సంప్రదాయవాదులు ఇతిహాసమంటారు. అత్యంత మౌలికమైన చిత్తవృత్తులు ఇతిహాసాలలో వర్ణితమవుతాయి.

ఒక సంఘటనలో, ఒక సన్నివేశంలో, ఒక సంఘర్షణలో, ఒక వికర్షణలో ఆయా పాత్రలు ఇలా ప్రవర్తిస్తాయి.. చిత్తగత సంస్కారాలు, ఉద్వేగాలు, ఉద్రేకాలూ, స్వభావాలూ ఇలా ఉన్ముఖమవుతాయి.. ఇలా విన్యసిస్తాయి.. ఇలా పర్యవసిస్తాయి.. అనే రీతిలో సజీవపాత్ర చిత్రణ ఉంటుంది. అయితే స్వభావ వైవిధ్యం, వైరుధ్యం వర్ణితం కావడానికి చాలా పాత్రలు అవసరమవుతాయి.

కవికె (నగదు) కూడబెట్టాడు. అయినా పరమలోభి. కాకికి ఎంగిలి చేయైనా విదపని పిసినారి. ఇంకా ఇంకా ఆస్తి, రొక్కం ఎట్లా సంపాదించాలి? అని ఒకటే తాపత్రయం. వ్యవసాయకూలీలకు రోజుకూలి ధాన్యంగా కాక, డబ్బు రూపేణా ఇస్తానని మంకుపట్టు పడతాడు. తన మాటను ఎవరైనా వ్యతిరేకిస్తే పాము లాగ పగపట్టే స్వభావం అతడిది. లోభత్వమే కాక పరమక్రోధ స్వభావం కలవాడు. చౌదరయ్య వ్యవసాయపు పనులన్నీ అజమాయిషీ చేసే మాలకులస్థుడైన సంగదాసు, ఇందులోని సాధక బాధకాలు, దగ, అన్యాయం చౌదరయ్యకు వివరించి చెబుతాడు. అందువల్ల చౌదరయ్య అతడిపట్ల క్రోధం పెంచుకుంటాడు. చుట్టుపక్కల గ్రామాల్లోని కూలీలను సమ్మె కట్టడానికి ప్రోత్సహిస్తున్నాడని సంగదాసుపట్ల మరింత కసి పెంచుకుంటాడు. దీనికితోడు తన కొడుకు రామానాయుడు సంగదాసు పక్షం వహించడం, అతని పట్ల సానుభూతి చూపడం, దయాదాక్షిణ్యం, దానం ధర్మం, ఆధ్యాత్మిక ప్రవృత్తి కలవాడు కావటం చౌదరయ్య జీర్ణించుకోలేకపోతాడు. బెజవాడలో సంఘసంస్కరణ సభ ఒకటి జరిపి, రామానాయుణ్ణి దానికి తీసుకుపోతాడు సంగదాసు. ఆ సభలో కార్మికోద్యమ ప్రయత్నాలపై తీర్మానించడం చౌదరయ్యకు దుర్భరమవుతుంది. ఆ సభనుంచి రామానాయుడు తన భార్యాపిల్లలను వెంటబెట్టుకుని రావడానికి అటే నాదెండ్ల వెళతాడు. సంగదాసు ఒక్కడే మంగళాపురం వస్తాడు. క్రుద్ధుడైన చౌదరయ్య రాగోలతో (చెర్నాకోల వంటిది, రాతితో చేసిన పనిముట్టు) కొట్టగా సంగదాసు తలపగిలి చనిపోతాడు. హత్యానేరం తలచుకొని చౌదరయ్య కిందుమీదవుతాడు. సంగదాసు హతుడైన చోటనే అంటే చౌదరయ్య స్థలంలోనే ఊరివారు అతడి సమాధి నిర్మిస్తారు. అది చౌదరయ్యకు ఇష్టముండదు. ఊళ్ళో మునసబుకూ చౌదరయ్యకూ చిరకాలం నుంచీ స్పర్ధలుంటాయి. పోటాపోటీలుంటాయి. మునసబు చౌదరయ్యపై కక్ష తీర్చుకోవాలని ఉద్యుక్తుడవుతాడు. పోలీసులకూ, కోర్టులకూ చాలా ధనం వ్యయంచేసి, బలమైన సాక్ష్యా



ఉన్నవ లక్ష్మినారాయణ

### ప్రముఖుల ప్రశంసలు

ఉన్నవవారు మాలపల్లి నవలలో క్రమానుగతంగా చాలా బలమైన కార్యకారణఘట్టాలు సృష్టించారు. గొప్ప ప్రతిభావంతుడికి తప్ప ఇటువంటి రచన చేయడం సాధ్యం కాదు. అందువల్లనే నాటి ప్రముఖులు అంతగా ప్రశంసించారు. శ్రీనివాస శిరోమణి వంటి గొప్ప కథారచయిత ఉన్నవవారిని రష్యన్ రచయిత అలెగ్జాండర్ కుప్రిన్‌తోను, ఆచార్య రంగా ఉన్నవవారిని టాల్‌స్టాయ్‌తోనూ పోల్చారు.

ధారాలను మాపు చేయించి చౌదరయ్య జైలుపాలు కాకుండా బయటపడతాడు. అయితే ధననష్టం, పరువు నష్టం అతడిని విపరీతంగా బాధిస్తూనే ఉంటాయి. సంగదాసు కుటుంబాన్ని ఎలాగైనా సర్వనాశనం చేయాలని పథకం పన్నుతాడు. అప్పుడుగాని తమ కొట్టంలో ఉన్న సంగదాసు సమాధిని తొలగించటానికి వీలుండదని చౌదరయ్య భావన.

రామదాసు (సంగదాసు తండ్రి) ఒక తప్పుడు వ్యాజ్యం నడుపుతాడు. కంఠంరాజు అనే ఒక కోర్టుపక్షి ద్వారా పకడ్బందీగా ఈ వ్యవహారం సాధిస్తాడు చౌదరయ్య. రామదాసు తన ఆస్తినంతా పోగొట్టుకొని కూలివాడవుతాడు. చివరికాయన నేరస్థ జాతులకు బ్రిటిష ప్రభుత్వం ఏర్పాటు చేసిన సెటిల్మెంట్ శిబిరాల (ప్రవర్తనలో మార్పుతెచ్చే జనావాసాలు) పాలవుతాడు. క్రైస్తవ మిషనరీల ప్రోద్బలంతో మతబోధ చేయించే నెపంతో ప్రభుత్వం ఆ రోజుల్లో ఇటువంటి ఆవాస శిబిరాలు ఏర్పాటు చేసేది. అక్కడి జీవితం, జైలు జీవితంకన్నా దుర్భరమైంది.

**సమకాలీనత..**

చౌదరయ్య తన అన్యాయాలకు అక్రమాలకు లోభక్రోధాలకు తగిన ఫలితాన్ని అనుభవిస్తాడు. రామానాయుడి భార్య చుట్టపుచూపుగా వచ్చిన మోహనరావుతో కామోత్కంఠతతో లేచిపోతుంది. అప్పటికామెకు ఆరేళ్ళ కొడుకు కూడా ఉన్నాడు. మోహనరావు ఆమె పినఅత్తగారి కొడుకు. షోకిల్లా. విలాసపురుషుడు. పెద్ద ఇంగ్లీషు చదువులు చదువుతున్నాడు. అతణ్ణి చూడగానే ఆమె మోహించి కుటుంబ బంధాలు తెంచుకొని వెళ్ళిపోతుంది. వాళ్ళు చెన్నపట్నంలో కాపురం పెడతారు. పాపఫలం ఊరకే పోదు అన్నట్లు, ఆమె ఏడాది గడవకుండానే మశూచికం పాలవుతుంది. ఒక కన్ను పోగొట్టుకొని, వికృతంగా మారుతుంది. మోహనరావువల్ల ఆమెకు కలిగిన బిడ్డ కూడా మశూచికం పాలై ఆమె కళ్ళ ముందే మరణిస్తాడు.

ఇక్కడ ఉన్నవవారు కమల జీవితఘట్టాలను పరమకారుణికంగా వర్ణించారు. 1918-19లలో ఇన్‌ఫ్లూయంజా అనే అంటురోగం మొదట స్పెయిన్ దేశంలో ప్రారంభమై ప్రపంచవ్యాప్తంగా ఇరవై లక్షలమందిని పొట్టన పెట్టుకుంది. భారతదేశంలో కూడా అశేషజనం ఈ వ్యాధి బారిన పడింది. 1922లో వచ్చిన 'మాలపల్లి'లో ఈ మహాభయంకర చారిత్రక సంఘటనను ఎంతో కారుణికంగా ఉపయోగించుకున్నారు ఉన్నవవారు. కమల

### నాగరికతకు వ్యాఖ్యానం

వ్యవసాయ సంస్కృతి నుంచి గ్రామీణజీవనం పట్టణ నాగరికత, పారిశ్రామిక సంబంధాలుగా పరిణమిస్తున్న సంధికాలంలో వచ్చిన గొప్ప నవల మాలపల్లి. వ్యవసాయ సంస్కృతిలో పల్లెజీవితం పరస్పర ఆధారప్రాతిపదిక మీద సాగేది. పారిశ్రామిక నాగరికతలో మానవ సంబంధాలు కలుషితమై సర్వం ధనమయం జగత్'గా పరిణమించాయి. దీనికి చక్కని వ్యాఖ్యానం మాలపల్లి నవల.

(రామానాయుడి భార్య) వికృతాకారంతో మంగళాపురం చేరి బిడ్డమీది మమకారంతో చౌదరయ్య ఇంట్లోనే పనిమనిషిగా జీవితాన్ని ప్రారంభిస్తుంది. తన మొదటి కొడుకు ఆలనాపాలనా లేక జబ్బుపడి మరణిస్తాడు. దీంతో కమల (మార్చుకొన్న పేరు శాంతమ్మ) విషాదంతో మరణిస్తుంది.

సెటిల్‌మెంటులో బలాత్కారంగా నిర్బంధితుడైన రామదాసు కూతురు జ్యోతిని సెటిల్‌మెంట్ ఉద్యోగి అయిన పౌల్ మోహిస్తాడు. ఆమెను చెరపట్టబోతాడు. ఆమె కృష్ణానదిలో పడి మరణిస్తుంది. ఆమెను చిన్నప్పటినుంచీ ప్రేమించిన మేనత్త కొడుకు అప్పాజీ కూడా జ్యోతి విషాద మరణం భరించలేక ప్రాణత్యాగం చేస్తాడు. క్రామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాల పట్టును ఆయా పాత్రల ద్వారా ఉన్నవవారు ఈ నవలలో బలంగా చిత్రించారు.

**ఆనందమఠం ప్రభావం..**

మాలపల్లిపై బంకించంద్ర ఛటర్జీ ప్రభావం బాగా కనిపిస్తుంది. అంటే ఉన్నవవారు ఆయనను అనుకరించారని కాదు... అనుసరించారని అసలే కాదు. బంకించంద్ర అంతటి మహాప్రతిభావంతులు ఉన్నవవారు అని చెప్పడమే. మాలపల్లి నవలకు బంకించంద్ ఆనంద మఠం నవలతో పోలిక కనిపిస్తుంది.

రామదాసు పెద్దకొడుకు వెంకటదాసు రష్యాలో అక్టోబరు విప్లవంతో ప్రభావితుడై ధనికులను దోచుకోవడం తప్పుకాదని, సాయుధ చౌర్యవృత్తిని సిద్ధాంతీకరిస్తాడు. ధనవంతులను దోచుకోవడంలో తప్పులేదని బోధిస్తాడు. దోపిడీలు సాగిస్తాడు. ఈయన అనుయాయులను 'సంతానులు' అని వర్ణించారు ఉన్నవ. 'ఆనందమఠం' నవలలో బంకించంద్ర బ్రిటిష ప్రభుత్వంపై తిరుగుబాటు చేసిన సన్న్యాసి దళం తమను . 'సంతానులు'గా చెప్పుకుంది. అంటే తాము భరతమాత సంతానమని అర్థం. ఈ సంతానులు బ్రిటీషు ప్రభుత్వ సాయుధ దళాలతో యుద్ధాలు చేశారు. ఆ యుద్ధాలను బంకించంద్ర ఎంత ఉత్తేజంతో, తాదాత్మ్యంతో వర్ణించారో ఉన్నవవారు కూడా వెంకటదాసు దోపిడీలను అంత ఉద్వేగంతో చిత్రించారు. సామ్యవాద దృక్పథాన్ని ప్రబోధిస్తోందన్న ఉలుకుతో బ్రిటిష ప్రభుత్వం ఈ నవలను రెండుసార్లు నిషేధించింది.

రష్యాలో వచ్చిన బోల్షివిక్ ఉద్యమం, పర్యవసానాలు ఉన్నవవారు ఈ నవలలో విపులంగా ప్రస్తావించారు! ఈ నవలలో వెంకటదాసు మారుపేరు తక్కెళ్ళ జగ్గడు. ఈయన ప్రబోధ గీతానికి ఆనందమఠం లోని వందేమాతరం గీతం ప్రేరకమై వుండవచ్చు. మాలపల్లి మూడో భాగం లోని పదమూడో ప్రకరణం 'రవర' అనే దానికి కూడా ఆనందమఠంలో ఒక సన్నివేశంతో పోలికలున్నాయి.

– అక్కిరాజు రమాపతిరావు

**జైలులో పుట్టుక**

తెలుగు సాహిత్యంలో జైలులో పుట్టిన మొదటి నవల 'మాలపల్లి'. ఉన్నవవారు జైలులో లాంతరు వెలుగులో దీనిని రాశారు. మొదట పుస్తకంగా తెచ్చినవారు బెల్లంకొండ రాఘవరావుగారు (బెల్లంకొండ రామదాసు తండ్రి). ఈ మొదటి ప్రచురణ ఒక అద్భుత సాహసగాథ. ఉన్నవ జననం గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా వేములూరిపాడులో. 1872వ సంవత్సరం. భార్య పేరు లక్ష్మీబాయమ్మ. ఆయన మరణం గుంటూరులో 1958. దంపతులిద్దరూ సత్యాగ్రహోద్యమంలో పాల్గొని జైలుశిక్ష ననుభవించినవారే.

డా.వాసిరెడ్డి సీతాదేవి
జయంతి 15న

# కథా సాహిత్యంలో విశిష్ట సంతకం



వృత్తిపరంగా చేసే కొన్ని పనులు వ్యక్తిగత జీవితాన్నీ ప్రభావితం చేస్తాయి. మనసుకి హత్తుకుపోయి మరువలేని జ్ఞాపకాలుగా మిగులుతాయి. ఒక్కోసారి మన వ్యక్తిత్వాన్నీ ప్రభావితం చేస్తాయి. నాకు అలాంటి ఓ అపురూప జ్ఞాపకం వాసిరెడ్డి సీతాదేవిగారి పరిచయం.

1992లో మొదటిసారి ఆమెను చూశాను. ఆ తర్వాత ఓ ఐదారుసార్లు కలిశానేమో! అందులో రెండుసార్లు ఈనాడు 'వసుంధర' కోసం, ఒకసారి 'చతుర' కథవెనుక కథ శీర్షిక కోసం ఇంటర్వ్యూలు చేశాను. మరోసారి బెంగుళూరు నుంచి రచయిత్రి, సహకారోద్యమ నేత అయిన రుక్మాయీ సంపత్ వస్తే ఆమెను ఇంటర్వ్యూ చేయమని పిలిచారు.

లెక్కప్రకారం చూస్తే ఆమెతో గడిపింది కొద్దిపాటి సమయమే. పాత్రికేయురాలిగా పరిచయమై, ఆత్మీయురాలిగా మారిన నేపథ్యంలో అది గాఢమైన అనుభూతుల్నే మిగిల్చింది. ఆమె ఆగ్రహంతో మొదలుపెట్టి అనుగ్రహం వరకూ అన్నీ చవిచూశాను. మొదటిసారి ఫోన్ చేసి ఫలానా విషయం మీద మీ ఇంటర్వ్యూ కావాలని అడిగినప్పుడు... నామీద, నా వృత్తి మీద అంతెత్తున ఎగిరారామె. పెద్దపేరున్న రచయిత్రి, ఇలా కోప్పడుతున్నారేమిటని భయ

పడ్డాను. నేను ఉద్యోగంలో చేరి అప్పటికింకా మూడునెలలే. భయపడుతూనే వెళ్లాను. ఆస్మా ఎటాక్ నుంచి కోలుకుని ఆస్పత్రినుంచి ఇంటికొచ్చిన మర్నాడే కళ్లకలకలు వచ్చాయామెకు. సరిగ్గా అప్పుడే నేను వెళ్లాను. ఆ పరిస్థితిలో కోపం సహజమేననిపించింది. తర్వాత చెప్పారామె. మరో పత్రికకు చెందిన జర్నలిస్టు మిత్రులు ఇంటర్వ్యూ చేసి ప్రచురించలేదట. 'టైమ్ వేస్ట్ కదమ్మా. అసలే నాకు ఆరోగ్యం బాగోలేదు' అన్నారు.

దురదృష్టవశాత్తూ అప్పుడు నేను చేసిన ఇంటర్వ్యూ కూడా ప్రచురితమవలేదు. ప్రభుత్వ నిర్ణయానికి సంబంధించిన అంశం కాబట్టి ప్రచురణావకాశం ఉంటుందో ఉండదోనని ముందే చెప్పాను. దాంతో నా పట్ల ఆమెకు సద్భావం ఏర్పడింది. ఆ తర్వాత కలిసినప్పుడు పత్రికలో వచ్చిన నా రాతల్లోని గుణదోషాలను వివరించి చెప్పేవారు.

### జీవితమే సాహిత్యానికి ముడిసరుకు

వ్యక్తిగా, రచయిత్రిగా సీతాదేవికి వేర్వేరు కోణాలు లేవు. ఎందుకంటే ఆమె జీవితమే ఆమె రచనకు ముడిసరుకు. రచనల్లోనైనా, జీవితంలోనైనా తనకు నచ్చిందే చేశానని, నమ్మిందే రాశానని చెప్పేవారు సీతాదేవి. ఆమె గురించి వివరంగా తెలుసుకోవాలంటే కనీసం ఆరేడుదశాబ్దాల వెనక్కి వెళ్ళాలి. స్త్రీని పురుషుని ఆస్తిగా పరిగణించడం, ఇంటి నాలుగు గోడల మధ్యే ఆమెను బంధించడం అప్పటి సాంఘిక నీతి. ఆమె మాటలపై ఆంక్షలు... మనుగడపై ఆంక్షలు. కట్టే బట్ట, పెట్టే నగ... ఏవీ ఆమె ఆనందం కోసం కాదు. అలాంటి సమాజంలో ఓ రైతు కుటుంబంలో పుట్టారు సీతాదేవి. తండ్రికి తన సేద్యమేమో... తానేమో... మరో విషయం పట్టించుకునే తీరిక లేదు. తల్లికి

## సన్మానం నూతనోత్తేజాన్నిస్తుంది

రచయిత్రిగా ఐదు దశాబ్దాల కృషికి గుర్తింపుగా 1998లో హైదరాబాదులో సీతాదేవి సాహితీ స్వర్ణోత్సవం జరిగింది. ఆ సందర్భంగా చేసిన ఇంటర్వ్యూలో ఆమె ఇలా చెప్పారు... 'చాలాకాలంగా నేనేమీ రాయడం లేదు. ఇంకా ఏం రాస్తాంలే అనుకుంటున్నప్పుడు ఈ సన్మానం మళ్లీ రాయాలన్న ఉత్సాహాన్నిస్తోంది. పాఠకులు నానుంచీ ఇంకా రచనలు ఆశిస్తున్నారనిపిస్తోంది. సన్మానాలు రచయిత బాధ్యతను పెంచుతాయి. రచయిత పూర్తిగా పరిణతి సాధించకమునుపు ఇలాంటి హడావుడి మంచిదికాదు కానీ కొంతకాలం తర్వాత అయితే రచయితలో నూతనోత్తేజాన్ని నింపుతాయి. అప్పుడు పేరుకోసం, డబ్బుకోసం రాయడానికి రచయిత భయపడాల్సివస్తుంది. సమాజం తననుంచి ప్రయోజనకరమైన రచనలు ఆశిస్తోందని ఎరిగి మంచి రచనలు చేసే అవకాశం ఉంది'.

మాత్రం తన బిడ్డ బాగా చదువుకోవాలని కోరిక... సమాజమేమంటుందోనని భయం. ఎలాగైతేనేం ఐదో తరగతి వరకు చదివించింది. ఆరోతరగతికి వెళ్లాలంటే స్కూలు మారాలి. వీధి దాటాలి. ఆడపిల్ల కది కూడనిది కాబట్టి ఇంట్లో కూర్చోమన్నారు. అప్పుడు మొదలైంది చిన్నారి సీతాదేవి మనసులో తొలిప్రశ్న.. మగపిల్లలకు లేని ఆంక్షలు ఆడపిల్లలకెందుకు? అనేది. ఆ తర్వాత ఆమె ప్రశ్నించని రోజు లేదు. ఈ ప్రశ్నించే క్రమంలోనే ఆమె రచనలకు పునాది పడింది.

### బాల్యం చేదు జ్ఞాపకం

బాల్యం గురించి మాట్లాడూ ఓసారి 'అందరూ బాల్యాన్ని ఆనందంగా గడుపుతారు. బాల్యం తాలూకు జ్ఞాపకాల్ని మధుర స్మృతులుగా పదిలపరుచుకుంటారు. కానీ నాకన్నీ చేదు జ్ఞాపకాలే. వయసుకి మించిన ఆలోచనలతో సతమత

## విశిష్ట పురస్కారాలు

మన రాష్ట్రప్రభుత్వం తరపున ఉన్న మూడు అత్యున్నత పురస్కారాలు సీతాదేవికి లభించాయి. తెలుగు విశ్వవిద్యాలయ విశిష్ట పురస్కారం, ఆత్మగౌరవ పురస్కారం, హంస అవార్డు... ఈ మూడు అందుకున్న రచయిత్రి బహుశ ఆమె ఒక్కరేనేమో. 1971లో తొలిసారిగా 'సమత' నవలకు రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డు అందుకున్నారామె. అకాడమీ తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనమయ్యాక మరో నాలుగు అవార్డులు లభించాయి. రెండు విశ్వవిద్యాలయాలు గౌరవ డాక్టరేట్ ఇచ్చాయి.

మయ్యే నేను బాల్యాన్ని ఏమాత్రం ఎంజాయ్ చేయలేకపోయాను' అన్నారు.

తోటి ఆడపిల్లలు పేరంటాలని, పండగలని సరదా పడుతుంటే అవి ఆమెకు నచ్చేవి కావు. వద్దన్నా తల్లి వెండి పట్టాలు చేయించిందని వాటిని తీసుకెళ్లి బావిలో పడేసి చావుదెబ్బలు తిన్నారటామె.

మగవాళ్లే ఎప్పుడూ భార్యలను జుట్టుపట్టుకుని రోడ్డుమీదికి ఈడుస్తారెందుకు? భార్యలెప్పుడూ మొగుడ్ని బయటకు గెంటరెందుకు? కోనేట్లో ఎప్పుడూ ఆడవాళ్ల శవాలే తేలతాయెందుకు? ఇటువంటి సమాధానం దొరకని ప్రశ్నల గురించి ఆలోచనలతో అంతర్ముఖిగా మారారామె. అందరిలాంటి మామూలు జీవితం తాను గడపకూడదన్న గట్టి నిర్ణయమూ ఆ ఆలోచనల్లోంచే వచ్చింది.

### *కథతో ఊస్టింగ్! నవలతో రివర్షన్!!*

హిందీ పరీక్షలు రాసి, స్నేహితురాలి సహాయంతో ఎంతో కష్టపడి ఉద్యోగం సంపాదించుకున్న సీతాదేవి తర్వాత ఏమాత్రం కష్టపడకుండానే ఆ ఉద్యోగం పోగొట్టుకున్నారు. అప్పుడామె మద్రాసులో హిందీటీచరుగా ఉద్యోగం చేస్తున్నారు. 'రత్తమ్మ కష్టాలు' అని ఆమె రాసిన కథ ఆ స్కూలు ప్రిన్సిపాల్ భార్యను దృష్టిలో పెట్టుకుని రాసిందేనన్న దుష్ప్రచారం జరిగింది. ఇంకేముంది? ఊస్టింగ్ ఆర్డర్ చేతికందింది. అదృష్టవశాత్తూ అప్పటికే ప్రైవేటుగా ఎం.ఎ. పూర్తిచేయడంతో ప్రభుత్వోద్యోగంలో చేరారు. ఉద్యోగం పోతేపోయింది కానీ నాకు చిన్న వయసులోనే రచన విలువ తెలిసింది... అని చెప్పారు సీతాదేవి ఓ సందర్భంలో.

1952 నుంచీ కథారచన మొదలెట్టారామె. 1954లో 'వాసిరెడ్డి సీతాదేవి కథలు' పేరుతో తొలి పుస్తకం ప్రచురితమైంది. నవల బహుళ ప్రజాదరణ పొందిన సాహితీ ప్రక్రియగా ఉన్న రోజుల్లో ఆమె రచనలు మొదలుపెట్టారు. విషయాన్ని ఎంచుకోవడంలో అప్పటివారికి భిన్నంగా తనదైన మార్గాన్నెంచుకున్నారు. చుట్టూ ఉన్న జీవితాన్ని కథల్లోకి లాగారు. మొట్టమొదటి నవల 'వైతరణి'లోనూ ఆ తర్వాత రాసిన 'సమత'లోనూ స్త్రీవాద దృక్పథం స్పష్టంగా కన్పిస్తుంది. సాయుధ విప్లవ నేపథ్యంతో రాసిన 'మరీచిక'ను అప్పటి రాష్ట్ర ప్రభుత్వం నిషేధించింది. ఉద్యోగంలో ఆమెకు రివర్షన్ ఇచ్చింది. తర్వాత హైకోర్టు ఉత్తర్వుతో నిషేధాన్ని ఎత్తివేశారు.

'మరీచిక'లో ఇద్దరు యువతులు ఒకరు సాయుధపోరాటంవైపు, మరొకరు హిప్పీ సంస్కృతివైపు ఆకర్షితులౌతారు. అవగాహన లేకుండా ముందుకు సాగే యువతరం గురించి రచయిత్రి ఆవేదన ఇందులో కన్పిస్తుంది. ఇక వ్యవసాయ రంగ నేపథ్యంతో రైతుని కథానాయకుడిని చేసి సీతాదేవి రచించిన 'మట్టిమనిషి'

నవల ఎందరినో కదిలించింది. రైతుకు భూమితో ఉండే అనుబంధాన్ని హృద్యంగా ఆవిష్కరించారామె. సాంబయ్య స్థానంలో మా తాతయ్యను ఊహించుకుంటూ నేనా నవల చదివానంటే అందులోని వాస్తవికతను అర్థం చేసుకోవచ్చు. సీతాదేవి రచనలు చాలావరకు హిందీ, ఇంగ్లీషు భాషల్లోకి అనువాదితమయ్యాయి. ఆంధ్రా పెరల్ బక్ అనీ, ఆడ కుటుంబరావనీ ఆమెను అభిమానంగా పిలుచుకున్నారు పాఠకులు.

**ఆమెది ఒంటరిబాట**

వేసిన దారి వెంట వెళ్లడం సులభం, పైగా పదిలం... అంటారు శ్రీశ్రీ. కానీ సీతాదేవిది ఒంటరిబాట. తనకు తానుగా వేసుకుని నడిచిన బాట. ఆ దారిలో ఎదురుదెబ్బలు, గాయాలు సహజం. అయినా వెనుదిరిగి చూడలేదు. ఎంత కష్టమైనా, ఎలాంటి సమస్యనైనా ఆత్మస్థైర్యంతో ఎదుర్కోవడం తప్ప ఎవరి చేయూతకూ ఎదురుచూడలేదు. ఈ క్రమంలో బాహ్యసంఘర్షణ కన్నా అంతఃసంఘర్షణ ఎక్కువగా అనుభవించారామె.



'ఇది నేను కోరి వరించిన మార్గం. వెనక్కి తిరిగి చూసే అలవాటు లేదు. ఈ యాత్రలో చేదు అనుభవాలున్నా ఆ చేదు నా మనసుకు తాకలేదు. చెడు గురించి బాధపడుతూ కూర్చోక ఎప్పటికప్పుడు అందులోనుంచి బయటపడడం గురించే ఆలోచించేదాన్ని. నా మార్గంలో నేను కొద్దో గొప్పో సాధించానేమో. అన్ని ప్రశ్నలకూ సమాధానాలు దొరకాలంటే ఈ జీవితం చాలదు. గతం గురించి నాకెలాంటి ఫిర్యాదులు లేవు. వర్తమానంలో బతికాను. అలా బతకడమే మనిషిని సంతృప్తిగా ఉంచుతుందని నమ్ముతాను..' అని చెప్పారు సీతాదేవి 2004లో ఇచ్చిన ఒక ఇంటర్వ్యూలో.

**ఆ మాట ప్రతిధ్వనిస్తుంటుంది**

సీతాదేవిగారితో ప్రత్యక్షంగా గడిపిన సమయం కన్నా ఫోనులో మాట్లాడిన సమయం ఎక్కువే. మొదటిసారి కలిసినప్పుడు తన రచనలు కొన్ని నాకిచ్చారు. తర్వాత ఎప్పుడో వాటిల్లో ఒకటి పునర్ముద్రణకివ్వడానికి తన దగ్గర కాపీ లేదంటే నా దగ్గరున్నది తీసుకెళ్లి ఇచ్చాను. ఎప్పుడైనా ఫోను మా పాప తీస్తే 'అమ్మమ్మని చూడ్డానికి రావా' అని అడిగేవారట. ఎప్పుడూ ఏదో ఒక ఇంటర్వ్యూ కోసమే వెళ్లేదాన్ని. 'ఆ పుస్తకమూ, పెన్నూ పక్కన పెట్టి ఒకరోజు కాస్త తీరిగ్గా రాకూడదూ. మీ ఆయన్నీ, పాపనీ తీసుకుని రా. నేను వంటలేమీ చేయలేనని నీకు తెలుసుగా. వంటమనిషి చేసిందే పెడతాను. మా వంటమనిషి హాఫ్ బాయిల్డ్ ఎగ్ బాగా చేస్తుంది...' అని ఫోనులో ఆప్యాయంగా ఆమె పిలిచిన పిలుపు ఇప్పటికీ చెవుల్లో ప్రతిధ్వనిస్తుంటుంది. ఆమె ఆతిథ్యాన్ని స్వీకరించే అదృష్టాన్ని మాత్రం అందిపుచ్చుకోలేకపోయాను.

'చతుర' కథ వెనుక కథ శీర్షిక కోసం మరీచిక గురించి వెళ్లిన సందర్భంగా ఫొటోలు తీస్తూ మా ఫొటోగ్రాఫర్ 'ఇక్కడ నిలబడండి మేడమ్... తల ఇటు తిప్పండి...' అంటూ సూచనలు ఇచ్చాడు. ఫొటో తీయగానే ఆమె అతన్ని వంగోమని సరదాగా మొట్టికాయ వేస్తూ... వాసిరెడ్డి సీతాదేవికి నువ్వు సలహాలిస్తావా? ... అని నవ్వారు.

– పద్మశ్రీ

## చతుర కథలు

-అన్వేష్




# సావిత్రమ్మ గర్వభంగం

"అమ్మా ఓ రూపాయిస్తావా? విశ్వనాథ్‌లో రేపు ఉదయం పిల్లలకోసం ఓ స్పెషల్ సిన్మా వేస్తున్నారట. టిక్కెట్టు జస్ట్ రూపాయే! ప్లీజ్ ఇవ్వమ్మా" మూడోతరగతి చదువుతున్న రాజు బడి నుంచి వస్తూనే తల్లి రాధమ్మను చుట్టుకుపోయాడు.

అంతేకాదు.. బ్యాగ్‌లోనుంచి ఓ పుస్తకం తీసి అందులో భద్రంగా దాచిపెట్టిన తెల్లటి చీటీ ముక్క బయటకు తీసి పట్టుకుని తల్లి ముఖం ముందు ఆడిస్తూ- "ఇదుగో ఈ చీటీముక్క చూశావా? దీన్ని చూపించి రూపాయిస్తే చాలు హాల్లోకి పంపించేస్తార్ట.. ఇది లేకపోతే అంతే సంగతులు.. మా సారు చెప్పారు" అంటూ గట్టిగా నవ్వేడు.

ఆ చీటీ మీద వాళ్లస్కూల్ పేరు రబ్బర్‌స్టాంపు వేసి ఉంది.

దాన్ని అలాగే చేతపట్టుకుని పక్కింటి సావిత్రమ్మ దగ్గరకు వెళ్లింది రాధమ్మ.

సావిత్రమ్మంటే సింహాచలంగారి భార్య. సింహాచలం అంటే రాజు చదివే స్కూల్‌లో ఇంగ్లిష్ మాస్టారు.

"అక్కా.. బావగారు పనిచేసే స్కూలుదే కదా ఈ ముద్ర?" అడిగింది రాధమ్మ.

"అవును ఏంటి సంగతి?" అంది సావిత్రమ్మ చీటీమీదున్న ముద్రను పోల్చుకుంటూ.

"ఏం లేదక్కా! ఇలా ముద్రేసిన చీటీలు ఇంకో పది తెప్పించావంటే మనందరం రేపు ఉదయం ఆటకు పోవచ్చు. కేవలం రూపాయే టిక్కెట్టు" అంటూ తనకొడుకు చెప్పింది మొత్తం ఏకరవు పెట్టింది.

ఇంకేం? సావిత్రమ్మగారు రెచ్చిపోయారు. ఈ దెబ్బతో తన పరపతి ఆ వీధి మొత్తం హోరెత్తాలని ప్లానేశారు.

"పిచ్చి రాధమ్మా పది చీటీలేంది? వంద తెప్పిస్తా!! మీ బావ ఒక్కఫోను కొడితే చాలు. స్కూలు రబ్బరు స్టాంపు నడిచి ఇంటికొస్తుంది. పదేంటి? వందల్లో ముద్రలు కొట్టుకోవచ్చు. మనవీధిలో ఉన్న అమ్మలక్కలందరినీ ఫ్రీగా తీసుకుపోదాం.. ఎంతా ఖర్చు కేవలం మనకు వందేకదా? మనిద్దరికీ పేరుకు పేరు, ప్రతిష్టకు ప్రతిష్ట.."

మర్నాడు ఉదయమే సిమ్మాచలం మాస్టారి భార్య సావిత్రమ్మగోరి నేతృత్వంలో ఆ వీధి అమ్మలక్కలంతా బయలుదేరారు. ఫెళఫెళ పట్టుచీరలు కట్టి, ఇంత మందాన ఫేస్ పౌడర్లు మెత్తి, హ్యాండ్ బ్యాగులు తగిలించుకుని వారంతా

## జహంగీర్ గంటా!

నిన్నటి నిజం

జహంగీర్ చక్రవర్తి దేశాన్ని పాలించే రోజుల్లో ఆగ్రాలో ఓ గంటని ఏర్పాటు చేశాడు. న్యాయాన్ని ఆశించేవారు ఎవరైనా సరే, దాన్ని మోగించవచ్చు. భూస్వామ్య పాలనలోనే అంతటి ఆదర్శంగా నిలిచాడాచక్రవర్తి. దీన్ని స్ఫూర్తిగా తీసుకుని 2008 ఆగస్టులో బీహార్‌లోని ముజఫర్‌పూర్‌లో డిఐజి అరవింద్‌పాండే తన ఆఫీసు బయట ఓ గంటని ఏర్పాటు చేశాడు. దానికి 'జహంగీర్ గంట' అనే పేరు పెట్టాడు.



ఎప్పుడైనా ఎవరు వచ్చి గంట కొట్టినా డిఐజి స్వయంగా బాధితుల ఫిర్యాదు వింటాడు. తగిన న్యాయం చేకూరుస్తాడు. ఇలా న్యాయం పొందిన మొదటి వ్యక్తి అర్చనాదేవి. ఎనిమిదేళ్ల ఆమె కొడుకు విశ్వనాథ్ చౌదరిని ఎవరో హత్య చేశారు. సంబంధిత పోలీసు అధికారులు ఆమె చేసిన ఫిర్యాదుని పట్టించుకోలేదు. ఎఫ్ఐఆర్‌ని కూడా నమోదు చేయలేదు. జహంగీర్ గంట గురించి తెలిసిన ఆమె ముజఫర్‌పూర్ వెళ్లి డిఐజి ఆఫీసు ముందున్న ఆ గంటని మోగించింది. బయటకి వచ్చిన అరవింద్ పాండేకి జరిగింది వివరించింది. ఆయన సంబంధిత పోలీసు అధికారిని పిలిచి గట్టిగా మందలించడంతో నేరస్థుడ్ని అరెస్ట్ చేశారు. ఆయనకొచ్చే చాలా ఫిర్యాదుల వెనక పోలీసుల వైఫల్యం ఉండటం విశేషం. ఆయన చేసే మొదటి పని సంబంధిత అధికారిని పిలిచి కౌన్సిలింగ్ చేయడం, వారి పనితీరుని ఎలా మెరుగు పరచుకోవచ్చో సలహాలు ఇవ్వడం. రోజుకి వంద నించి నూట ఏభై మంది ఈగంటని ఆశ్రయిస్తున్నారు.

గంటతో ఆగకుండా ఇంటర్‌నెట్‌లో ఆర్కుట్‌లో ఆయన తన చిరునామా ఇచ్చాడు. బాధితులు ఓ మెయిల్ ఇస్తే చాలు. ఆయన తక్షణమే స్పందిస్తాడు.

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

యుద్ధానికి వెళ్తున్న యోధురాళ్లా వెళ్తుంటే ఊరు ఊరంతా దిమ్మెరబోయింది.

సిన్మాహాలు వద్ద పిల్లలు గుంపులు గుంపులు..

మరోపక్క సావిత్రమ్మగారి ఆడసైన్యం..

బుక్కింగ్‌లో ఓ వందపారేసి అమ్మలక్కలందరికీ టిక్కెట్లు కొనేశారు సావిత్రమ్మగారు. అంతకు ముందే స్కూలు రబ్బరు స్టాంపు వేసిన చీటీలు పేరంటాల్లో శనగలు పంచినట్టు పంచేశారామె.

ఇకనేం? మహిళాసైన్యం థియేటర్ లోపలికి బయల్దేరింది.

కానీ గేటువద్ద ఉండేవాడు సైంధవుడిలా వాళ్లను ఆపేశాడు.

సర్వమహిళా సైన్య సేనాని. సావిత్రమ్మ వాడితో లడాయి వేసుకున్నారు.

"టిక్కెట్టుంది కదా?"

"ఉంది?"

"స్కూలు రబ్బరు స్టాంపు వేసిన చీటీ ఇచ్చాం గదా?"

"ఇచ్చారు"

"మరి మమ్మల్ని ఏల లోనికి పోనీయవు?"

"క్షమించండి తల్లీ.. ఈ సిన్మా కేవలం పిల్లల కోసమే వేస్తున్నాం.. వారికి మాత్రమే స్కూలు రబ్బరు స్టాంపు పాస్ చెల్లుతుంది" వినయంగా జవాబిచ్చాడు గేటువద్ద మనిషి.

"మా దగ్గరున్నా సదరు రబ్బరు స్టాంపు పాసులున్నాయి గదా?" సావిత్రమ్మగారి ఆవేశం.

"కానీ మీరుగానీ, మీతో వచ్చిన ఈ అమ్మలక్కలుగానీ స్కూలు విద్యార్థులు కాదుగదా మేడమ్?"

సావిత్రమ్మకు నిలువుగుడ్లు పడ్డాయి. అయినా చివరి ప్రయత్నంగా నిలదీసింది.

"మరి బుక్కింగులో మాకు టిక్కెట్లు ఎలా ఇచ్చారు? అప్పుడే చెప్పవచ్చుగదా?"

"మీరు మీకోసం, ఈ ఆడపటాలం కోసం టిక్కెట్లు కొంటున్నారని అప్పుడు తెలీదు కదా మేడం? మీరందరూ మీ పిల్లల్ని సినిమాకు తీసుకొచ్చారేమో వారికోసం టిక్కెట్లు కొంటున్నారేమో అనుకున్నాం" కూల్‌గా సమాధానమిచ్చాడు అప్పుడే అక్కడికొచ్చిన థియేటర్ మేనేజర్.

సావిత్రమ్మకు ఏంచేయాలో తోచలేదు.. పళ్లు పటపటలాడిస్తూ వెనక్కు తిరిగింది.

©




ఆ వంతెన బలహీనంగా ఉంది. అది ఒట్టి వంతెనే కాదు. వంతెనతోటి రిజర్వాయరు. వేల కొలది ఎకరాలకు నీరు సరఫరా చేస్తుంది. దాదాపు నూరు సంవత్సరాల క్రితం బ్రిటిషువారు కట్టించింది. వంతెన బలహీనంగా ఉండడం వలన ప్రభుత్వం వారు బరువులతో గల వాహనాల రాకపోకలు నిషేధించారు. బస్సులయితే మనుషులను దించేసి ఖాళీవీ, లారీలయితే బరువులను దించేసి ఖాళీవీ అనుమతిస్తారు. అందుకే సాధారణంగా- లారీలు బరువులతో ఆ లైను రావు. ఒకవేళ వచ్చినా- సామానులను దించేసి కూలీలచే మోయించి అవతల ఒడ్డున లారీ లోడ్ చేస్తారు.

రాత్రి రెండు గంటల సమయం.

పెద్ద లోడ్‌తో ఒక లారీ వచ్చి వంతెన ముందు ఆగింది. డ్యూటీలో ఉన్న వాచ్‌మెన్ లారీ దగ్గరకు వచ్చి "సైడ్ తీసి ఆపవయ్యా, బరువులు మొయ్యడానికి ఇప్పుడు కూలీలు ఎవళ్లూ లేరు. ఉదయం వెళ్ళవచ్చు" అన్నాడు.

"ఉదయమా? ! అంతవరకే! ఈ లోడ్ తొందరగా వైజాగ్ చేరాలి" అన్నాడు లారీ డ్రైవరు.

"తొందరంటే ఎలాగయ్యా, ఎవరూ కూలివాళ్ళు లేరు. అందరూ ఊళ్ళోకి పోయారు"

"బాబ్బాబు" బతిమాలసాగాడు లారీ డ్రైవరు.

"బతిమాలితే పన్లు కావయ్యా. ఓ మూడు వందలియ్యి. గప్‌చిప్‌గా లారీని లోడ్‌తో వదిలేస్తాను"

"మూడు వందలా?" ఆశ్చర్యంగా అన్నాడు డ్రైవరు.

"నేనేమీ ఎక్కువగడలేదయ్యా. పైగా రిస్క్. ఎవరైనా చూశారంటే నా ఉద్యోగం ఊడిపోతుంది"

"సరే" అంటూ మూడు వందలిచ్చి లారీ స్టార్ట్ చేశాడు డ్రైవరు. సరిగ్గా వంతెన మధ్యగా ఆపాడు లారీని.

"ఏమయ్యా సగంలో ఆపేశావ్?" పరుగున లారీ దగ్గరకు వచ్చి అడిగాడు వాచ్‌మెన్.

"ఐదు వందలిస్తే గాని కదలనంటుందయ్యా ఈ లారీ" చెప్పాడు డ్రైవరు.

"ఐదు వందలా?" ఆశ్చర్యంగా నోరు తెరిచాడు వాచ్‌మెన్.

"ఐదు వందలివ్వకపోతే లారీ కదలదు. లారీ కదలకపోతే నీ ఉద్యోగం గోవిందా!" అన్నాడు వ్యంగ్యంగా నవ్వుతూ లారీ డ్రైవరు.

చేసేది లేక చచ్చినట్టు ఐదువందలిచ్చాడు వాచ్‌మెన్. డబ్బులు జేబులో పెట్టుకుని, ఈల వేసుకుంటూ హుషారుగా స్టార్ట్ చేసి వేగంగా వెళ్ళిపోయాడు లారీ డ్రైవరు.

"అమ్మా కంత్రీనాకొడుకా! ఈ రోజు సంపాదనంతా కొట్టేశావ్ కదరా" తిట్టుకున్నాడు వాచ్‌మెన్.

©

# రచయితలకు, అనువాదకులకు, కార్టూనిస్టులకు
# సూచనలు

★ ఇతివృత్తంలో నూతనత్వం, రచనా సంవిధానంలో వైవిధ్యం గల తెలుగు కథలనూ, అనువాద కథలనూ 'విపుల' ఆహ్వానిస్తున్నది. హాస్య వ్యంగ్య రచనలకు ప్రత్యేక ప్రాధాన్యత. ప్రచురించే ప్రతి తెలుగు కథకు రూ. 500/- పారితోషికం ఉంటుంది.

★ ప్రచురించిన అనువాద కథకు పారితోషికంగా మూల రచయితకు రూ. 250, అనువాదకునకు రూ. 350 లభిస్తుంది. అనువాద కథలు పంపే వారు ఆయా మూల భాషా రచయితల నుండి లిఖితపూర్వక అనుమతి పొంది కథతోపాటే అనుమతి పత్రం కూడా జతపర్చాలి. మొదటి షీటు లోనే 1. మూలభాష 2. ఆ భాషలో ఆ కథ పేరు 3. రచయిత పేరు, చిరునామా 4. ఆ కథను ప్రచురించిన పత్రిక లేదా సంకలనం పేరు, తేదీ 5. ప్రచురణకర్తల చిరునామా 6. అనువాదకుని చిరునామా తెలియజేయాలి.

★ అనువాదకులు మూల రచయిత అనుమతి పొందలేని సందర్భాలలో పై వివరాలు తెలిపితే మేమే అనుమతి పొందగలం.

★ అనువాదానికి ఎన్నుకునే కథలు సమకాలీన రచయితలవే అయితే బాగుంటుంది. తెలుగు పాఠకులకు సుపరిచితులయిన ప్రసిద్ధుల కథలు పంపవద్దని మనవి.

★ ప్రతి రచనకు తగిన స్టాంపులు అంటించి స్వంత చిరునామా గల కవరు జతపరచాలి. అలా జతపరచకపోయినా పోస్టులోగానీ, ఇతరత్రాగానీ రచనలు పోయినా మా బాధ్యత ఉండదు. పోస్టుకార్డులు జతపరచటం అనవసరం.

★ కార్టూన్లు 5×10.5 సెం.మీ. సైజుకు తగ్గించడానికి అనువయిన సైజులో డ్రాయింగ్ పేపరుపై ఇండియన్ ఇంక్‌తో వేసి పంపాలి. కాప్షన్ స్పష్టంగా అర్థమయ్యేలా ఉండాలి. చుట్టూ బార్డర్ తప్పనిసరిగా ఉండాలి. ప్రచురించిన కార్టూన్‌కి రూ. 40 చొప్పున పారితోషికం ఉంటుంది.

## విపుల

'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 500 082
ఈ మెయిల్ : vipula.chatura@gmail.com

# వాస్తవికతావాదంలో అందెవేసిన చెయ్యి

**ఆయనకు సరస్వతీ కటాక్షమున్నా పరిస్థితుల ప్రాబల్యం కారణంగా మాధ్యమిక స్థాయి వరకే విద్య అభ్యసించగలిగాడు. బతుకుపోరులో భాగంగా పల్లెటూరిలో కర్షకుడిగా, నగరంలో కార్మికుడిగా జీవిక సాగించాడు. ఓ సన్యాసి వెంట దేశ సంచారం చేశాడు. ఆ స్థితిలో యాదృచ్ఛికంగా రచనా వ్యాసంగంలోకి అడుగుపెట్టి, అనతికాలంలోనే అద్భుతమైన కథలు, నవలలు రచించాడు. చివరకు గుజరాతీ సాహితీ క్షేత్రంలో సమున్నత శిఖరాలకు చేరుకున్నాడు. ఆ మహారచయితే పన్నాలాల్ పటేల్. 'మానవీనీ భవాయీ' నవల 1985లో ఆయనకు జ్ఞానపీఠ పురస్కారం తెచ్చిపెట్టింది.**



పన్నాలాల్ పటేల్

పన్నాలాల్ నానాలాల్ పటేల్ దక్షిణ రాజస్థాన్‌లోని డూంగర్‌పూర్‌జిల్లా మాండలీ గ్రామంలో మే 7, 1912లో జన్మించారు. ఆయనది సామాన్య కర్షక కుటుంబం. మాండలీ గుజరాత్ సరిహద్దులో ఉంది. చాలా చిన్న గ్రామం. అందులో ఉన్నది నూరిళ్ల లోపే. ఆ గ్రామస్థులు తాము గుజరాతీలమే అని భావిస్తారు. పన్నాలాల్ చదువు గుజరాతీలోనే ఆరంభమైంది. ప్రఖ్యాత గుజరాతీ సాహితీవేత్త ఉమాశంకర్ జోషీ ఆయనకు సహపాఠి. పన్నాలాల్ బాల్యం క్రమపద్ధతిలో సాగలేదు. విద్యాభ్యాసం విరమించిన తర్వాత ఓ సాధువును ఆశ్రయించాడు. ఆ సాధువు దేశదిమ్మరి. పన్నాలాల్‌ను తన వెంట దేశమంతా తిప్పాడు. సాధువుతో ఉన్నప్పటికీ పన్నాలాల్ దృష్టి ఏమాత్రం ఆధ్యాత్మిక చింతన వైపు పోలేదు. శిష్యరికం మానుకున్నాడు. వివిధ ప్రాంతాలు సందర్శించడం వల్ల ఆయా ప్రజల జీవనరీతులు, ప్రవృత్తులు, సమస్యలు పరిశీలించే అవకాశం కలిగింది. లోకజ్ఞత పెరిగింది. తన జీవితం గురించి ఆలోచించసాగాడు. భుక్తికోసం రాజస్థాన్‌లోని అనేక ప్రాంతాల్లో రకరకాల వృత్తుల్లో పనిచేశాడు. చివరకు అహ్మదాబాదులోని విద్యుత్ సంస్థలో కొలువు దొరికింది. అక్కడే స్థిరపడేందుకు నిశ్చయించుకున్నాడు.

పన్నాలాల్‌కు ఆంగ్లంలో ప్రవేశం లేదు. పాశ్చాత్య సాహిత్యమేదీ చదవలేదుకానీ, సాహిత్యం పట్ల అభిరుచి ఏర్పడింది. 1936 నవంబరులో అహ్మదాబాదులో గుజరాతీ సాహిత్య పరిషత్తు సమావేశం జరిగింది. దానికి అధ్యక్షులు మహాత్మాగాంధీ. అప్పటికే సాహితీరంగంలో సుప్రసిద్ధుడైన తన బాల్యస్నేహితుడు ఉమాశంకర్ జోషీ ఆ సమావేశానికి వస్తున్నట్లు తెలిసింది. జోషీ ముంబాయిలో స్థిరపడ్డాడు. పన్నాలాల్ మిత్రుడికి లేఖ రాశాడు. అది పద్యాత్మకంగా ఉంది. జోషి ఆ లేఖ చదివి ఆనందించాడు. అహ్మదాబాదు వచ్చినప్పుడు జోషి మరో ప్రముఖ సాహిత్యవేత్త సుందరంతో పాటు పన్నాలాల్‌ను కలుసుకున్నాడు. బాల్యస్మృతులు ఆత్మీయంగా నెమరు వేసుకున్నారు. రచనలు చేయవలసిందిగా జోషి తన మిత్రుడు పన్నాలాల్‌కు సలహా ఇచ్చాడు. అహ్మదాబాదులోనే ఉంటున్న సుందరం సూచనలు తీసుకోవలసిందిగా చెప్పాడు. అప్పటివరకు పన్నాలాల్‌కు ఆ దృష్టే లేదు. అయితే ఆయనకు సంగీతమంటే ఎంతో మక్కువ. కంఠం శ్రావ్యంగా ఉండేది. బాగా పాడగలడు. ఈ నేపథ్యంలో కవితా రచన చేయడం సులభమనుకున్నాడు. విస్తృత దేశాటనలో ఎన్నెన్నో అనుభూతులు, స్పందనలు మనస్సులో



నిక్షిప్తమయ్యాయి. అన్ని వర్గాల ప్రజల స్థితిగతులపై విశేషావగాహన కలిగింది. దీని ఆధారంగా కవితలు రాయడం ప్రారంభించాడు. మిత్రుడు జోషి చెప్పిన ప్రకారం వాటిని సుందరానికి చూపాడు. సుందరం ఉత్తమ విమర్శకుడు, విశ్లేషకుడు. పన్నాలాల్ రచించిన కవితలేవీ ఆయనకు నచ్చలేదు.

పన్నాలాల్‌లో పట్టుదల పెరిగింది. రామాయణ భారతాదులు, కథలు, నవలలు విస్తారంగా చదివాడు. తాను రచనలు చేయాలంటే దానికి కథాప్రక్రియ అనువుగా ఉంటుందని భావించాడు. ఊహాలోకాల్లో విహరించడం, ఆదర్శాలు వల్లించడం ఆయనకు సమ్మతం కాలేదు. తనకు వాస్తవంగా తోచినవాటిని కల్పనా సంవిధానంతో, ఒకింత ఆదర్శాన్ని జోడించి, కథలుగా మలిచే యత్నం ప్రారంభించాడు. చిన్న కథలు రాసి సుందరం వద్దకు వెళ్ళాడు. మొదట ఆయన ఆమోదముద్ర లభించలేదు. పన్నాలాల్ నిరుత్సాహపడలేదు. తన రచనాశక్తికి పదును పెట్టుకున్నాడు. ఆ తరువాత పన్నాలాల్ రాసిన 'శేర్‌నీ శారద' కథ చదివి సుందరం ఆనందపరవశుడయ్యాడు. పన్నాలాల్‌లో ఆ క్షణం ఆయన గొప్ప రచయితను దర్శించాడు. ఆ కథ ప్రచురితమైంది. గుజరాతీ పాఠకలోకం ఆశ్చర్యచకితమైంది. అదే ముద్రితమైన పన్నాలాల్ తొలి రచన. సముజ్జ్వల సాహితీ ప్రస్థానానికి అది నాంది. గ్రామీణ జీవిత చిత్రణ, సమాజంలోని విలక్షణ కోణాల ఆవిష్కరణ ద్వారా పన్నాలాల్ గుజరాతీ కథా రచనలో కొత్త బాటలు పరిచాడు. సంప్రదాయవాదులు ఉలికిపడ్డారు.

మౌలికంగా పన్నాలాల్ వాస్తవవాది. లోకరీతిపై ఆయనకు విశ్వాసం. 'కంకు' కథ ఇందుకొక ప్రబల నిదర్శనం. కంకు, సేర్‌ల దైహిక సంబంధాన్ని సంప్రదాయవాదులు హర్షించలేదు. కానీ పన్నాలాల్ కథలో మార్పు చేయలేదు. కంకు పుత్రుడి పెంపకాన్ని రచయిత ఓ తపస్సుగా అభివర్ణించడం విశేషం. ఈ కథను చలనచిత్రంగా రూపొందించారు. రచయిత ఈ కథను తర్వాత నవలగా మార్చారు. చలనచిత్రానికి గుజరాత్ ప్రభుత్వ బహుమతి లభించింది.

'అర్‌మాన్' కథలో కథానాయిక 'పానూ'. ఒక శ్రామిక కుటుంబంలో ఆమె స్వప్నజగత్తు ఎలా ఇమిడిపోయిందో పన్నాలాల్ చూపిన తీరు అసామాన్యం. 'భాతీకే ఘర్‌వాలీ' విలక్షణ ప్రవృత్తిగల యువతి కథ. ఆమెకు నగరజీవనంపై అధిక వ్యామోహం. గ్రామం నుంచి నగరం వెళ్ళిన ఆమె మోసపోయి, ఆ జీవితం ఎండమావి అని గ్రహించి, చివరకు భర్త వద్దకు తిరిగివస్తుంది. రచయిత ఆమెను ఆత్మస్థైర్యం గల యువతిగా చిత్రించాడు. గ్రామీణ వాతావరణం పైన, ప్రకృతి సౌందర్యంపైన పన్నాలాల్‌కు అనురక్తి అధికం. 'వాత్రిక్ కె కినారె'లో ఇద్దరు వ్యక్తుల అపూర్వ మైత్రీబంధం చిత్రితమైంది. పన్నాలాల్ కథల్లో పాత్ర చిత్రణ ఆశ్చర్యం కలిగిస్తుంది. 'బేటీకీ విదా' లఘు నవలలో మనోవిశ్లేషణ పాఠకుల్ని ముగ్ధుల్ని చేస్తుంది. 'మలేలా జీవ్' ప్రణయగీతి కావ్యమైతే, 'పిఛలే దర్వాజే' మాతృహృదయాన్ని ఆవిష్కరించే గీతికావ్యం. 'ప్రార్థనే కహో చఢావే బాణ్' ఐదు భాగాల బృహత్ నవల.

జ్ఞానపీఠ పురస్కృతి పొందిన 'మానవీనీ భవాయీ' నవల అద్భుత సృష్టి. ఈ నవలను స్వగ్రామం మాండలీలో చేను మంచెపై కూర్చుని రచించాడు. ఇది మూడు భాగాలలో వేర్వేరు సంవత్సరాలలో వెలువడింది. ఎనిమిది దశాబ్దాల కాలంలో మూడుతరాల కథ. గ్రామవాసి కాలూ ఓ అందమైన యువతి. రాజూని గాఢంగా ప్రేమిస్తుంది. కపటమనస్కుల కుటిలోపాయాలవల్ల వారి పెళ్లి జరగదు. రచయిత ఈ ప్రేమ కథ చుట్టూ ఉన్న అనేక జీవిత సమస్యలను, పార్శ్వాలను నిశితదృష్టితో విశ్లేషించాడు. కాలూను ధైర్యశాలినిగా తీర్చిదిద్దాడు. జానపద చిత్రంలో ప్రకృతి శక్తుల ప్రాబల్య వివరణలో పన్నాలాల్ చూపిన ప్రతిభ అసాధారణం.

సురభి, నగద్ నారాయణ, ఫకీరో, దేవయాని-యయాతి, ఆంసూ, అంతరంగ్, అకేలీ మొదలైన 61 నవలలు, త్యాగి-అనురాగి, బిన్ని, తిలోత్తమ, నరాటొ, భీష్మనీ బాణ్‌శయ్య, మననా మొరలా వంటి 26 కథా సంపుటాలు, ఓ నాటకం, మూడు బాలసాహిత్య కృతులు, 21 అనువాద గ్రంథాలను పన్నాలాల్ వెలువరించారు. ఆయనకు గుజరాత్ ప్రభుత్వ పురస్కారం, 'రంజిత్‌రాం సువర్ణచంద్రక్' పురస్కారం లభించాయి.

1989 ఏప్రిల్ 6న పన్నాలాల్ పటేల్ దివంగతులయ్యారు. గుజరాత్ ప్రజల జీవనంలో విలక్షణకోణాల్ని యథార్థ దృష్టితో కళాత్మకంగా చిత్రించిన ఆయన రచనలు శాశ్వత విలువలు సంతరించుకున్న పెన్నిధులు.

*– గోవిందరాజు రామకృష్ణారావు*

# మనసున ఉన్నదీ...



★ చతురలో వచ్చిన ఫీచర్లు చాలా బాగున్నాయి. 'దీప జ్యోతి' అనేక విషయాలను తెలియజేసింది. అంతమంచి రచనను అందించిన అద్దంకి శ్రీనివాస్‌గారికి ధన్యవాదాలు. అలాగే టాంక్‌బండ్ కథ కూడా బాగుంది.

**-ఆశాలత యలమంచి,** న్యూజెర్సీ

★ ఈ నెల జార్జి ఆర్వెల్ జంతుక్షేత్రం నవల బాగుంది. ఇంగ్లీషు పరిజ్ఞానం లేనివారికి మంచి నవలల గురించి తెలుసుకునే అవకాశం కలుగుతోంది. ఈసారి టాంక్‌బండ్ కథ 'తాతబ్బాయి' చాలా బాగుంది. నిన్నటి నిజాలు, కొత్తగాలులు, కథవెనుక కథ చాలా ఆకట్టుకున్నాయి.

**-మంచాళ శ్రీలక్ష్మి,** విశాఖపట్నం

★ 'జక్కం వీరన్న మా ఊరివాడే' అంటూ ఎప్పుడూ తెరవెనక ఉండడానికే ఇష్టపడే వంశీగారు కథ వెనుక కథను చెప్పడం ఆనందంగా ఉంది. చతుర కతలు బాగున్నాయి. బొమ్మలన్నీ చాలా అందంగా ఉన్నాయి.

**-బి.మోతి మోహన రంగా,** సూర్యాపేట

★ యర్రంశెట్టి అపార్ట్‌మెంటాలజీ చాలా బాగుంది. టాంక్‌బండ్ కథలూ ఆకట్టుకుంటున్నాయి. 'దీప జ్యోతిః పరంబ్రహ్మ' దీపావళి పైన వచ్చిన ప్రత్యేక శీర్షిక చాలా నచ్చింది.

**-పప్పు కామేశ్వర్రావు,** అమలాపురం

★ జార్జి ఆర్వెల్ నవల జంతుక్షేత్రం చతుర పాఠకులకు అందించడం చాలా బాగుంది. టాల్‌స్టాయ్‌పై వచ్చిన ప్రత్యేక కథనం ఆయన రచనలపై చక్కటి అవగాహనను కలిగించింది. టాల్‌స్టాయ్ రచనలు చదవాలన్న ఆసక్తిని కల్గించింది. ఆధునిక నవల లక్షణాల్ని బీజరూపంలో కనబరచిన వెయ్యేళ్లనాటి జపాన్ నవల 'టేల్ ఆఫ్ గెంజి' పరిచయం చాలా బాగా నచ్చింది.

**- పుష్పలత,** బెంగళూరు

★ అపార్ట్‌మెంటాలజీలో 'సరదాగా మనీకోసం' మెడికల్ బిల్లుల ఫ్రాడ్ గురించి చక్కగా వివరిస్తోంది. అలాగే 'వారెవ్వా' ఫోటోలు కూడా చాలా బాగున్నాయి. ఇక టాంక్‌బండ్ కథల్లో 'తాతబ్బాయి' ఆర్ద్రంగా ఉంది. జార్జి ఆర్వెల్ నవల అనిమల్ ఫామ్‌కు తెలుగు అనువాదం అందించడం నిజంగా అద్భుతమే! ఇక నిన్నటి నిజాలు, చతుర ప్రపంచం ఆసక్తికరమైన అనేక విషయాలను తెలియజేశాయి. మాకు నచ్చిన చక్కటి మాసపత్రిక 'చతుర'కు కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం.

**- సురేఖారాణి,** అనంతపురం

★ నవంబరు చతురలో నెహ్రూ చతురోక్తులు, నిన్నటినిజం, చతురప్రపంచం మమ్మల్నెంతో ఆకట్టుకున్నాయి. వంశీ 'జక్కం వీరన్న' 'కథ వెనుక కథ' రచయితలుగా మారాలనుకునేవారికి స్ఫూర్తినిచ్చేలా ఉంది. చతుర కతలు కూడా చాలా బాగున్నాయి. తకళి శివశంకర పిళ్లై గురించి జ్ఞానపీఠాలులో ఇచ్చిన అంశాలు కూడా మాకెంతో నచ్చాయి. ప్రతినెలా చతురకోసం ఆత్రుతగా చూస్తుంటాం.

**-బసవరాజు,** కర్నూలు

★ పాఠకుల్ని కడుపుబ్బ నవ్వించడానికి 'సరదాగా మనీకోసం' రాస్తున్న యర్రంశెట్టి శాయికి హాస్యప్రణామాలు. భూస్వామ్యంపై నిరసన గళమెత్తిన టాల్‌స్టాయ్‌పై వ్యాసం అమోఘం. కిందటి ఏడాది కథే గుర్తుంచుకోలేని ఈ వ్యవస్థలో 'కాలాతీతం'లో వెయ్యేళ్ల నాటి నవల 'టేల్ ఆఫ్ గెంజి'ని అందించడం గర్వకారణం. 'జక్కంవీరన్న మా ఊరివాడే' అన్న వంశీ కథ వెనుక కథ చదివాక మన తెలుగులో ఉన్న మంచి రచయితలపై గౌరవం మరింత పెంపొందింది.

**- పెన్మెత్స సూరిబాబు,** హైదరాబాద్



చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ఈ మెయిల్ :
vipula.chatura@gmail.com



# చతుర ప్రవేశిక



## డిసెంబరు - 2010

డిసెంబరు 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. సుజాత తల్లి పేరేమిటి?
2. కిరణ్మయి భర్త ఎవరు?
3. శివశంకరం భార్య?
4. బోస్ అర్థాంగి?
5. 'మాలపల్లి' రచయిత?
6. పన్నాలాల్ పటేల్‌కు జ్ఞానపీఠం తెచ్చిన రచన?
7. 'బుద్ధిజీవి' రచయిత ఎవరు?
8. 'గార్గాంటువా అండ్ పాంటాగ్రుయెల్' రచయిత?
9. వాసిరెడ్డి సీతాదేవికి ఉద్యోగం ఊడగొట్టిన కథ?
10. రూపాసింగ్ నివాసం?

---

పంపినవారి పేరు: ---------------------------- వయసు (   )

చిరునామా: ------------------------------------------

------------------------------------------

పిన్‌కోడ్:                    ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ప్రవేశికలకు చివరి తేదీ 16

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

# కాప్షన్ మీదే - 24



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి!
బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి, పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 16


చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : vipula.chatura@gmail.com


ఉత్తమ వ్యాఖ్య :

**ఢిల్లీకి టికెట్ చవగ్గా ఇస్తానంటే ఎరక్కపోయి తీసుకున్నాను**

–కె.వి.ప్రసాద్,
రుషికేష్, డెహ్రాడూన్ జిల్లా





## కాప్షన్ మీదే -23

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

**వామ్మో... నేనేదో లేపేద్దాం అనుకుంటే ఇదేంది నన్నే లేపేసింది**

– టి.కల్పన, కోమటిగుంట

**ఎంత ఫ్లైట్ మిస్సయితే మాత్రం... ఇలా పంపించడం ఏం బాలేదు!**

– వాడపర్తి వెంకటరమణ, విశాఖపట్నం

**ఛ... దీని 'రిమోట్' మా ఆవిడ 'చేతి'లో వుందనే సంగతి మర్చేపోయా...**

–ధరణీకోట శివరాం ప్రసాద్, హైదరాబాద్

**చచ్చాన్రో.. బాబూ! మామగారు మిలిట్రీలో 'కమాండర్' అని మర్చిపోయి పొరపాటు మాట మాట్లాడేశాను...!!**

–పి.ఎస్.ఎన్. రాజు,
హైదరాబాద్

